

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీగరుడవాహన పండితుడు రచించిన

# శ్రీదివ్యసూరిచరితంలో
# శ్రీరామానుజవైభవం

**( 16వ, 17వ, 18వ సర్గలు )**


అనువాదం - వివరణ

**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**


**భగవద్రామానుజ సహస్రాబ్ది మహోత్సవ స్మృతి**
**మరియు**
**ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి**
**87వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక**


**2017**

శ్రీదివ్యసూరి చరితంలో - శ్రీరామానుజవైభవం
(16వ, 17వ, 18వ సర్గలు) - గరుడవాహన పండితుడు

అనువాదం-వివరణము : డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

ప్రథమముద్రణము : జూలై, 2017
ఆవిష్కరణము : 8-7-2017
సందర్భము : ఉ.వే.శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్ర మహోత్సవము
వేదిక : త్రైవర్ణిక రామానుజ కూటం, విజయనగరం
ప్రతులు : 800
వెల : అమూల్యము.
అన్ని హక్కులు : అనువాదకునివే
ముఖచిత్రం : భగవద్రామానుజులు - శ్రీరంగం, తిరుమల, పెరుమాళ్ కోయిల్, తిరునారాయణపురం

ఈ గ్రంథము శ్రీమద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠులు, విజయనగరం వాస్తవ్యులు శ్రీమాన్ మంచుకొండ శ్రీనివాస, శ్రీమతి యతిరాజ నాథవల్లి తాయారు దంపతులు, వారి కుటుంబ సభ్యులు స్వాచార్య, జగదాచార్య కైంకర్య రూపంగా సమర్పించిన పవిత్రద్రవ్యంతో ముద్రింపబడినది.

యతిరాజనాథవల్లీశ్రీవాసౌ కృతినా విమౌ ।
స్వాచార్యజగదాచార్యసేవయా స్వానురూపయా ॥

ప్రతులకు : శ్రీమాన్ మంచుకొండ శ్రీనివాస,
శ్రీ తాయారు జ్యూవలరీస్
ఎస్.సి.ఎస్. రోడ్, విజయనగరం-535 001
సెల్ : 9346424158

డి.టి.పి. : యస్.చంద్రశేఖర్, తిరుపతి.
శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎస్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.



సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ
పండితరత్న, ఉభయవేదాన్త వాచస్పతి
**ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామి**

స్థానాచార్యులు
శ్రీఆదికేశవ ఎమ్బెరుమానార్ స్వామివార్ల దేవస్థానం
నరసాపురం, (ప.గో.జిల్లా)



# సాధువాదము

జగదాచార్యులైన భగవద్రామానుజుల వైభవాన్ని, చారిత్రక విశేషాల్ని తమ దివ్యగ్రంథముల ద్వారా (సంస్కృత - ద్రావిడ - ఆంధ్ర) వెలయించిన మహనీయులు పలువురు గలరు. వారిలో, భగవద్రామానుజుల శిష్యులై, శ్రీవారితో సన్నిహిత సంబంధం గలవారై, శ్రీరంగరాజదివ్యాలయ వైద్యశిఖామణులైన గరుడవాహన పండితులు విశిష్టులు. భగవంతుని విభవావతారాలైన శ్రీరామశ్రీకృష్ణుల విశేషాల్ని తెలిపే చంపూరామాయణ, యాదవాభ్యుదయాది కావ్యాలు విలసిల్లాయి గాని, జగదాచార్య వైభవాన్ని తెలిపే, చారిత్రకాంశములతో గూడిన కావ్యాలు వెలుగు చూడలేదు. ఆ కొఱత తీరేటట్లు గరుడవాహన పండితుల **"దివ్యసూరిచరితమ్"** అవతరించింది.

ఈ కావ్యంలో ఇతివృత్తం పన్నిద్దరాళ్వార్ల చారిత్రకాంశములతో ప్రారంభమై, భగవద్రామానుజుల అవతార సమాప్తి వరకు గల కథాభాగం. ఈ కావ్యం ఉపమ - ఉత్ప్రేక్ష మొదలగు అలంకారములతో రంజితమై, సర్గాంతమున విభిన్న వృత్తములతో నలరారుచున్నది. కాళిదాసు, భారవి మొదలగు సంస్కృత మహాకవుల కావ్యగుణాలైన మాధుర్య ప్రసాద గుణము లిందు ప్రస్ఫుటంగా గోచరించును. మహాకావ్యములలో కన్పించు అష్టాదశ వర్ణనములలో కొన్ని సందర్భానుసారంగా ఇందు కూర్చబడియున్నవి. ఇందలి 17వ సర్గలో ఆదిశేషులు భగవద్రామానుజులుగా నవతరించినారని కవి వర్ణించుచు, ఆదిశేషునిలో గల కొఱత శ్రీరామానుజుల లేదని వర్ణించిన 7వ శ్లోకం పరమహృద్యముగా నున్నది. దాని భావం ఇది - "ఆదిశేషుడు,

చూపరులు భయపడే తన సర్పరూపాన్ని మీడి, ముల్లోకాలు పాదాక్రాంతు లగునట్టి బాలభానుని ప్రకాశంతో గూడిన సుందరాకారాన్ని స్వీకరించినాడు. అంతియే గాదుహా ఆదిశేషుని (సర్పానికి) విషం గ్రక్కే రెండు నాలుకలు వంకర టింకర గమనం సహజం. పైరెండు దోషాలు లేకుండుటయే గాదుహా అమృతతుల్యములైన వాక్కులు, ఋజువర్తనం, అక్లిష్టవాక్యరచన శ్రీరామానుజుల సొంతం.

ఇట్లే, పరమపదనాథుడు శ్రీపెరుంబూదూర్ దివ్యక్షేత్రంలో ఆదికేశవ ప్పెరుమాళ్‌గా అర్చారూపంలో వేంచేసియుండుటకు కారణం - అవతరింప బోవు తన భక్తుడైన శ్రీరామానుజుల విశ్లేషాన్ని సహింపలేకపోవుటయే - అని కవి వర్ణించినాడు. తిల్లైత్తిరుచ్చిత్తిరకూటంలో భగవానుడు చక్రవర్తిత్తిరు మగన్‌గా అర్చా రూపంలో వేంచేసియుండుటకు హేతువు - **"తిడర్‌విళంగు మారుతి యోడమర్‌న్దాన్ తన్నై"** అని విభవావతారంలో హనుమవిషయంలో తనకు గల ప్రేమను వీడలేకుండుటయే - అని శ్రీకులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించారు. ఈ కులశేఖరుల సూక్తియే గరుడవాహన పండితుని పై సూక్తికి ప్రరోచకమనుట స్పష్టం. ఆళ్వార్ల, ఆచార్యవైభవాన్ని కావ్య, గద్య రూపంగా అనుగ్రహించిన పూర్వాచార్యులకు ఈ దివ్యసూరి చరితమ్ మార్గదర్శకమనుట స్పష్టం.

భగవద్రామానుజ సహస్రాబ్ది సందర్భంగా 18 సర్గలు గల ఈ మహాకావ్యంలో నాథయామున రామానుజవైభవాన్ని తెలిపే 16-17-18 సర్గలు వివరణ - విశేషాలతో తెలుగులో ప్రకటింపబడుట ప్రపన్నుల భాగధేయం. ప్రాస్తావికంతోబాటు (మున్నుడి) శ్లోకాల్లోని భావాల్ని, అందలి విశేషాల్ని వివరించినవారు - పండితరత్న, వేదాన్త వాచస్పతి ఇత్యాది బిరుదాంచితులైన డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ.శింగరాచార్యస్వామివారు. పుంఖాను పుంఖము లుగా వీరి లేఖినినుండి వెలువడు శ్రీసూక్తులు సంప్రదాయస్థులకు అమృత తుల్యములు.



విజయనగరంలోని త్రైవర్ణిక వైష్ణవ రామానుజ గోష్ఠి మిగిలిన ప్రపన్న గోష్ఠులకంటె విలక్షణమైనది. కారణం - ఈ గోష్ఠికి భగవద్రామానుజులే కులదైవం. ఆచార్యాభిమానమే ఉత్తారకం. దీనికంతయు కారణం - **కీర్తిమూర్తి, ఉభయవేదాన్తవిద్వత్తల్లజులైన డా॥ కందాళ - వేంకటాచార్యస్వామి వారి** కృపా విశేషమే. శ్రీస్వామివారి అవ్యాజ - ఉదారభావమే. శ్రీస్వామివారు జూపిన భగవద్భాగవతాచార్య కైంకర్య మార్గంలో గోష్ఠీ సభ్యులు ప్రవర్తించు నట్లు కాలక్షేప ఉపదేశాదులచే అనుగ్రహించేవారు - **ఉభయవేదాన్త విదుషీమణి, శ్రీమతి జానకమ్మగారు.**

ఆచార్య వరివస్యగా ఈ గ్రంథాన్ని తమ పవిత్రద్రవ్యంతో ముద్రింప జేసినవారు - **శ్రీమతి & శ్రీమాన్ మంచుకొండ నాథవల్లి యతిరాజ దంపతులు.** ఈ దంపతులకు దివ్యదేశవాసమే స్వగృహవాసము. దివ్యదేశము లలో వేంచేసియున్న అర్చామూర్తుల కల్యాణగుణానుభవమే భోజనం. **"ఎల్లామ్ కణ్ణన్"** అనే నిష్ఠ వీరిది. ఈ దంపతులకు, వారి కుటుంబ సభ్యులకు ఇతోధికమైన ఆయురారోగ్య ఐశ్వర్యాదులను, ఆచార్య సేవానిష్ఠను కృపజేయ వలసినదిగా అస్మదారాధ్యదైవమైన స్వామి ఎంబెరుమానార్ల సన్నిధిలో ప్రార్థించుచున్నాను.

సన్తు శ్రేయాంసి భూయాంసి

**కె. వేంకటాచార్యులు**

స్థానాచార్యులు




ఎడిటర్:- భక్తినివేదన, సీతానగరము



# గరుడవాహన వైభవము

మహానుభావుల చరితాలు చాలా సందిగ్ధంగా ఉంటాయి. కారణం - వారి చరితాన్ని వారి కాలంలోనే భద్రపరచిన రచనలు కొరవడటమే. అయితే, కొందరు మహనీయుల చరితాలకు ఆ దుఃస్థితి లేదు. ముఖ్యంగా శ్రీవైష్ణవ సత్సంప్రదాయానికి చెందిన భగవద్యామున, భగవద్రామానుజుల చరితాల లోని సర్వప్రధానాంశా లను వారి కాలంవారే గ్రంథస్థం చేసి పరిరక్షించారు. భగవద్రామానుజ చరితాన్ని వారి శిష్యులైన వడుగనంబి, గరుడవాహన పండితుడు, శ్రీమదనన్తార్యులు తమ గ్రంథాల్లో ఉపక్షిప్తం చేశారు. ఆంధ్రపూర్ణుల రామానుజాష్టోత్తరమూ ఉంది. వడుగనంబి వాసిన యతిరాజ వైభవంలో రామానుజ చరితాన్ని, సంగ్రహ మనోహరంగా ఆవిష్కరించారు. స్వయంగా భగవద్రామానుజులు అంతరంగులైన తమ శిష్యులను ఆయా కృత్యాలలో నియోగించి, తనను కూడా తన అనర్హతను గుర్తింపక, తమ కైంకర్యంలో దాసునిగా నియోగించినారని 113వ శ్లోకంలో ఉట్టంకించారు, వడుగనంబి. రామానుజుల జన్మ ప్రభృతి - ఆ మహానుభావులు చేసిన ఎన్నో కృత్యాలను విశదపరచారు. ఇది రామానుజుల సమగ్రచరితసంగ్రహం అనడంతో సందేహం లేదు.

ఇక, అనన్తార్యులు భగవద్రామానుజ నియుక్తులై తిరుమల క్షేత్రంలో ఎన్నో కైంకర్యాలు నిర్వహించడమేకాక, తిరుమలేశుని శ్రీనివాసునిగా యాదవరాజ సభలో నిర్ధారించి, ఆయా వ్యవస్థలు సరిదిద్దిన వైనాన్ని తమ వేంకటాచల ఇతిహాసమాలలో విశదపరచారు. ఇది రామానుజుల సమకాలిక



రచనం. ఇలాగే భగవద్రామానుజుల శిష్యులైన ఆంధ్రపూర్ణులు, (వీరే వడుగనంబి) యతిరాజ వైభవంతోపాటు రామానుజాష్టోత్తరాన్ని వ్రాసినా, అందులో ఉన్న **"విశిష్టాద్వైత పాలకాయ"** అన్న నామం, ఈ అష్టోత్తరం ఆంధ్రపూర్ణ కృతమేనా? అనే సందేహాన్ని కలిగిస్తున్నది. కారణం - ఆనాటికి విశిష్టాద్వైతమనే పేరు రామానుజ దర్శనానికి రాకపోవడమే. విశిష్టాద్వైత పదాన్ని మొట్టమొదటిగా ప్రయోగించినవారు సుదర్శనసూరి, కనుక, ఆంధ్రపూర్ణులు సుదర్శనసూరికి పూర్వులు కనుక, విశిష్టాద్వైత పదాన్ని ప్రయోగించే అవకాశం లేదు కదా!

ఇక, భగవద్రామానుజులచేత శ్రీరంగమందిరంలోని ధన్వన్తరి సన్నిధిలో ఔషధ రస సమర్పణానికై నియోగింపబడిన గరుడవాహన పండితుడు తాను వ్రాసిన **"దివ్యసూరిచరితం"**లో శ్రీమద్యామున చరితంతోపాటు రామానుజుల చరితాన్ని కూడా వర్ణించాడు. సాక్షాత్తుగా రామానుజుల రంగమందిరంలో తనకు ఔషధదానబాధ్యతను ఇచ్చినట్లు గరుడవాహన పండితుడు స్వయంగా తన గ్రంథంలో చెప్పుకున్నాడు.

**రాజ్ఞీయోపచరణలాలసో మురారౌ**
**తద్దోషప్రశమ మదాపయత్ కషాయమ్ ।**
**ఆరోగ్యోపపద మథాకలయ్య శాలాం**
**శ్రీధన్వన్తరి హరిధామ తచ్చకార ॥**
**రంగేందో స్స గరుడవాహన భట్టక్లుప్తం**
**పథ్యాయానుదిన మహాదాపయత్ కషాయమ్॥**

రాజోచితమైన ఉపచారం సమర్పించాలనే పరమప్రీతి కల భగవద్రామానుజులు, శ్రీరంగనాథునికి ప్రసాద నివేదన సమయంలో ప్రసక్తమయే దోషాన్ని ప్రశమింపచేయడానికి కషాయాన్ని సమర్పింప జేసారు. స్వామికి ఆరోగ్య విషయకంగా స్వాస్థ్యానికి ధన్వన్తరిని ప్రతిష్ఠించి, ఒక మందిరాన్ని నిర్మింపచేసారు. శ్రీరంగనాథునికి గరుడవాహన భట్టుద్వారా కషాయం తయారు చేయించి, నిత్యం సమర్పింపజేశారు, రామానుజులని స్వయంగా

చెప్పుకొన్నాడు, దివ్యసూరి చరిత కర్త గరుడవాహన పండితుడు. ఈతడు కవివైద్య ప్రవరుడు. 19 సర్గల్లో కావ్యాన్ని నిర్మించి, ఆళ్వారుల నాథముని-యామున-రామానుజా చార్యుల చరితాన్ని మనోజ్ఞంగా వర్ణించాడు.

భగవద్రామానుజుల అవతారాన్ని వర్ణిస్తూ గరుడవాహనుడు ఇలా అన్నాడు.

**శుద్ధాత్మా హృదయనివిష్టకైటభారిః**
**చక్రాంకో ధృతసకలక్షమాకలాపః ।**
**సర్వేషాం మరుదభినందితాత్మవృత్తిః**
**శేషత్వం ప్రకటయతిస్మ యోపరోక్షమ్ ॥**

శేషత్వాన్ని ప్రత్యక్షంగా రామానుజులు ప్రకటించారట. ఎలా? శేషుడు తెల్లని ఆకారం కలవాడు. రామానుజు విశుద్ధస్వరూపం కలవారు. శేషుడు తన హృదయస్థానంలో స్వామిని తాను తల్పంగా ఏర్పడి శయనింప చేసికొన్నాడు. రామానుజులు తమ హృదయంలో శ్రీహరిని ఉంచుకున్నారు. శేషుడు చక్రాంకచిహ్నాలు పడగపై కలవాడు. స్వామి రామానుజులు చక్రాంకన సంస్కార సంపన్నులు. ఈ సమస్త భూమండలాన్ని ధరించాడు శేషుడు. రామానుజులు సర్వులపట్ల (లేదా, సార్వవిషయంగా) క్షమను (సహనాన్ని) వహించినవారు. ఇక, శేషుడు వాయువుచేతనే జీవిస్తూ, తన జీవనవృత్తిని సర్వాభినందనీయంగా నిర్వర్తించాడు. ఇక, రామానుజులు **"సర్వేషాం మరుత్"** - సర్వులకూ ప్రాణప్రాయులై, అభినందింపదగిన స్వీయజీవన వ్యవహారం కలవారు. ఈ విధంగా రామానుజులు తాము సాక్షాత్తూ శేషుడేనని ప్రకటించారట.

శేషుడు తన భుజంగ రూపాన్ని విడచి, సర్వస్పృహణీయమైన త్రిభువన వందితమైన రూపాన్ని పొందాడట. ఎందువల్ల? సహజంగా తన ముఖంనుండి విషమమైన, విషాన్ని వెడలిగ్రక్కే రెండు నాల్కల వ్యవహారం కలవాడు. అంతే కాదు, విశేషంగా వక్రమైన గమన శైలి కలవాడు. ఇది లోకానికి అపకారకమే తప్ప, ఉపకారకం కాదని భావించి, తన విషముఖత్వ-ద్విజిహ్వాత్వ - వక్రగతి



శీలత్వాదులను విడచి, అమృతముఖుడై, ఏకజిహ్వుడై, ఋజుగతియై, రామానుజునిగా త్రిభువన కమనీయమైన రూపాన్ని ధరించినాడటంటాడు, కవి.

**వక్త్రోద్యద్ విషమవిషాకులద్విజిహ్వా-**
**వ్యాపారం విహితవిజిహ్మగత్వభంగి ।**
**భౌజంగం వపు రపహాయ శేషభోగీ**
**యద్రూపం త్రిభువన వందితం జగామ ॥** అన్న శ్లోకం పై భావాన్ని వ్యక్తపరుస్తున్నది.

భగవద్రామానుజ చరితానికి సంబంధించిన కొన్ని సంశయగ్రస్తాలైన విషయాలున్నాయి. 1, 2 అంశాలలో గరుడవాహన పండితుని అభిప్రాయాలు గమనించుదాం.

గోష్ఠీపూర్ణుల వద్ద రామానుజులు అష్టాక్షరిని గ్రహించారా? తదర్థాన్నా? చరమశ్లోకాన్నా? తదర్థాన్నా? అన్న విషయంలో యతిరాజ వైభవకార్తులైన ఆంధ్రపూర్ణులు ఇలా అన్నారు.

**తతో మహాపూర్ణగురోః నియోగాత్**
**ప్రణమ్య గోష్ఠీపురపూర్ణపాదౌ ।**
**మంత్రార్థ తచ్ఛ్లోకవరార్థశిక్షాం**
**ప్రాప్యాథసోఽశిక్షయదప్యనేకాన్ ॥**

అటుతరువాత మహాపూర్ణగురు నియోగం వల్ల గోష్ఠీపూర్ణుల పాదాలకు ప్రణమిల్లి, మంత్రార్థ - శ్లోకార్థాలు గ్రహించి, లోకానికి వాటిని అనుగ్రహించారని చెప్పడంచేత ఇక్కడ అష్టాక్షరీమంత్ర - తదర్థాలా? ద్వయ-తదర్థాలా? అని సందేహం. వాస్తవానికి వీరికి అష్టాక్షర ద్వయాలను మహాపూర్ణులే అనుగ్రహించారు. కాగా, వాటి అర్థవిశేషాలను గ్రహించే క్రమంలో అష్టాక్షరార్థాన్ని గ్రహించి ఉండవచ్చు. శ్లోకార్థం అంటే, చరమ శ్లోకార్థం - అని అభిప్రాయం. దాన్ని కూడా గ్రహించి ఉండవచ్చు. ఇక్కడ గరుడవాహన పండితుడు,

**గత్వా లక్ష్మణయతి రంతికం దశాష్టౌ**
**వారానపి అనుపమగోష్ఠిపూర్ణసూరేః ।**
**గూఢం తత్ సచరమపద్యవాచ్య మాప్త్వా**
**విస్పష్టం జగదభిరక్షితుం జగాద ॥**

యతిపతి రామానుజులు గోష్ఠిపూర్ణుల వద్దకు పద్దెనిమిది సార్లు వెళ్ళి, గీతా చరమశ్లోక గూఢతాత్పర్యాలను వారినుండి పొంది, సంసార యాతనా పీడితులకు ఉపదేశించారని స్పష్టపరిచాడు, గరుడవాహన పండితుడు.

ఈతని నిర్ణయాలలో విశేషంగా గుర్తింపవలసినది - అష్టాదశ సర్గలో రామానుజులు కాశ్మీరంలోని శారదా పీఠానికి వెళ్ళడం. ఈ సన్నివేశాన్ని వర్ణిస్తూ, **"కప్యాసం వచన మభాణి"** ఇత్యాదిగా కొన్ని శ్లోకాల్లో రామానుజులు **"తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** అన్న శ్రుతికి స్వారసికంగా, శ్రీవైష్ణవసంప్రదాయప్రసిద్ధమైన అర్థాన్ని చెప్పి,

**"అద్య త్వం కమలవదితి అనన్యతార్థం ।**
**యద్వ్యాఖ్యః తదసి మమాపి పూజనీయః ॥** అని సరస్వతికి కూడా పూజనీయులు అయినారు రామానుజులని చెప్పి, శ్రీవేంకటాచపతి సన్నిధిలో రామానుజులు కటాక్షించిన వేదార్థ సంగ్రహమనే ఉపనిషత్ వేదాన్త సంగ్రహమే సరస్వతీదేవి సమ్మతితో పొందడానికి అక్కడ ఉంచినట్లు, రామానుజుల ఆ గ్రంథాన్ని ఆమె సానందంగా స్వీకరించి, విద్వాంసుల సన్నిధిలో రామానుజులను సరస్వతి ప్రశంసించిందని చెబుతూ, అటు తరువాత శ్రీబోధాయనులు రచించిన ఉపనిషత్ వృత్తిని పరిగ్రహించి, తమ భాష్యరచనాన్ని ఆపై సాగించినట్లు గరుడవాహన పండితుడు నిర్దేశించాడు. ఈ విషయంలో కూడా కొంత సంశయము ఉంది. పైన పేర్కొన్న ఘట్టంలో శ్రీభాష్యాన్ని సరస్వతీ సమీపంలో ఉంచలేదని, వేదార్థ సంగ్రహాన్నే ఉంచి, సమ్మతి పొందినట్లు స్పష్టమే కదా! మరి, శ్రీభాష్యాన్ని సరస్వతీ సన్నిధిలో ఎప్పుడుంచారు? శ్రీభాష్యకార అనే బిరుదాన్ని ఎప్పుడు పొందారు? అనే విషయాలు సందిగ్ధాలే. అయినా,



గరుడవాహన పండితుని రచనం రామానుజ కాలానిది అవడం చేత ఇక్కడ వర్ణింపబడిన సన్నివేశాలు మనం పరిగణంలోకి తీసుకొనవలసి ఉంటుంది.

ఇక, శ్రీయతిరాజ వైభవం అనే స్తుతి గ్రంథంలో ఆంధ్రపూర్ణులు పై ఘట్టాన్ని వివరిస్తూ **"తతో యతీశః"** అని ఆరంభించి మూడు శ్లోకాలు చెప్పారు **(87,88,89).** ఈ మూడు శ్లోకాల్లోని అభిప్రాయం ఇది. అటు తరువాత యతీశ్వరులు దిగ్విజయానికై పలువురు శిష్యులను వెంటబెట్టుకొని ఆయా ప్రదేశాల్లో పర్యటనం చేసి, సరస్వతీ పీఠానికి వెళ్ళారు. అక్కడ భగవద్రామానుజులు సమర్పించిన సూత్రభాష్యాన్ని తన శిరస్సున ఉంచుకొని. **"శ్రీభాష్యమేతత్ వరభాష్యకృత్ త్వం ఇతీవ తస్మై ప్రదదౌ చ దేవీ"** అని నిర్దేశించి, రామానుజుల భాష్యాన్ని శ్రీభాష్యమని, రామానుజులను భాష్యకారులని సరస్వతీదేవి సమ్మానించినట్లు, హయగ్రీవుని అర్చనార్థమై అనుగ్రహించినట్లు వడుగనంబి వ్రాసారు.

రామానుజుల మేల్కోటై (తిరునారాయణపురం) యాత్రా విషయంలో కూడా ఆధునిక చరిత్ర వివేచకులకు సంశయాలు కొన్ని ఉన్నాయి. కొందరు రామానుజుల కాలానికి ఢిల్లీని పరిపాలించిన తురుష్క ప్రభువు ఎవరూ లేరని, ఢిల్లీశుని గృహంలో రామానుజులు రామప్రియ విగ్రహం స్వీకరించడం, ఢిల్లీశ పుత్రిక రామానుజులను అనుసరించడం మొదలైన విషయాల చారిత్రకత పరిశీలింపవసి ఉన్నదని అంటున్నారు. ఈ విషయంలో గరుడవాహన పండితుడు, ఆంధ్రపూర్ణులు - ఇద్దరూ రామానుజుల ఢిల్లీ ప్రయాణాన్ని చాలా స్పష్టంగా వర్ణించడం గమనించవచ్చు. రామానుజులు తిరుమల క్షేత్రాన్ని దర్శించిన వైనాన్ని, అక్కడ వేంకటేశ్వరుని వర్ణించిన విధానాన్ని గరుడవాహన పండితుడు చాలా అందంగా వర్ణించాడు. గరుడవాహన పండితుని దృష్టిలో రంగనాథునికి, వేంకటేశ్వరుని భేదం లేదు. "సృష్ట్యాది ప్రక్రియతో అలసిన స్వామి రంగనాథుడై శేషశయ్యపై శ్రమ దీరుతుంటే, తాను వేంకటేశ్వరుడై నిలుచుండి, నిరంతరము లోకాన్ని అనుగ్రహిస్తున్నాడు" అని చమత్కారంగా వర్ణించాడు, గరుడవాహన పండితుడు.

శ్రీరంగే విహితఫణీంద్రభోగతల్పం
నిద్రాణం నిగమశిరోవిహారి వస్తు।
తల్లక్ష్మ్యా సహ ఫణిశైలమూర్ధ్ని నిద్రాం
త్యక్త్వా తాం విహరతి పూరుషః పరోత్ర ॥
వైకుంఠం కలిసమయే భువి ఇదమేవ
స్వామ్యస్మిన్ ధృవ మయ మాశ్రయో ఖిలానామ్ ।
యల్లక్ష్మ్యాః విభురతివాంచిత ప్రదాయీ
దేవానామపి పదసేవిదానవానామ్ ॥
కారుణ్యస్తబకితచక్షుషే నమస్తే
కామిన్యా కబలితవక్షసే నమస్తే।
నాగేంద్రాలయ గృహమేధినే నమస్తే
సంత్రాణా మభిమతదాయినే నమస్తే॥

శ్రీరంగక్షేత్రంలో రామానుజులు చేసిన దశవిధ భృత్య పరిగణాన్ని, ఆయా వ్యవస్థలను గరుడవాహన పండితుడు వర్ణించినంతగా మరెవ్వరూ వర్ణించలేదు. ఇలా, పరమస్పృహణీయంగా రామానుజు చరితాన్ని లోకానికి రామానుజుల కాలంలోనే అందించిన గరుడవాహన పండితుని "దివ్యసూరి చరితం"లోని రామానుజ చరిత భాగాన్ని సర్వజన సులభమైన వివరణంతో లోకానికి అందిస్తున్నారు, మన శింగరాచార్య స్వామివారు. దీనిని రామానుజ కైంకర్యంగా ఈ సహస్రాబ్దిలో లోకానికి అందిస్తున్న **భాగవత శ్రేష్ఠులు, శ్రీమాన్ మంచుకొండ శ్రీనివాస, శ్రీమతి యతిరాజనాథవల్లీ తాయారు దంపతులకు, వారి కుటుంబానికి** అనేక మంగళాశాసనాలు. ఇదే క్రమంలో రామానుజుల చరితం ఎక్కడెక్కడ వర్ణింపబడిందో ఆ భాగాన్నంతటినీ సంకనం చేసి ఏకత్రితంగా ఒక గ్రంథాన్ని ముద్రించడం ఎంతైనా అవసరం అని మనవి చేస్తున్నాం.

ఇట్లు






శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



**భాగవతామృతవర్షి**

## ఉ.వే. శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్య స్వామివారు

**శ్రీ వేంకటాచార్య వైదిక సంస్థాన్, శ్రీ శ్రీవైష్ణవశ్రీ, ఎస్.ఆర్. పురం**
**శౌంత్యాం రోడ్, విశాఖపట్నం**

卐卐卐卐卐

ఈనాడు లోకమంతయూ శ్రీభగవద్రామానుజుల సహస్రాబ్ది ఉత్సవ సంరంభముతో నుండుట ఆనందావహము. జగదాచార్యుల వరివస్యగా ఈలోకమంతయూ తమ తమ అవధులలో ఉత్సవాలను నిర్వహించు కొనుచున్నారు. ఏ కొందరికో కాక, అందరి కొఱకై అవతరించిన మహనీయులు, స్వామి. వారిని స్మరించుకొనకపోతే మనము కృతఘ్నులమే. శక్తి, ఆసక్తులను బట్టి శ్రీస్వామిరామానుజుల లోకోపకారచేష్టలను లోకమంతయూ తెలుసుకొను రీతిని శాశ్వతచిహ్నాముల నేర్పరచుట, విశేషోత్సవాలను నిర్వహించుట, పండిత సభలను నిర్వహించుట, గ్రంథము లను ముద్రించి అందించుట - ఇత్యాది రీతులలో అందరూ తమ భక్తిప్రపత్తు లను చాటుకొనుచున్నారు. సుమారుపాతిక సంవత్సరములకు ముందు నుండియు శ్రీవైష్ణవ సిద్ధాంతప్రచారమును కీర్తిమూర్తులు, ఉభయవేదాంతా చార్య పీఠవ్యవస్థాపకులు, నిర్వాహకులు అయిన అవతారమూర్తులు పరమహంస పరివ్రాజకాచార్యులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్స్వామి పాదుల, న్యాయవేదాన్తవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ తెలికిచర్ల కందాడై గోపాలాచార్యస్వామివారి** ప్రత్యక్ష, పరోక్ష నిర్వహణములో, ఉత్తరాంధ్రంలో తలమానికమన దగ్గ రీతిలో శ్రీవైష్ణవశ్రీతో విలసిల్లు విజయ నగరమునందు **కీర్తిమూర్తి, ఉ.వే.విద్వాన్ శ్రీమాన్ కందాళ వేంకటాచార్య**

స్వామివారు నాన్యతో దర్శనీయముగ నిర్వహించు చుండెడివారు. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీత్రిదండి చినశ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారి మంగళాశాసనము లతో నేటిదనుక అవ్యాహతముగా ఈ సభలు కొనసాగించుట తెలుగుల భాగ్యమే.

అచ్చటి త్రైవర్ణికభక్తులను వారు మలచిన రీతి అత్యంత స్పృహణీయము. వారి తదనంతము, వారి కుమార్తె **ఉభయవేదాంత విదుషీమణి శ్రీమతి జానకమ్మగారు వైభవముగా నిర్వహించుట అత్యంత ముదావహము.**

ఈ క్రమములో, ప్రతి సంవత్సరము ఒకొక్క శ్రీకోశమును కూడ ముద్రింపజేయుచూ సభలను నిరంతరము భక్తులు స్మరించుకొనునట్లుగ జ్ఞాపికను ఆవిష్కరించుట విశేషము. ఈసంవత్సరము సభలలో కూడా భగవద్రామానుజుల దివ్యచరిత్రమును, వారికి స్ఫూర్తిదాయకులగు పూర్వాచార్యుల దివ్యచరిత్రములను తెలుగువారికి సౌకర్యముగ అందించుట మరింత సమంజసము. ఆ గ్రంథప్రణయన యజ్ఞములో ప్రధానముగ అనువాద బాధ్యతను స్వీకరించి అందించు మహనీయులు - ఉ.వే. ప్ర. **వ్యాఖ్యాన వాచస్పతి, శ్రీమాన్ ఈయుణ్ణి శింగరాచార్యస్వామివారు.** వీరిని ఆంధ్ర పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుట అతిశయోక్తి కాదు. ప్రామాణికమైన అనువాదమును, కూలంకషమైన అనుశీలనమును వీరి గ్రంథములయందే మనము కాంచవచ్చును.

శ్రీభగవద్రామానుజుల సమకాలీనులు శ్రీగరుడవాహనసూరి యను పండితులు. వీరు, సమకాలికులు మాత్రమే కాక, అంతేవాసులు కూడ. భగవద్రామానుజులు శ్రీరంగమునందు పురాణప్రసిద్ధమై, శిథిలమైయున్న శ్రీధన్వంతరి ఆలయమును ప్రతిష్ఠించి, శ్రీగరుడవాహన పండితులను ఆ ఆలయ నిర్వహణము జేయుచు, రాత్రి శ్రీపెరియపెరుమాళ్ పవళింపుసేవలో తిరుక్కాప్పులు శాత్తుసమయమునకు ఈ ధన్వంతరి ఆలయమునుండి



పాలు మున్నగు నైవేద్యము సమర్పించునటుల చూడవలసినదిగా ఆదేశించిరని కోయిలొళుగు తెలుపుచున్నది.

**"పూర్వమ్ పురాణసిద్ధమాయ్, జీర్ణమాయిరున్ద ధన్వన్తరియై ప్రతిష్ఠిప్పిత్తు, అన్ద క్కోయిలై గరుడవాహన పణ్డితరుక్కు కట్టళైయిట్టు, అవరిడత్తిలుమ్ నిత్యమాక రాత్రి తిరుక్కాప్పు శేర్‌క్కిఱదుక్కు మున్నాక కుడినీర్, పాల్ అలఙ్కార మాగ వన్దు అరుళ్‌శెయ్‌దరుళుమ్బడి దిట్టమ్ పణ్ణి"** అనునవియే అందలి వాక్యములు. వీరిచే రచింపబడిన దివ్యసూరిచరితము అను గ్రన్థము నందలి ప్రకృతభాగమును తెలుగున సంక్షిప్తవివరణముతో లోకమున కందించుట చాలా ఉపకారకము.

**శ్రీమాన్ మంచుకొండ శ్రీనివాస, శ్రీమతి యతిరాజ నాథవల్లీ తాయారు దంపతులు** తమ ఆచార్యులగు కీర్తిమూర్తి శ్రీవేంకటాచార్యస్వామి వారిని ప్రత్యక్షముగ సేవించుకొనుటయే గాక, వారి అనంతరము కూడ శ్రీమతి జానకమ్మగారి ఆదేశవర్తులై, ఈగ్రన్థముద్రణ కైంకర్యమును కూడ నిర్వహించుకొనుట మిక్కిలి భాగ్యము. సార్థకమైన సంపద వీరిది. వీరికి, వీరి కుటుంబమునకు ఇంకా ఉత్తరోత్తరాభివృద్ధిగా భగవద్భాగవతాచార్య కైంకర్యమును, ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధితో చేసుకొను భాగ్యమును ప్రసాదించమని శ్రీసింహాద్రినాథుని ప్రార్థించుచున్నాను. దాసునికి ఈ అవకాశమును కల్పించిన **శ్రీమాన్ స్వామివారికి, శ్రీమతి జానకమ్మగారికి** అనేక కృతజ్ఞతాభివందనములు.

శ్రీవైష్ణవదాసః

సా॥ గో॥ కృష్ణమాచార్

## మంచుకొండ శ్రీనివాస, యతిరాజనాథవల్లితాయారు దంపతులు,

విజయనగరము.

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే వేంకటార్యాయ నమః

వాధూలాన్వయసంజాత మప్పలార్యతనూభవమ్ ।
గోపాలాచార్యసచ్ఛాత్రం వన్దే వేంకటదేశికమ్ ॥

సహృదయులు, భాగవతోత్తములు అయిన పెద్దలందరికి రామానుజ దాసులు మంచుకొండ శ్రీనివాస, యతిరాజనాథవల్లి తాయారు దంపతులు దాసోహములు సమర్పిస్తూ చేసుకొను విన్నపములు. ఈ సంవత్సరము మా ఆచార్యులు ఉ.వే.శ్రీమాన్ కందాళ వేంకటాచార్య స్వామివారి వరివస్యగ (సేవగ) ఒక మంచి గ్రంథమును ముద్రణము కావించి, ఆవిష్కరించుకొనే మంచి అవకాశము మాకు లభించినది. ఈ సందర్భమున మా మనసులోని మాటలను మీకు నివేదించుకోవాలని ఆశపడుతున్నాము.

మా దంపతులకు పూర్వజన్మ సుకృతఫలముగ మంచి వంశమున జన్మించే భాగ్యము కలిగినది. మంచి వంశమున పుట్టడము మహాలక్ష్మి అనుగ్రహమని పెద్దలు చెప్తారు. **"శుచౌ వంశే జన్మ.... తావకదృశామ్"** మంచికి అండగా ఉండే మంచుకొండవారి ఇంట ప్రథమసుపుత్రునిగ జన్మించిన నాకు, చెన్నైకు చెందిన చుండూరువారి ఇంటి ఆడపడుచు సహధర్మచారిణిగ లభించినది. రెండు వంశములు సంపద, సంస్కారము, సంప్రదాయ ప్రవృత్తి కలిగినవి. ఒకదానికి ఒకటి సాటి అయినవి. మా దాంపత్య ఫలముగ మాకు సత్సంతానము కలిగినది. ప్రథమసంతానము లక్ష్మీస్వరూపముగ ఆడపిల్ల (సీతమ్మ), తరువాత వంశోద్ధారకులయిన ఇద్దరు మగపిల్లలు (శ్రీరామ్, భరత్) జన్మించారు. పెద్దల మంగళాశాసనములతో పిల్లలను పెంచి, ప్రయోజనములను చేసి, మా బాధ్యతను



నెరవేర్చుకున్నాము. పిల్లలు ముగ్గురూ చక్కని పద్ధతిలో తమ జీవితమును ఏలోటు లేకుండ గడుపుతున్నారు. అందరి మన్ననలను అందుకొంటున్నారు. అంతా ఆ ఏడుకొండలవాని దయ.

**"కలౌ వేంకటనాయకః"** అని వేంకటేశ్వరస్వామి కలియుగ ప్రత్యక్ష దైవము కదా! మాకు ఆ స్వామిని మించిన దైవము మరొకటి లేదు. మా కుటుంబమంతా శ్రీనివాసుని పాదదాసులము. ఆయనే మా ఇష్టదైవము. మాకు అభిమతప్రదాత కూడా ఆయనే. అడుగకుండానే అన్నింటిని వరములుగ అనుగ్రహించే ఆశ్రితవత్సలుడు మా శ్రీనివాసుడు. ఇది మాకు నిత్య సత్యము. మా మనసును దోచుకున్న మహిమాన్వితుడు మలయప్ప స్వామి. **"వినా వేంకటేశం న నాథో న నాథః సదా వేంకటేశం స్మరామి స్మరామి, హరే వేంకటేశ ప్రసీద! ప్రసీద ! ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ"** అని ప్రార్థిస్తూ ఉండటమే మా జీవన పరమార్థము. మా జీవితమునందు అధికభాగము తిరుమల శ్రీవేంకటేశుని దర్శనముతో ధన్యమయినది. ఇక ముందు కూడా ఇలాగే కొనసాగించాలని పెద్దలు మమ్ములను ఆశీర్వదించాలి.

అంతేకాదు. కుటుంబబాధ్యతను నిర్వహిస్తూనే. దివ్యదేశ సందర్శనము, కైంకర్యము, దివ్యదేశనివాససౌభాగ్యమును పొందగలిగేము. "ఇంటి కంటే గుడి పదిలము" అనే మాట మాకు చక్కగ అన్వయిస్తుంది. యాంత్రికమయిన ఈ గృహజీవనము కన్నా, పరమాత్మ ఇష్టపడి నిత్యనివాసము చేస్తున్న దివ్యదేశములలో నివసించుట మాకు క్రొత్త శక్తిని, ఉత్సాహమును, ఆనందమును కలిగిస్తుంది. భగవదనుగ్రహమువలన మాకు అటువంటి అవకాశము కూడా కలిగినది. **"శ్రీశస్థలేష్వన్వహం కైంకర్యమ్"** - దివ్యదేశములందు నిత్యకైంకర్యమును చేయమని భగవద్రామానుజుల ఆజ్ఞకదా! భగవద్దేశవాసము, భాగవతశేష ప్రసాదము మాకు లభించిన వరములు. దివ్యదేశములందలి భాగవతోత్తములు మా ఆతిథ్యమును

ప్రేమగ స్వీకరిస్తారు. తమ గృహమునకు మమ్ములను సాదరముగ ఆహ్వానించి తమ శేషప్రసాదమును అనుగ్రహిస్తారు. ఇది మా పెద్దల పుణ్యము. మేము చేసుకొనిన తిరుమల యాత్రలను లెక్కపెట్టలేదు. దానితో పాటుగ అష్టాక్షరీ క్షేత్రమయిన శ్రీబదరికాశ్రమమును 18 పర్యాయములకు పైన సేవించుకున్నాము. ఆండాళ్ళమ్మవారి అవతారస్థలమయిన శ్రీవిల్లిపుత్తూరు మాకు ఆత్మీయమయినది. శ్రీరంగనాథుని సన్నిధి (శ్రీరంగం) మాకు పెన్నిధి. రెండు తప్ప మిగిలిన 106 దివ్యక్షేత్రములను అన్నింటిని సేవించుకున్నాము.

ఇంతటి అదృష్టమునకు మూలకారణము - సదాచార్య సమాశ్రయణము. మా విజయనగరము శ్రీత్రైవర్ణిక వైష్ణవ రామానుజ కూటమువారి ఆధ్యాత్మిక వికాసమునకు, సంప్రదాయ విజ్ఞానమునకు సత్ప్రవృత్తికి మూలహేతువు - విజయధ్వజము, మా **ఆచార్యులు** ఉ.వే. **శ్రీమాన్ కందాళవేంకటాచార్య స్వామివారు**. వారు కృపామాత్రప్రపన్నులు. మా సుఖదుఃఖములను తమవిగ భావించిన ఆత్మీయులు. మాలో భగవంతునిపట్ల భక్తిని, సంప్రదాయ ప్రవృత్తిని, భగవద్రామానుజ సేవాభాగ్యమును పెంపొందించి, మంచి మార్గమును చూపిన మహనీయులు. **"గరీయాన్ బ్రహ్మదః పితా"** - భగవంతుని అనుగ్రహించిన ఆచార్యుడు కన్నతండ్రి కన్న మిన్న - అని అన్నారు కదా! **"వినా వేంకటార్యం న నాథో న నాథః, సదా వేంకటార్యం స్మరామి స్మరామి"** అని అనుకోవడము మా కనీసధర్మము. మాకులమునకు, ప్రత్యేకముగ విజయనగరము గోష్ఠివారికి అందిన గొప్ప భాగ్యము - మా వేంకటాచార్యస్వామివారు.

శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారు మాదంపతులకు గొప్ప ఉపకారము చేసినారు. మా పెద్దలు పొందలేకపోయిన ఒక భాగ్యమును మాకు కలిగించినారు. వారి ప్రోత్సాహముతోనే మేము వానమామలై జీయరు స్వామివారివద్ద సమాశ్రయణమును పొందినాము. పంచసంస్కారపరుల



మయినాము. మా ఆసక్తిని గమనించి, మంచి సూచన చేసి, మమ్ములను ఉద్ధరించినారు. నిస్స్వార్థముగ ఇతరులకు మేలు చేయుటలో వారికి వారే సాటి. సుమారు **35** సం॥లకు పైగా మాకు వారితో అనుబంధము ఉన్నది. సజ్జనసంగతి మంచి ప్రయోజనములను సాధించిపెడుతుంది కదా !

ఇన్నాళ్ళకు ఆస్వామివారికి ఈ విధముగ సేవచేసుకొనే అవకాశము కలిగినది. ఇప్పటికే ఆలస్యమయినదని అనిపించినా, ఈ సందర్భము అపురూపమయినది. భగవద్రామానుజుల సహస్రాబ్ది శుభవేళ ఇది. మా ఇష్టదైవమగు శ్రీవేంకటేశునికి శంఖచక్రములను ప్రసాదించి భగవద్రామానుజులు ఆయనకు ఆచార్యులయినారు. శ్రీనివాసుని (ఆచార్యుల) సేవగ, రామానుజ కైంకర్యరూపముగ ఈసంవత్సరము **"మా ఆచార్యవరివస్య"**ను చేసుకుంటున్నాము. **"శతం జీవ శరదః"** అని పెద్దలు మనలను ఆశీర్వదిస్తారు. వంద సంవత్సరముల పూర్ణాయుర్దాయమున ఈ దాసుడు శ్రీనివాసకు '70' సంవత్సరములు పరిపూర్ణమయినవి. (సప్తతి) మహోత్సవమును ఘనముగ చేయవలెనని పిల్లలు ఆశపడుతున్నారు. లౌకికమయిన విధానమున కాక, విలక్షణమయిన రీతిలో ఈ శుభసందర్భమును సంభావించుకోవలెనని మా కోరిక. మా విజయనగరము రామానుజకూటమునందు ఆత్మీయులయిన గోష్ఠివారితో (బంధువర్గముతో) భాగవతోత్తముల సమక్షమున, ఉభయవేదాంత పండితసభా సందర్భమున మహనీయులయిన మా ఆచార్యులు ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్రమున పండిత సమ్మానము, మంచి గ్రంథావిష్కరణమును చేసుకొని, ఆచార్యుల అనుగ్రహమును, భాగవత మంగళాశాసనములను, ఆత్మీయుల అభినందనములను అందుకొనే శుభవేళ ఇది. మా సూచనను పిల్లలు శిరసా వహించారు. మా ఆచార్య కుటుంబము ఆమోదించారు. **ఆచార్యపత్ని మా అమ్మగారు శ్రీమతి చిత్రా నీళాదేవిగారికి** ప్రత్యేకముగా దాసోహములు చేసుకొంటున్నాము. మా

ఆచార్యపుత్రిక, తండ్రి వారసత్వమును పొంది వారి బాధ్యతను స్వీకరించి గోష్ఠిని నిర్వహిస్తున్న శ్రీమతి జానకమ్మగారికి మనసారా కృతజ్ఞతలను తెలియజేసుకుంటున్నాము.

ఈ గ్రంథముద్రణ బాధ్యతను వహించి, మమ్ములను కృతార్థులను చేసిన ఉ.వే.శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారికి దాసోహములు సమర్పిస్తున్నాను. మాకు తమ అమోఘమయిన మంగళాశాసనములను అందించిన పెద్దలు ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారికి, ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారికి, ఉ.వే.శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారికి పాదాభివందనములు చేసుకొంటున్నాను. మా అభిప్రాయమును మన్నించి, ప్రోత్సహించిన రామానుజకూటము కార్యనిర్వహణవర్గమువారిని, అధ్యక్షులు శ్రీమాన్ దాసరి సుబ్బారావు (కృష్ణాజీ)గారిని, మహిళామండలివారిని మనసారా అభినందిస్తున్నాము. కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాము. మా స్థానాచార్యస్వామి శ్రీమాన్ పీసపాటి బదరీనాథాచార్యస్వామివారికి దాసోహములు.

మా దంపతులను, మా పిల్లలు - కుమార్తె శ్రీమతి దాసరి సీతమ్మ, అల్లుడు శ్రీమాన్ దాసరి సింగప్పెరుమాళ్, పెద్ద కుమారుడు శ్రీమాన్ మంచుకొండ శ్రీరామ్, కోడలు శ్రీమతి భార్గవి, చిన్న కుమారుడు శ్రీమాన్ మంచుకొండ భరత్, కోడలు శ్రీమతి విష్ణుప్రియ, (మనుమరాలుకూడా), మనుమలు, చిరంజీవులు దాసరి సుదర్శనచక్రత్తాళ్వాన్, దాసరి (మంచు కొండ) ధనలక్ష్మి, మంచుకొండ వెంకటకృష్ణ, (ధనవర్ధన్), మంచుకొండ అలిమేలుమంగతాయారు, మునిమనుమడు చిరంజీవి దాసరి అనంత హితేష్‌లను అందరినీ ఆశీర్వదించమని పెద్దలను, భాగవతోత్తములను ప్రార్థిస్తున్నాము. ఆచార్యసేవాభాగ్యము తరతరములకు లభించాలని కోరుకుంటున్నాము.

శ్రీమతే వేంకటార్యాయ నమః

ఇట్లు, రామానుజదాసులు





**పండితరత్న, సత్సంప్రదాయసుధాంబుధి, వేదాంతవాచస్పతి**

## ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ.శింగరాచార్యస్వామివారు

**తిరుపతి**

# ప్రాస్తావికం

సంస్కృతమహాకావ్యసుందరనందనోద్యానవనంలో గరుడవాహన పండితునిచే ప్రణీతమైన దివ్యసూరి చరితం అమృతఫల పూర్ణమైన ఒక కల్పతరువు. రఘువంశం, కిరాతార్జునీయం, శిశుపాలవధ, నైషధం, యాదవాభ్యుదయంవంటి మహాకావ్యాలు ఎన్ని ఉన్నా, వాటి అన్నికంటే ఈదివ్యసూరిచరితం విలక్షణమైనది. నైషధ, కిరాతార్జునీయాది కావ్యాలు ఆదర్శప్రాయమైన చరిత్రను కల మహాపురుషుల వైభవాన్ని తెలిపే లౌకిక కావ్యాలు కాగా, యాదవాభుదయకావ్యం సాక్షాత్తు శ్రీమన్నారాయణుని విభవావతార విశేషమైన శ్రీకృష్ణుని వైభవాన్ని అందించే ప్రథపర్వవైభవాత్మక మైనది. ఇక, ఈ దివ్యసూరిచరితం అయితే పరమభాగవతులైన దివ్యసూరుల, జగదాచార్యులైన శ్రీరామానుజుల దివ్యచరిత్రలను వర్ణించే మధ్యమపర్వ, చరమపర్వవైభవాలను ప్రతిపాదిస్తున్నందున వాటి అన్నిటికంటే ఇది విశిష్టంగా భాసిస్తున్నది.

ఈ కావ్యంలో మొత్తం 18 సర్గలున్నాయి. క్రీ.శ.1883 సం॥లో మైసూర్‌లో తెలుగులిపిలో చేయబడిన ముద్రణలో, క్రీ.శ.1953లో మహావిద్వాన్ కాంచీప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామి వారు కంచిలో చేసిన తెలుగులిపి ముద్రణలో కూడా 18 సర్గలున్నాయి. క్రీ.శ.1978వ సం॥లో బొంబాయినగరంలోని అనంతాచార్య రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌వారు శ్రీమాన్ కె.కె.ఏ.వేంకటాచార్యస్వామివారి (డైరెక్టర్) దర్శకత్వంలో దేవనాగరిలిపిలో ముద్రించిన ముద్రణలో కూడా 18 సర్గలే

ఉన్నా, అనుబంధంగా అసంపూర్ణమైన 19వ సర్గ ఒకటి అందులో చేర్చడం జరిగింది. చెన్నైనగరంలోని గవర్నమెంట్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలోని ఆర్.12545వ నంబరు గల తాళపత్రగ్రంథం ద్వారా ఆ భాగం లభించిందని తెలుపబడింది. ఆ సర్గలో 108 అసంపూర్ణమైన శ్లోకాలున్నాయి. అవి అన్నీ చిత్రబంధంలో కూర్చిన శ్లోకాలు. **"అథాంతేవాసినాం వర్యో వాధూలకుల భూషణః, అస్తౌద్దాశరథి శ్చిత్రబంధైరేవ యతీశ్వరమ్"** అని ఈ సర్గ ఆరంభమవుతున్నది. దీనినిబట్టి ముదలియాణ్డాన్ శ్రీరామానుజులను గూర్చి రచించిన చిత్రబంధాత్మకమైన శ్లోకాల సమాహారమే ఈ సర్గ అని తెలుస్తున్నది. కనుక ఈశ్లోకాలు గరుడవాహన పండితుడు రచించినవి కావని, ఈ కావ్యంలో అంతర్భవించినవి కావనేది స్పష్టం. అంతేకాక, ఈ అనుబంధంలోని శ్లోకాల శైలికి, కావ్యంలోని శ్లోకాల శైలికి కూడా చాలా భేదం కన్పిస్తుంది. అందువల్ల ఈ కావ్యం 18 సర్గలను కల్గినదిగా భావించడమే తగినదని తోస్తుంది.

ఈ కావ్యాన్ని రచించిన కవి పేరు గరుడవాహన పండితుడు. వీరు భగవద్రామానుజుల సమకాలీనులేకాక, వారితో సన్నిహితమైన సంబంధాన్ని కల శిష్యులనికూడా పలువురి అభిప్రాయం. వీరు వైద్యశాస్త్రప్రవీణులని, శ్రీరంగాలయంలో భగవద్రామానుజులచే ఏర్పాటు చేయబడిన వైద్యశాలకు అధ్యక్షులని, శ్రీరంగనాథునకు నివేదన చేసే ప్రసాదాలలోని గుణదోషాలను పరిశీలించే బాధ్యత వీరిదని కూడా తెలుస్తున్నది. ఒక పర్యాయం అర్చకుడొకడు శ్రీరంగనాథునకు దధ్యన్నప్రసాద నివేదన చేసిన వెంటనే నేరేడు పండ్లను నివేదన చేశారని, ఆరెండిటి కలయికవల్ల ఏర్పడిన దోషం కారణంగా శ్రీరంగనాథుని అర్చామూర్తిలో తేజస్సు తగ్గడం గమనించిన శ్రీరామానుజులు దానికి తగిన కారణాన్ని విచారించి గ్రహించి, తద్దోషనివారణోపాయంగా గరుడవాహన పండితునిచే కషాయాన్ని సిద్ధం చేయించి దానిని శ్రీరంగనాథునకు నివేదన చేయించారని కూడా ఐతిహ్యం. దీని ప్రస్తావన ఈ కావ్యంలోని 17వ సర్గ చివరలో గల 86వ



శ్లోకంలో గమనించవచ్చు. పురాతనమైన ధన్వంతరీ ఆలయాన్ని తిరిగి ప్రతిష్ఠించిన రామానుజులు, ఆ ఆలయ నిర్వహణ బాధ్యతను, ప్రతిదినం శ్రీరంగనాథునకు ఆ ఆలయం నుండి కషాయాన్ని, ఔషధ మిశ్రితమైన క్షీరాన్ని నివేదన చేసేటట్లు చూచే బాధ్యతను కూడా గరుడవాహన పండితునకు అప్పగించినట్లు కోయిలొழுగు అనే శ్రీరంగాలయ సమయాచారాలను తెలిపే ప్రాచీన ద్రావిడ గ్రంథం పేర్కొన్నది. ఇంతేకాక, ఈకావ్యం లోని చివరి శ్లోకాన్నిబట్టి చూస్తే ఈకావ్యరచనాకాలానికి శ్రీరామానుజులు సజీవులని కూడా తెలుస్తుంది. ఇందువల్ల ఈ కవికాలం భగవద్రామానుజుల కాలంగా భావించడంలో అనౌచిత్యం ఏమీ లేదు.

అయితే, ప్రొఫెసర్ శ్రీబి.వి. రామానుజం గారు, అనుబంధంగా చేర్చబడిన 19వ సర్గను ఆధారంగా చేసికొని ఈ కవికాలాన్ని క్రీ.శ. 15వ శతాబ్ది చివరలో గాని, 16వ శతాబ్ది ప్రారంభంలో కాని నిర్ణయించవచ్చునని అభిప్రాయపడ్డారు. కాని, ఈ అభిప్రాయం సహేతుకంగా, విమర్శసహంగా తోచదు. ఎందుకంటే - నంబిళ్ళైకు సమకాలీనులైన పిన్బழகరామ్ పెరుమాళ్ జీయర్ అనే పూర్వాచార్యులు ద్రావిడంలో రచించిన ఆఱాయిరప్పడి గురుపరంపరా ప్రభావమనే ఆழ்వారుల, ఆచార్యుల సంప్రదాయచరిత్ర గ్రంథంలో పలుచోట్ల దివ్యసూరిచరితంలోని పలు శ్లోకాలు ఉట్టంకింపబడ్డాయి. నంబిళ్ళైకాలం 13వ శతాబ్ది ఉత్తరార్ధం కనుక అంతకుముందే దివ్యసూరిచరితం రచన జరిగి ఉంటే తప్ప, అందులోని శ్లోకాలు ఉట్టంకింపబడే అవకాశం లేనందున, అంతకుముందే ఈకవి కాలాన్ని నిర్ణయించవలసి ఉన్నది. అందువల్ల, కావ్యంలో కన్పించే ఆంతర ప్రమాణాల వల్ల ఈ కవి శ్రీరామానుజుల సమకాలీనులని భావించడమే ఉచితం. అంతేకాక, కవి శ్రీరామానుజుల అనంతర కాలంవారే అయితే, భట్టర్ మొదలైన పూర్వాచార్యుల చరిత్రకూడా ఈకావ్యంలో చోటు చేసికొని ఉండేది. ప్రథమసర్గలోని 12వ శ్లోకంలో కవి తన కావ్యం శ్రీరామానుజ చరిత్రతో పూర్తి అవుతుందని **"లక్ష్మణార్యావసాయినామ్"** అని ఆరంభంలోనే పల్కడం గమనించాలి.

దివ్యసూరిచరిత్రంలో **"నగరార్ణవ శైలాబ్ధిచంద్రార్కోదయ వర్ణనమ్"** ఇత్యాదిగా మహాకావ్యంలో చేయదగినవిగా నిర్వచింపబడిన అష్టాదశ వర్ణనలు ఆ యా సందర్భాలకు అనుగుణంగా చేయబడ్డాయి. కాంచీపుర వర్ణన, శ్రీభూతపురి వర్ణనం, శ్రీవీరనారాయణపురం వర్ణనం, మొదలైన చోట్ల పురవర్ణనలు, శ్రీరంగనాథోద్యానవర్ణనం (6వసర్గ), శృంగారచేష్టా వర్ణనం (6వ సర్గ), ఋతువర్ణనం (15వ సర్గ), వేంకటాద్రి వర్ణనం (14వ సర్గ), విప్రనారాయణ చరితలో శృంగారచేష్టా వర్ణనం (6వ సర్గ), నాయకుని ఉద్యానవిహార వర్ణనం (11వ సర్గ), గోదాదేవి స్వయంవర వర్ణనం (12వ సర్గ) మొదలైన పలు మహాకావ్యోచితాలైన వర్ణనలు ఇందులో గోచరిస్తాయి.

ఆయా సన్నివేశాలను పాఠకుల కళ్ళకు కట్టినట్లుగా తోచే రీతిలో చక్కని పదప్రయోగాలను చేయగల్గిన సామర్థ్యం ఈ కవికి ఉన్నది. ఉదాహరణగా - మొదటిసారి శ్రీరంగానికి వెళ్ళిన శ్రీరామానుజులకు శ్రీయామునులను సజీవులుగా చూడలేక, వారి చరమశరీరాన్ని దర్శించ వలసిన స్థితి ఏర్పడినపుడు వారు పొందిన శోకస్థితిని వర్ణించే **"వ్యాకీర్ణ ప్రచలశిఖః" (17-41)** ఇత్యాది శ్లోకాన్ని గమనించవచ్చు. సందర్భాలకు తగిన లోకోక్తులను అందంగా ప్రయోగించగల్గిన నైపుణ్యం **"పయోభిలాషాత్ పాత్రం హి పరిగృహ్ణంతి సజ్జనాః" (1-13) "నో గణ్యో భవతి మహాత్మనాం కులాదిః", (17-46), "నోచ్ఛ్రాయం ప్రథయంతి సజ్జనః స్వకీయమ్" (17-47), "జాతిష్ఠః కిమలి రపేక్షతేన్యపుష్పమ్" (18-48)** మొదలైన సూక్తులలో స్ఫుటపడుతున్నది. శ్రుతిసుభగమైన అనుప్రాసాదిశబ్దాలంకారాలు, ఉపమ, ఉత్ప్రేక్ష, స్వభావోక్తి, శ్లేష, అర్థాంతరన్యాసాది అర్థాలంకారాలు ఇందులో కన్పిస్తాయి. "సర్గాంతే భిన్నవృత్తైశ్చ" అనే నియమాన్ని అనుసరిస్తూ భిన్నవృత్తప్రయోగంతో ప్రతిసర్గను ముగించడం కూడా కన్పిస్తుంది.

1,2,4వ సర్గల చివరలో **"కావ్యే దీవ్యతి దివ్యసూరిచరితే"** అనే మకుటంతో కన్పించే ముగింపు శ్లోకాలలో ఈకవి తమకు చెందిన కొన్ని విశేషాలను ప్రస్తావించారు. ఈకవి ఆచార్యులు వరవరాధీశులు, తండ్రి



వాధూలగోత్రులు, వరదులని వారి పేరు. తల్లి లోకేశ్వరి. తండ్రి శ్రీరంగా లయంలో ఆరోగ్యశాలకు అధిపతి. ఇతడు సర్వజ్ఞచూడామణి.

ఈ దివ్యసూరిచరితానికి, కాళిదాస రఘువంశకావ్యానికి మధ్య చాలా పోలికలు కన్పిస్తాయి. రఘువంశప్రారంభ శ్లోకం **"వాగార్థా వివ సంపృక్తౌ"** ఇత్యాదిగా ఆరంభమైనట్లే, ఈకావ్యం **"ప్రభార్యా వివ సంపృక్తౌ"** అని ప్రారంభమైనది. రఘువంశంలోని **"క్వ సూర్యప్రభవో వంశః"** అనే శ్లోకానికి సరూపంగా **"క్వ దివ్యసూరిచరితమ్"** అనే శ్లోకం, రఘువంశంలోని **"మందః కవియశఃప్రార్థీ"** అనే శ్లోకానికి సమానంగా **"ప్రాచాం ప్రశస్తిం ప్రాజ్ఞానామ్"** అనే శ్లోకం కన్పిస్తాయి. రఘువంశంలోని **"సోహ మాజన్మ శుద్ధానామ్"** అనే శ్లోకపరంపరకు దీటుగా ప్రకృతంలో **"శ్రీశసంకల్పపాత్రాణామ్"** ఇత్యాది శ్లోకాల పరంపర గోచరిస్తుంది. రఘువంశంలో పలు సూర్యవంశపు రాజుల చరిత్ర వర్ణింపబడినట్లే ఈకావ్యంలో కూడా పలువురి దివ్యసూరుల చరిత్ర వర్ణింపబడింది. 12వ సర్గలోని గోదా స్వయంవర ఘట్టం రఘువంశంలోని ఇందుమతీ స్వయంవరాన్ని గుర్తుకు తెస్తుంది. ఇటువంటి సామ్యాలు ఇంకా చాలా ఉన్నాయి.

మిగిలిన సంప్రదాయ చరిత్రగ్రంథాలలో కన్పించని కొన్ని విశేషాలు దివ్యసూరిచరితంలో గోచరిస్తాయి. రాజసభలో యామునులు "ఈ రాజు సార్వభౌముడు, నీ తల్లి గొడ్రాలు కాదు" అనే రెండు లౌకిక వాక్యాలు పల్కినట్లు తెలుపబడింది. మిగిలిన గ్రంథాలలో **"రాజపత్ని పతివ్రత"** అనే మూడవ వాక్యం కూడా పల్కినట్లు కన్పిస్తుంది. చోళరాజకుమారునకు బ్రహ్మరక్షస్సు పట్టినట్లు, యామునుల చరమదేహంలో శ్రీరామానుజులు ముడుచున్న మూడు వేళ్ళను కాక, వ్యాఖ్యానముద్రను చూచినట్లు ఈ గ్రంథంలో తెలుపబడింది. తిరుమల లోని అర్చామూర్తి విష్ణుస్వరూపమే- అని నిర్ణయించిన అంశంగాని, జీయర్‌వ్యవస్థను ఏర్పాటు చేయసిన వైనం కాని ఇందులో ప్రస్తావింప బడకపోవడం గమనించదగినది. ఈవిధంగా మిగిలిన చరిత్ర గ్రంథాలలోని వివరాలకంటే ఈ కావ్యంలోని వివరాలలో చాలా తేడాలు కన్పిస్తాయి.

శ్రీరామానుజులు ఈ విభూతిలో వేంచేసి ఉండే సమయంలోనే వారి చరిత్రను పూర్తిగా తెలిపే గ్రంథాలు రెండు సంస్కృత భాషలో రచింపబడ్డాయి. అందులో ఒకటి వడుగనంబి రచించిన యతిరాజ వైభవం కాగా, రెండవది ఈ దివ్యసూరిచరితం. యతిరాజవైభవం కంటే దివ్యసూరి చరితం విస్తృతమైనది. ఎక్కువ విశేషాలను తెల్పుతున్నది. శ్రీరామానుజులకు సమకాలంలో రచింపబడి, తరువాత కాలంలోని పూర్వాచార్యులచే గురుపరంపరాది గ్రంథాలలో ప్రమాణంగా గ్రహింపబడి నందున ఈ గ్రంథంయొక్క ప్రామాణ్యం, ఉపాదేయత స్పష్టపడుతున్నవి. ఈ కావ్యశైలి ప్రసన్నంగా సాగింది. అయితే **"ప్రయోజ్యానన పత్రభావమ్" (16-80)** వంటి కొన్ని ప్రయోగాల భావం స్పష్టం కాలేదు. యథామతి వివరింపబడింది. అనంతార్యులు రచించిన శ్రీవేంకటాచలేతిహాసమాల అనే గ్రంథం కేవలం తిరుమలలో శ్రీరామానుజులు చేసిన సంస్కరణలను, సమయాచారాల లోని కట్టుబాట్లను తెలిపే గ్రంథమే తప్ప శ్రీరామానుజ చరిత్రను సమగ్రంగా వర్ణించే గ్రంథం కాదు.

పూర్వాచార్యులచే దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో ప్రస్తావింపబడిన కొన్ని ఐతిహ్యాలకు ఈ గ్రంథం ఆధారమని చెప్పవచ్చు. ఇందులోని ప్రస్తావింపబడిన నాథమునులకు సంబంధించిన ఐతిహ్యం (**16** సర్గలో **34**వ శ్లోకం), శౌట్టైకులానికి సంబంధించిన ఐతిహ్యం (**16**వ సర్గలో **88, 89, 90**వ శ్లోకాలు) దీనికి ఉదాహరణాలుగా గ్రహించవచ్చు. వీటి వివరం ఆయా శ్లోకాల వద్ద తెలుపబడింది.

ఇటువంటి ఈ అమూల్యమైన గ్రంథానికి ఆంధ్రవివరణం ఇంతవరకు ముద్రింప బడనందున, ఇందులోని శ్రీరామానుజచరిత్రను తెలిపే **17**వ, **18** సర్గలను, వాటితోపాటు, శ్రీనాథమునుల నుండి శ్రీయామునుల పర్యంతం గల ఆచార్యుల చరిత్రను తెలిపే **16**వ సర్గను కలిపి తెలుగులో వివరణంతో ముద్రిస్తే, అది శ్రీరామానుజ సహస్రాబ్ది మహోత్సవ సందర్భంలో వారిపట్ల సమర్పించిన ఉత్తమ వాచికకైంకర్యం



కాగలదనే ఆశతో ఈ గ్రంథముద్రణ ప్రయత్నం చేయబడింది. త్వరలో మిగిలిన **15** సర్గల భాగం కూడా తెలుగు అనువాదంతో ప్రకటింపబడే అవకాశం భగవత్కృపవల్ల, శ్రీరామానుజుల దయవల్ల, ఆచార్యుల మంగళాశాసనంవల్ల లభిస్తుందని భావిస్తున్నాను.

ఈ మూడు సర్గలలోని శ్లోకాలకు తాత్పర్యంతో పాటు అక్కడక్కడ కొన్నివిశేషాలు తెలుపబడ్డాయి. వీలైన చోట్ల యతిరాజవైభవం, ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావం, ప్రపన్నామృతం వంటి సంప్రదాయ చరిత్రగ్రంథాలలోని సామ్యాలు ఉట్టంకింపబడ్డాయి. వీటితోపాటు, క్రీ.శ.**15 - 16** శతాబ్దుల మధ్య కాలానికి చెందిన వడివழకియ నంబిదాసర్ రచించిన శ్రీరామానుజ వైభవమనే ద్రావిడకావ్యం లోని విశేషాలు కూడా ప్రస్తావింపబడ్డాయి.

విజయనగరంలోని త్రైవర్ణికవైష్ణవరామానుజకూటం చిర కాలంగా శ్రీరామానుజ సంప్రదాయానికి ప్రసిద్ధమైన కేంద్రంగా విరాజిల్లుతున్నది. ఈ రామానుజ కూటంలోని వైష్ణవగోష్ఠిని తీర్చిదిద్ది, చక్కని సంస్కారాన్ని, సంప్రదాయ శ్రద్ధను పెంపొందించిన **మహనీయులు, కీర్తిమూర్తులు ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్య స్వామివారు.** వీరి తిరునక్షత్రమహోత్సవాలు రామానుజ కూటంలో ప్రతిసంవత్సరం మూడు రోజులపాటు వైభవంగా నిర్వహింపబడుతూ ఉండడం సర్వవిదితం. శ్రీమాన్ వేంకటాచార్య స్వామి వారి తర్వాత రామానుజకూటం గోష్ఠిసభ్యులకు శ్రీమతి కె.వి. జానకమ్మ గారు (వేంకటాచార్య స్వామివారి పుత్రిక) మార్గదర్శనాన్ని చేస్తూ, ప్రోత్సహిస్తున్నారు. ప్రతిఏడు ఈ తిరునక్షత్ర సందర్భంగా ఉభయవేదాంత సభలు నిర్వహింపబడడమే కాక, అపుడు ఒక సంప్రదాయ సద్గ్రంథం ముద్రింపబడి గోష్ఠిసభ్యులకు అందజేయడం జరుగుతున్నది. ఈ యేడు కూడా ఆక్రమంలోనే శ్రీవేంకటాచార్యస్వామివారి జన్మ నక్షత్రమహోత్సవ సందర్భంగా జూలై **6, 7, 8**వ తేదీలలో త్రైవర్ణిక రామానుజ కూటంలో ఉభయవేదాంత సభలు నిర్వహింపబడు తున్నాయి. ఈ ఉత్సవ స్మృతిగా

ఈ యేడు గరుడవాహన పండితుడు రచించిన శ్రీదివ్యసూరిచరితంలోని శ్రీరామానుజ చరిత్ర ఆంధ్రవివరణంతో ప్రకాశింపచేయబడుతున్నది. ఈ సత్కార్యాన్ని తమ పవిత్రద్రవ్యంతో నిర్వహిస్తున్న **శ్రీమాన్ మంచు కొండ శ్రీనివాసగారు, వారి ధర్మపత్ని యతిరాజ నాథవల్లీ తాయార్ (నాథమ్మ) దంపతులు, వారి కుటుంబ సభ్యులు అభినందనీయులు.** భగవద్రామానుజ సహస్రాబ్ది మహోత్సవాల సందర్భంగా ఈ జగదాచార్య కైంకర్యాన్ని వారు ఆచార్యవరివస్యగా చేయడం వారి సంప్రదాయాభి నివేశాన్ని సూచిస్తున్నది. వీరిని ఈ సేవలో ప్రోత్సహించిన జానకమ్మగారిని అభినందిస్తున్నాను. ఈగ్రంథాన్ని సిద్ధం చేయడంలో నన్ను అన్ని విధాలా ప్రోత్సహించి మార్గదర్శనాన్ని చేసిన పితృపాదులు ఉ.వే. శ్రీమాన్ **ఈయుణ్ణి రంగాచార్య స్వామివారి** సన్నిధిలో ప్రణమిల్లు తున్నాను. దీనిని అవలోకించి మంగళాశాసనాలను అనుగ్రహించిన **సహృదయులు - ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్య స్వామివారు, ఉ.వే. శ్రీమాన్ ఎస్.వి.రంగరామానుజా చార్యస్వామివారు, ఉ.వే. శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్య స్వామివారు.** వీరందరి సన్నిధిలో హృదయ పూర్వకంగా కృతజ్ఞతా విష్కరణను చేసుకొంటున్నాను. శ్రీమాన్ సి.ఎస్. రామానుజస్వామి వారు (శ్రీరంగం) ముద్రించిన **"సచిత్ర శ్రీభగవత్ రామానుజ వైభవము"** అనే గ్రంథంలోని కొన్నిచిత్రాలు హార్దకృతజ్ఞతా పూర్వకంగా ఈ గ్రంథంలో ముద్రింపబడ్డాయి. చాలా తక్కువ వ్యవధిలో సిద్ధం చేసిన ఈ గ్రంథ ముద్రణలో చోటుచేసుకొన్న దోషాలను సహించి క్షమించవలసినదిగా సహృదయ పాఠకులను ప్రార్థిస్తూ, స్వస్తి.

**రామానుజసహస్రాబ్ది మహోత్సవశుభస్మృతిః ।**
**సేయం భవేద్యతీశానపదాంబుజపరిష్కృతిః ॥**
**యతిరాజనాథవల్లీశ్రీవాసౌ కృతినా విమౌ ।**
**స్వాచార్యజగదాచార్యసేవయా స్వానురూపయా ॥**

తిరుపతి — భాగవత విధేయుడు

25-6-2017 — ఈ.ఏ. శింగరాచార్యులు



# విషయసూచిక

## పదహారవ సర్గ

## (శ్రీనాథమునుల, శ్రీయామునమునుల వైభవం)

11. శ్రీకృష్ణుడనే భావనతో నాథమునులు చోళభూపతిని అనుసరించడం. (32వ శ్లో. - 34వ శ్లో.)
12. శ్రీనాథముని తమ ఇద్దఱు శిష్యులకు తత్త్వప్రచారాన్ని, యోగమార్గాన్ని ప్రచారం చేయమని పల్కడం. (35వ శ్లో.)
13. పుట్టబోయే పౌత్రునకు యాముననామాన్ని పెట్టమని తన కుమారుడు ఈశ్వరమునిని నాథమునులు ఆజ్ఞాపించడం. (36వ శ్లోకం.)
14. తమ పౌత్రునకు వేదాదులను ఉపదేశించమని నాథముని శిష్యులను ఆజ్ఞాపించడం. (37వ శ్లోకం)
15. నాథమునుల పరమపదప్రాప్తి. (38వ శ్లోకం)
16. నాథమునుల శిష్యులు తమ ఆచార్యాజ్ఞను నిర్వర్తించడం. (39వ శ్లోకం - 43వ శ్లోకం)
17. శ్రీయామునుల జన్మ, బాల్యం. (44వ శ్లో. - 46 శ్లో.)
18. చోళరాజ పురోహితుడైన ఆక్కియాళ్వాన్‌ను యామునులు ఓడించడం. (47వ శ్లో. - 66 శ్లో.)
19. శ్రీరామమిశ్రులు యామునులను కలవాలని ప్రయత్నించడం. (67వ శ్లో. - 71వ శ్లో.)
20. శ్రీయామున-శ్రీరామమిశ్రుల సంభాషణ. (72వ శ్లో. - 75వ శ్లో.)
21. శ్రీరామమిశ్రులు యామునులకు గీతార్థ వివరణాన్ని, ద్వయ మంత్రాన్ని ఉపదేశించడం. (76వ శ్లో. - 80వ శ్లో.)
22. శ్రీయామునుల ఆశ్రమస్వీకారం. (81వ శ్లో. - 82వ శ్లో.)
23. శ్రీయామునుల గ్రంథరచన. (83వ శ్లో.)
24. కుముదాక్ష శంకుకర్ణాది నిత్యసూరులు అవతరించి యామునులకు శిష్యులు కావడం. (84వ శ్లో. - 86వ శ్లో.)



25. తిరువనంతపురంలో కురుకైకావలప్పన్‌ను యామునులు దర్శించడం. (87వ శ్లో. - 91వ శ్లో.)
26. అక్కడనుండి శ్రీయామునులు శ్రీరంగానికి చేరడం. (92వ శ్లో.)
27. అనంతపురానికి వెళ్ళడానికి బయలుదేరిన యామునులు దారిలో కురుకైకావలప్పన్‌కు చరమదశ సమీపించిందని తెలిసి, విషాదంతో శ్రీరంగానికి తిరిగి రావడం. (93వ శ్లో. - 94వ శ్లో.)
28. యామునులు శ్రీవైష్ణవ ధర్మప్రచారం కోసం తిరుమల, కంచి, తిరుక్కోట్టియూర్ మొదలైన దివ్యదేశాలలో తమ శిష్యులను నియమించి, శ్రీరంగంలో తమ శిష్యులతోపాటు సిద్ధాంత ప్రచారాన్ని చేయడం. (95వ శ్లో.)

## పదిహేడవ సర్గ
### (శ్రీరామానుజవైభవం)

1. తుండీర (తొండ) మండలవర్ణనం. (1వ శ్లో. - 3వ శ్లో.)
2. శ్రీరామానుజావతారం. (4వ శ్లో. - 8వ శ్లో.)
3. శ్రీరామానుజుల బాల్యాదులు. (9వ శ్లో. - 16వ శ్లో.)
4. శ్రీరామానుజులు రాజకుమారునకు పట్టిన బ్రహ్మరక్షస్సును తరిమివేయడం. (17వ శ్లో. - 29వ శ్లో.)
5. శ్రీరామానుజులకు ప్రభువు చేసిన సత్కారం. (30వ శ్లో. - 31వశ్లో.)
6. శ్రుతులకు అపార్థాలను పలికే యాదవప్రకాశులను వదలిపెట్టి కంచిలో గృహిణితో పాటు శ్రీరామానుజులు నివసించడం. (32వ శ్లో.-34వ శ్లో.)
7. శ్రీయామునులను వారు జీవించి ఉండగా దర్శించలేని శ్రీరామా నుజులు దుఃఖంతో శ్రీరంగనాథుని సేవించకుండానే కంచికి తిరిగి రావడం. (35వ శ్లో. - 45వ శ్లో.)

8. ఆఱు వార్తలు, శ్రీరామానుజులు శ్రీరంగాన్ని తిరిగి చేరడం. (46వ శ్లో. - 54వ శ్లో.)
9. మధురాంతకంలో మహాపూర్ణ సమాశ్రయణం, మహాపూర్ణులతో కలసి శ్రీరామానుజులు కంచికి చేరడం. (55వ శ్లో. - 67వ శ్లో.)
10. కంచిలో మహాపూర్ణులు ఆఱు నెలలు ఉండడం. (68వ శ్లో.)
11. పెరియనంబి పత్నితో శ్రీరామానుజపత్నికి కలహం, పెరియనంబి శ్రీరంగానికి తిరిగి వెళ్ళడం. (69వ శ్లో.)
12. శ్రీరామానుజుల ఆశ్రమ స్వీకారం. (70వ శ్లో. - 71వ శ్లో.)
13. యాదవప్రకాశుల ఆశ్రమ స్వీకారం (72వ శ్లో. - 75వ శ్లో.)
14. శ్రీరామానుజులు శ్రీరంగం చేరుకోవడం, శ్రీరామానుజులకు శ్రీరంగనాథుడు ఉభయవిభూతులను కానుకగా ఇవ్వడం. (76వ శ్లో.- 79 వ శ్లో.)
15. శ్రీరంగాలయ కైంకర్యాలను వ్యవస్థీకరించడం. (80వ శ్లో.)
16. మహాపూర్ణుల పుత్రులను శిష్యునిగా చేసుకోవడం (81వ శ్లో.)
17. శ్రీరామానుజులు శ్రీరంగాలయ కైంకర్యాలను నిర్వహించడం. (82వ శ్లో. - 87వ శ్లో.)

## పద్దెనిమిదవ సర్గ
## (శ్రీరామానుజ వైభవం)

1. తిరుక్కోట్టియూర్‌నంబి వద్ద శ్రీరామానుజుల చరమశ్లోకార్థ శ్రవణం, దానిని అందటికి వారు ఉపదేశించడం. (1వ శ్లో. - 2వ శ్లో.)
2. హరిదర్శనం శ్రీరామానుజదర్శనంగా వ్యవహరింపబడడం. (3వ శ్లో.)
3. శ్రీరామానుజులు పలువురు ఆచార్యులను ఆశ్రయించడం.(4,5వ శ్లో.)
4. యజ్ఞమూర్తితో శ్రీరామానుజుల వాదం, ఆ వాదంలో జయించడం. (6వ శ్లో. - 9వ శ్లో.)



5. సంసారులను ఉద్ధరించడంకోసం శ్రీయతీంద్రులు శ్రీభాష్యాది నవగ్రంథాలను అనుగ్రహించడం. (10వ శ్లో.)
6. శ్రీరామానుజులు దిగ్విజయ యాత్రను చేసి, వేదబాహ్యులను జయించడం, స్వమతప్రచారం చేయడం. (11వ శ్లో. - 53వ శ్లో.)
7. శ్రీరామానుజుల వైభవాన్ని ప్రకటించిన పలువురు. (54వ శ్లో. - 70వ శ్లో.)
8. క్రిమికంఠుని దురాగతం. (71వ శ్లో. - 82వ శ్లో.)
9. శ్రీరామానుజుల తిరునారాయణపురగమనం. (83వ శ్లో.- 88వ శ్లో.)
10. తిరునారాయణపురంలో శ్రీరామానుజులచే తిరునారాయణస్వామి, శెల్వపిళ్లై అర్చామూర్తుల ప్రతిష్ఠ, అక్కడ కైంకర్యవ్యవస్థను వారు స్థిరీకరించడం. (89వ శ్లో.)
11. **"తానుకన్డ తిరుమేని"** (90వ శ్లో.)
12. తిరుపతిలో గోవిందరాజస్వామి విగ్రహప్రతిష్ఠాపనం. (91వ శ్లో.)
13. శ్రీరామానుజులు శ్రీరంగానికి తిరిగిరావడం. (92వ శ్లో.)
14. కూరేశుల పరమపదప్రాప్తి. (93వ శ్లో.)
15. కూరేశపుత్రుని శ్రీరంగనాథుడు తన పుత్రునిగా స్వీకరించడం. (94వ శ్లో.)
16. సిద్ధాంత ప్రచారంకోసం తమ శిష్యులను శ్రీరామానుజులు నియమించడం. (95వ శ్లో. - 96వ శ్లో.)
17. పరమపదాన్ని చేరాలనే శ్రీరామానుజుల ఔత్సుక్యం. (97వ శ్లో.)





శ్రీమతే రామానుజాయ నమః

శ్రీగరుడవాహన పండితుడు రచించిన

# శ్రీదివ్యసూరిచరితంలో

## పదహాఉవ సర్గ

## (శ్రీమన్నాథముని వైభవమ్)

1. అస్తి ప్రశస్తః కనకాభిధాయాః కశ్చిత్తటీసీమ్ని కవేరజాయాః ।
శ్రీవీరనారాయణనామధేయో గ్రామ శ్రుతిగ్రామవిదాం నివాసః ॥

**"పొన్ని"** అనే పేరును కల కావేరీనదికి తీరభూమిలో శ్రీవీర నారాయణ పురం అనే గ్రామ మొకటి ఉన్నది. ఇది వేదవిద్వాంసులకు నిలయం.

**"తెణ్ణీర్ పొన్ని"** (తేటబడిన నీటినిగల కావేరి), **"పొన్ని శూழ్ అరఙ్గా!"** (కావేరి నదిని చుట్టూ కల శ్రీరంగంలోని శ్రీరంగనాథా!) అని కావేరీనదికి ద్రావిడంలో **"పొన్ని"** అని పేరు. ఈ నదీతీరంలోని ఇసుకనుండి బంగారాన్ని తీసేవారని, అందువల్ల దీనికి పేరు వచ్చిందని అంటారు. భట్టర్‌కూడా **"హేమాపగా హంత్వఘమ్"** (పొన్ని-అనే పేరుగల కావేరీనది పాపాన్ని పోగొట్టుగాక!) అని శ్రీరంగరాజస్తవంలో అన్నారు. (**"పొన్"** అంటే - ద్రావిడంలో బంగారం. దానిని కల్గినది **"పొన్ని"**) కనకా - అనే పేరు గల ఉపనది కావేరీనదిలో కలుస్తున్నందున దీనికి ఈ పేరు వచ్చిందని గార్గ్య శ్రీరామానుజా చార్యులవారు శ్రీరంగరాజస్తవానికి రచించిన వ్యాఖ్యలో తెలిపారు.

వీరనారాయణపురానికే కాట్టు మన్నార్‌కోయిల్- అని సాంప్రదాయిక వ్యవహారం. శ్రీయామునుల అవతారస్థలం కూడా ఇదే. భగద్దివ్యదేశాలను వేదవిదులకు నిలయాలుగా వర్ణించడం దివ్యప్రబంధాలలోని పలుసూక్తులలో



గమనించవచ్చు. **"ఎఙ్గు మలి నిఱై పుకழ் నాల్‌వేదమ్ ఐన్దు కేళ్వికళుమ్ ఇయన్దతన్మై అక్కమలత్తయనైయార్ పయిలుమ్ శెల్వత్తు అణియழున్దూర్"** (అంతటా వ్యాపించి నిండిన కీర్తిని కల నాల్గువేదాలు, పంచమహాయజ్ఞాలు, ఇంకా వేదప్రోక్తాలైన యాగాలు- అనే వీనిని సహజంగానే తెలిసిన, గొప్ప గుణాలను కల బ్రహ్మదేవునితో పోలిన విప్రులు నిత్యవాసం చేసే తిరువழున్దూర్) (పెరియతిరు 7-8-1) ఇత్యాదులు ఉదాహరణాలు. శ్లోకంలో "గ్రామ" పదం ద్విరుక్తం కావడంవల్ల అనుప్రాసాలంకారం. **"కశ్చిత్"** అనే సర్వనామ ప్రయోగంవల్ల వీరనారాయణపురంలోని వాచామగోచరమైన వైభవం సూచింపబడింది. **"కవేరజాయాః"** అని అన్నందున కవేరపర్వతంనుండి పుట్టినది, కవేరుడనే రాజువల్ల పుట్టినదనే వ్యుత్పత్తులనుబట్టి ఈ నదీతీరం ప్రాంతంలోని పవిత్రత సూచింపబడింది. "శ్రుతిగ్రామవిదామ్" అనే ప్రయోగానికి **"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః"** (వేదాలన్నిటిచేత నేనే తెలియదగినవాడను), **"శుడర్ మికు శురుదియుళ్ ఇవై యుణ్డ శురనే"** (మిక్కిలి ప్రకాశించే వేదాలలో ప్రకాశించేవాడు) అని, **"వేదాంత విழుప్పొరుళిన్ మేలిరున్ద విళక్కు"** (వేదాంతాలలోని గొప్ప తత్త్వంగా ప్రకాశించే దీపంవంటివాడు) అనే రీతిలో సకలవేదార్థ తాత్పర్యమైన శ్రీమన్నా రాయణుడే ప్రాప్యం, ప్రాపకం - అనే తత్త్వాన్ని తెలిసినవారని తాత్పర్యం. అందువల్లనే "ప్రశస్య ఇతి ప్రశస్తః" - మిక్కిలిగా కీర్తింపబడేదనే విశేషణ ప్రయోగం ఇక్కడ సాభిప్రాయకం. శ్రీరామానుజవైభవమనే ద్రావిడ ప్రబంధంలో కూడా **"నీణులకిల్ వేదియర్‌కళ్ పలర్ వాழుమ్ వీరనారాయణ త్తిల్"** (విశాలమైన భూలోకంలో, పలువురు బ్రాహ్మణులు నివసించే వీరనారాయణపురంలో) అని ప్రయోగింపబడడం గమనించాలి. ఈ విధంగా ప్రారంభంలో నాథమునుల అవతారస్థలమైన వీరనారాయణపుర వైభవాన్ని తెలుపడం వల్ల కవి అక్కడ అవతరించిన శ్రీనాథమునుల జ్ఞానవైభవాన్ని సూచించి నట్లయినది.

2. శ్రీవీరనారాయణనామ కృష్ణో దేవో దయాపూరితదృష్టిపాతః ।
అర్చాకృతి ర్యత్ర కరోతి వాసం తపఃఫలం చోలధరాధిపస్య ॥

అక్కడ ఆ దివ్యదేశంలో వీరనారాయణుడనే పేరు గల భగవానుడైన కృష్ణుడు దయతో నిండిన కటాక్షాలను కలవాడై అర్చామూర్తి రూపంలో చోళప్రభువు చేసిన తపఃఫలంగా వాసం చేస్తున్నాడు.

ఇక్కడ వేంచేసి ఉండే స్వామి మన్ననార్ రాజగోపాలస్వామి కనుక **"శ్రీవీరనారాయణనామ కృష్ణః"**- అనే పేరు ఏర్పడింది. **"కాట్టుమ్"** అంటే చూపించేది- అని అర్థం. నమ్మాళ్వార్లు నాథమునులకు అనుగ్రహించిన నాలాయిరదివ్యప్రబంధం ఇచటి మన్ననార్ కోరికను అనుసరించి మొదటగా అనుసంధానం చేయబడింది. ఈ విధంగా ద్రావిడ ప్రబంధానుసంధాన సంప్రదాయాన్ని మొదటగా చూపినవాడు కనుక స్వామి **"కాట్టు మన్నార్"** అయినాడు. అతడు వేంచేసి ఉండే కోవెల కాట్టు మన్నార్ కోయిల్ అయినది. ఇదే శ్రీవీరనారాయణపురం.

3. **ప్రాయో మురారే ర్విరహాసహిష్ణుః క్షీరామ్బుధి స్తస్య నిషేవణాయ।**
**సరస్స్వరూపేణ విభాతి యత్ర శుద్ధాకృతిః కిం ను జహాతి నాథమ్ ?॥**

క్షీరాబ్ధిలో శయనించి ఉండే మురారి శ్రీవీరనారాయణపురంలోని మన్ననార్గా భూలోకానికి రాగా, ఆ స్వామి విరహాన్ని సహించలేని క్షీరాబ్ధి ఆ క్షేత్రంలోని పుష్కరిణిగా మారి వీరనారాయణపురంలో ప్రకాశిస్తున్నది. శుద్ధ స్వరూపాన్ని కలవారు నాథుని విడవగలరా?

**"కావేరీ విరజాసేయమ్"** (ఈ కావేరి విరజానదియే) అని శ్రీరంగ నాథుడై పరమపదనాథుడు భూలోకానికి రాగా, పరమపదంలోని విరజానది కావేరీనదిగా మారిందనే పురాణోక్తి ప్రక్రియలో ఇక్కడ క్షీరాబ్ధి కాట్టుమన్నార్ కోయిల్లోని పుష్కరిణిగా మారిందని చెప్పబడింది. దివ్యదేశాలలోని చేతనాచేతనాలన్నీ దివ్యసూరిస్వరూపాలే - అనే భావనను కులశేఖరులు **"ఊనేఱు శెల్వమ్"** అనే దశకంలో పల్కిన **"కురుకాయ్ పిఱప్పేనే"**(నీటి కొంగనై జన్మిస్తాను), **'తమ్బక మాయ్ నిఱ్కుమ్ తవముడైయ నావేనే,** (స్తంభంగా ఉండే తపస్సును కలవాడను ఔతాను), **"పడియాయ్ కిడన్దున్**



**పవళవాయ్ కాణ్బేనే"** (గడపనై పడిఉండి మీ పగడపు మోవిని దర్శిస్తాను), **"ఎమ్బెరుమాన్ పొన్మలైమేల్ ఏదేను మావేనే"** (స్వామి కొండపై ఏ వస్తువైనా కాగలను.) ఇత్యాది సూక్తులు ప్రమాణాలుగా గ్రాహ్యాలు. వేదం కూడా **"యువా సువాసాః పరివీత ఆగాత్"** (యౌవనాన్ని కలవాడై, చక్కని వస్త్రాన్ని ధరించిన వాడై, దివ్యసూరి సమేతుడై భగవంతుడు అవతరించాడు) అని అన్నది కదా!

4. **శ్రుతిస్మృతిజ్ఞానవిశుద్ధవృత్తాః సమస్తశాస్త్రార్ణవకర్ణధారాః ।**
**ద్విజాతయ స్తత్ర చతుస్సహస్రసంఖ్యా స్సదాచారపరా వసన్తి॥**

ఆ వీరనారాయణపురంలో నివసించే నాల్గు వేలమంది విప్రులు శ్రుతులలో, స్మృతులలో విధింపబడిన విధులకు సంబంధించిన జ్ఞానాన్ని, తదనుగుణమైన ఆచారాన్ని కలవారు. సమస్త శాస్త్రాలనే సముద్రాలను దాటడంలో సమర్థులైన నావికులు. సదాచారపరులు.

"కర్ణధారు"డంటే - తెడ్డుతో నావను సరి అయిన దిశలో నడిపే నావికుడు. కర్ణ మంటే తెడ్డు. వీరనారాయణపురంలోని బ్రాహ్మణులంతా సదాచారలక్షణాలను కలవారని ఇక్కడ తెలుపబడింది. **"ఞాన మనుట్టాన మివై నన్గాగవే యుడైయనాన గురువై"** (జ్ఞానం, అనుష్ఠానం అనే వీటిని చక్కగా కల్గిన గురువును) అని గల ప్రమాణాలు స్మరణీయాలు. **"విశుద్ధవృత్తాః"**- అనే ప్రయోగానికి చరమపర్వనిష్ఠను కలవారనే అర్థాన్ని గ్రహించడంలో స్వారస్యం ఉన్నది. ''శుద్ధవృత్తమంటే'' ప్రథమపర్వనిష్ఠ, **"విశుద్ధవృత్త"**మంటే చరమపర్వనిష్ఠ - అనే అర్థాన్ని "వి" అనే ఉపసర్గ ప్రయోగంలోని స్వారస్యం ద్వారా గ్రహించవచ్చు. **"ద్విజాతయః, విశుద్ధ వృత్తాః, సదాచారపరాః"** అనే విశేషణాలద్వారా పాలను నీళ్ళను వేఱు చేసే, ద్విజాతి అనబడే పక్షిజాతిలో జన్మించిన హంసలతో సామ్యం ఇక్కడ ఉండే విప్రులకు స్ఫురిస్తుంది. దానికి అనుగుణంగా **"అన్నవయల్ పుదువై"** (హంసలు సంచరించే శ్రీవిల్లిపుత్తూరు) అనే తిరుప్పావై తనియన్లోని ప్రయోగాన్ని,

**"వడివుడైయన్నమ్ పెడైయొడుమ్ వయల్ వెళ్ళియఙ్గుడి"** (పెరియతిరు-4-10-4) (చక్కని రూపాన్ని కల హంసలు తమ పెంటి పక్షులతో కలసి సస్యక్షేత్రాలలో సంచరించే తిరువెళ్ళియఙ్గుడి అనే దివ్యదేశం) ఇత్యాది ఆళ్వార్ల ప్రయోగాలను, **"యత్సారభూతం తదుపాసితవ్యం హంసో యథా క్షీరమివాంబు మిశ్రమ్"** (హంస పాలను స్వీకరించి నీటిని విడచిపెట్టినట్లుగా, ఏది మిక్కిలి సారమైనదో అదే ఉపాసించదగినది) ఇత్యాది ప్రమాణాలను స్మరించవచ్చు.

**5. తేషు ద్విజేష్వీశ్వరభట్టనామా శౌట్టైక్కులే ప్రాదురభూత్ప్రతీతే।**
**శ్రుత్యన్తవిత్కశ్చన విప్రవర్యో నిత్యం తపస్యా ముదితేన్దిరేశః ॥**

అటువంటి సదాచారశీలురైన, విశుద్ధజ్ఞానాన్ని కల ఒక విప్రుడు శౌట్టైకులంలో ఈశ్వరభట్టులను పేరుతో అవతరించారు. వారు వేదాంత విదులు, బ్రాహ్మణోత్తములు. తమ యోగసాధన ద్వారా నిత్యం భగవానుని ప్రత్యక్ష సమానాకారంగా దర్శించగలవారు.

**"నిత్యం తపస్యా ముదితేందిరేశః"** అనే ప్రయోగం ద్వారా ఈశ్వర భట్టుకు గల యోగసాధనసిద్ధి, **"దర్శనం పరభక్తి స్స్యాత్"** ఇత్యాదిగా నిర్వచింపబడిన పరభక్తి, పరజ్ఞానాదులు సూచింపబడ్డాయి.

శౌట్టైకులం పట్ల భగవంతునకు ఆదరాతిశయాన్ని తెలిపే ఈ క్రింద వివరింపబడిన ఐతిహ్యం ఒకటి తిరువాయ్మొళిలోని **"ఎఙ్గుమ్ పక్కనోక్కఱియాన్"** (2-6-2) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్పిళ్ళై ఉదాహరించారు.

ఆళవందార్‌కు తత్త్వార్థాలను ఉపదేశించిన మణక్కాల్‌నంబి **"కురుకైకావలప్పన్"** అనే ఆచార్యుల వద్ద మీరు గ్రహించవలసిన యోగరహస్య మున్నది. వారి వద్దకువెళ్ళి, దానిని తెలియండి'' అని అన్నారు. ఆళవందార్ వెంటనే కురుకైకావలప్పన్‌ను దర్శించడంకోసం తిరువనంత పురానికి వెళ్ళారు. మానవసంచారం లేని, భగవానుడు, తాము మాత్రమే ఏకాంతంగా ఉండి ఆనందించడానికి తగిన చోట ఒక పాడు పడిన ఇంటిగోడవద్ద కురుకైక్కావలప్పన్ యోగంలో ఉండడాన్ని యామునులు చూచారు. వారి యోగ సమాధికి భంగం కల్గించరాదనే భావనతో యామునులు వారికి వెనుకగా బయట నిలచి వేచి ఉన్నారు. ఇంతలో అప్పన్‌కు యోగభంగం కలిగి, కళ్ళు తెరచి చూచి "ఇక్కడ శౌట్టైకులానికి చెందిన వారు ఎవరైనా వచ్చారా?" అని ప్రశ్నించారు. (శౌట్టైకులమంటే -శ్రేష్ఠమైన కులం). వెంటనే ఆళవందార్ "నేనే, దాసుడను వచ్చాను. దేవరవారి యోగానికి భంగం కల్గించకూడదని బయట మీకు కన్పించకుండా ఉన్నాను. అయినా, దాసుని రాకను దేవరవారు ఏరీతిలో తెలిసికోగలిగారు? అందులోను, నేను శౌట్టైకులానికి చెందిన వాడననేది ఏవిధంగా తెలిసింది?'' అని ప్రశ్నించారు. అపుడు కురుకై కావలప్పన్ "నేను యోగసమాధిలో భగవంతుని దర్శిస్తూ ఉండగా, లక్ష్మీదేవి తన వక్షస్సుతో అదిమి ఆలింగనం చేసికొంటున్నా, స్వామి నన్నువీడి తన ముఖాన్ని తిప్పుకొని చూడని స్వామి, ఇపుడు నా మెడను రెండు మూడుసార్లు అదిమి, నిక్కి నిక్కి చూచాడు. ఈ రీతిలో అతడు పైకి లేస్తూ చూచినందున, దాసునకు ఆచార్యులైన నాథమునుల కులమైన శౌట్టైకులానికి చేరినవారెవరో ఇక్కడికి వచ్చి ఉండాలని తలచాను సుమా!''- అని బదులిచ్చారు. (అనేది ఆ ఐతిహ్యం)

**6. తస్మాదభూన్నాథముని స్స విష్వక్సేనాద్యభృత్యేభముఖాంశజో యః।**
**యద్గానవిద్యావిజితో హ్రియేవ విపాణ్డుతా మాశ్శుత నారదోపి ॥**

విష్వక్సేనుని పరివారంలో ఒకరైన గజాననులనే నిత్యసూరుల అంశతో ఈశ్వరభట్టుకు నాథమునులనే కుమారుడు కలిగాడు. నాథమునులు గానవిద్యలలో చాలా ప్రవీణులు. వీరి గానప్రావీణ్యాన్ని చూచి నారదుడు సిగ్గుతో వివర్ణుడైనందున అతని శరీరవర్ణం తెల్లగా అయినది కాబోలు. (రంగనాథమునులనే పేరు **"నామగ్రహణే నామైకదేశ గ్రహణ"** మనే న్యాయంలో నాథమునులుగా వ్యవహరింపబడుతున్నది)

నారదుని దేహవర్ణం సహజంగా తెల్లనిదే అయినా దానికొక హేతువును ఉత్ప్రేక్షించినందున ఉత్ప్రేక్షాలంకారం. ఆళ్వార్లు దివ్యసూరి నామంతో

ప్రసిద్ధులు. ఈ గ్రంథానికి పేరు "దివ్యసూరి చరిత"మనే పెట్టినందున కేవలం ఆళ్వార్ల చరిత్రమాత్రమే కదా ఈ కావ్యంలో వర్ణింపబడాలి. ఆచార్యుల చరిత్ర వర్ణింపబడుతున్నదేమి? అనే సందేహాన్ని "విష్వక్సేనాద్య భృత్యేభముఖాంశజః" అనే ప్రయోగం తీరుస్తున్నది. ఆళ్వార్లే కాక, ఆచార్యులందఱు దివ్యసూర్యంశ సంభూతులని సాంప్రదాయికవిశ్వాసం. అందువల్ల "దివ్యసూరిచరిత"మనే పేరు ఈ కావ్యానికి అన్వర్థం. నాథమునులు గజాననాంశతో అవతరించినట్లు ఆచార్యసూక్తి ముక్తావళి, గురుపరంపరాప్రభావం, శ్రీరామానుజవైభవాది గ్రంథాలలో స్పష్టంగా లేదు.

**7. యో మాతృగర్భస్థిత ఏవ కృష్ణా దవాప్య సమ్పూర్ణకటాక్షవీక్షామ్ ।**
**శౌణ్డ స్స్వత స్సర్వకలాసు కృష్ణం ప్రత్యక్షతాం ధ్యానవశాదనైషీత్ ॥**

శ్రీనాథమునులు తల్లిగర్భంలో ఉండగానే "**జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్విక స్స తు విజ్ఞేయః స వై మోక్షార్థ చింతకః**" (ఏ పురుషుని, అతడు పుట్టే సమయంలో మధుసూదనుడు కటాక్షిస్తాడో, అతడు సాత్వికుడు అని తెలియాలి. అతడు మోక్షాన్ని గూర్చిన ఆలోచనను కలిగి ఉంటాడు) అనే రీతిలో వీరనారాయణ పురంలోని శ్రీకృష్ణుని పరిపూర్ణకటాక్షాన్ని పొంది, సమస్తకళలలో సమర్థులై, ధ్యానబలంచేత శ్రీకృష్ణుని మానసికంగా సాక్షాత్కరించుకొన్నారు.

"**మత్తే శౌండోత్కటక్షీబాః**" - అని అమరం. శౌండశబ్దాన్ని మదించిన వాడనే అర్థంలో పఠించినా, "**శౌండో మత్తే చ విఖ్యాతే**" అని ప్రసిద్ధుడనే అర్థంలో విశ్వమేదినీనిఘంటువులు పలికాయి. "దాన శౌండా"ది ప్రయోగాలు కూడా ఈఅర్థంలో ప్రసిద్ధాలు. "**పరభక్తి పరజ్ఞాన పరమభక్తి ఘనుడు శ్రీమన్నాథముని**" అని ఆచార్యసూక్తి ముక్తావళిలోని సూక్తి.

**8. అథేశ్వరాఖ్యో మునిరావిరాసీత్ యః పృశ్నిగర్భాంశభవ స్స తస్మాత్।**
**అష్టాఙ్గయోగానుగతాన్తరాత్మదృష్టాష్టజానే ర్దృఢభక్తిసక్తిః ॥**



ఆ నాథమునులకు ఈశ్వర మునులనే పుత్రుడుదయించాడు. ఆ ఈశ్వరముని పృశ్నిగర్భుని అంశతో జన్మించాడు. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనే ఎనిమిది అంగాలను కల యోగాన్ని అనుష్ఠించి, తమ మనస్సులో శ్రీకృష్ణుని దర్శించారు. ఆ స్వామిపట్ల దృఢభక్తిని కలవారు.

"**అష్టజానిః**" అంటే - అష్టమహిషులను కలవాడని అర్థం. "**పృశ్నిగర్భు**"డంటే శ్రీకృష్ణుడు. "**పృశ్ని**"అని దేవకి పేరు. "**అహం సుతో వామభావం పృశ్నిగర్భ ఇతి శ్రుతః**" (భాగవతమ్-10-3-41) అని శ్రీభాగవతసూక్తి. "**అమ్మహాత్ముని కీశ్వరముని బుట్టె నిర్దయశుడు, యమనియమాసనా దృష్టాంగయోగ సాక్షాత్కృతహృత్పద్మసద్మదహర గగన రూపాంతరాత్ముడు**" అని ఆచార్య సూక్తిముక్తావళి ఈశ్వరమునికి యోగవిద్యలో కల గొప్పతనాన్ని పేర్కొన్నది.

**9. తౌ నాథయోగీశ్వరయోగివర్యౌ విజ్ఞాప్య కృష్ణాయ పురోధిపాయ ।**
**తత్కేలిధామౌఘనిషేవణాయ నిర్జగ్మతు ర్భూవలయం స్వపుర్యాః ॥**

శ్రీనాథముని, ఈశ్వరుమునులనే యోగీశ్వరులిద్దరు ఆ నగరానికి అధిపుడైన శ్రీకృష్ణునితో విజ్ఞాపించి ఆస్వామి అర్చారూపంలో విహరించే దివ్యదేశాలను సేవించడంకోసం తమ నగరం నుండి బయలు దేరారు.

దివ్యదేశాలు భగవంతునకు క్రీడారామాలనే విషయంలో "**శ్రీవైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరిణీతటే, రమయా రమమాణాయ**" (శ్రీవైకుంఠం పట్ల విరక్తిని పొందినవాడై, స్వామి పుష్కరిణి తీరంలో లక్ష్మితో పాటు విహరిస్తున్నవాడు), "**మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠముత్తమమ్, స్వామి పుష్కరిణీతీరే రమయా సహ మోదతే**" (ఆశ్చర్యకర చేష్టలను చేసే భగవంతుడు గొప్ప ఆనందాన్ని కల, గొప్పదైన వైకుంఠాన్ని విడచి స్వామి పుష్కరిణి తీరంలో లక్ష్మితోపాటు ఆనందిస్తున్నాడు) ఇత్యాది సూక్తులు స్మరణీయాలు.

**10. యావన్తి ధామాని జనార్దనస్య యావన్తి తీర్థాన్యపి పావనాని ।**
**తౌ తేషు తేషు త్రిదినం వ్యతీత్య క్రమాదుదీచీం దిశ మాపతు శ్చ ॥**

వారు ఎన్నెన్ని దివ్యదేశాలున్నాయో, ఎన్నెన్ని పవిత్ర పుణ్యతీర్థాలున్నాయో, వాటిని అన్నిటిని దర్శించి, సేవిస్తూ ఒక్కొక్క దేశంలో మూడు దినాలపాటు గడుపుతూ క్రమంగా ఉత్తరదిక్కుగా ప్రయాణ మయ్యారు.

**11. కళిన్దజారోధసి తౌ మునీన్ద్రౌ నిషేవ్య గోవర్ధననామపుర్యామ్ ।**
**కృష్ణం కిశోరం యమునాధినాథం న్యషీదతాం తత్ర సమర్చయన్తౌ॥**

వారిద్దరు యమునానదీ తీరంలో గోవర్ధనపురిలో యమునాధి నాథుడైన బాలశ్రీకృష్ణుని సేవించి, అక్కడే ఆ స్వామిని ఆరాధిస్తూ కొన్నాళ్ళు ఉండిపోయారు.

**12. తత్ర స్థితౌ తద్విరహాసహిష్ణుః శ్రీవీరనారాయణవాసుదేవః ।**
**స్వప్నే సమాహ్వాద్భజత స్మ తౌ హి తత్పార్శ్వ మూధ్వా యమునేశ మస్తః॥**

వారిద్దరి విరహాన్ని సహించలేని వీరనారాయణపురంలోని శ్రీకృష్ణుడు ఒకనాడు వారికి స్వప్నంలో సాక్షాత్కరించి వెంటనే వీరనారాయణ పురానికి తిరిగి రమ్మన్నాడు. వారు కూడా శీఘ్రంగా, యమునానదీ విహారి అయిన శ్రీకృష్ణుని మనస్సులో ధ్యానిస్తూ, వీరనారాయణపురాన్ని చేరారు.

**13. శ్రీవైష్ణవేభ్యః కురుకాగతేభ్యః శుశ్రావ సోపూర్ణసుధాభిధాఙ్కమ్ ।**
**సహస్రగాథాసు పరాఙ్కుశేన కృతాసు గాథాదశకం కదాపి ॥**

(ఈవిధంగా కొంతకాలం గడచిన తరువాత) ఆళ్వార్ తిరునగరికి వచ్చిన శ్రీవైష్ణవులు కొందఱు నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్మొళ్రి ప్రబంధంలోని వేయి పాశురాలలో **"ఆరావముదే !"** అనే (కుంభఘోణ క్షేత్రంలోని అర్చామూర్తిని స్తుతించే) ఒక దశకాన్ని గానం చేయగా విన్నారు.

ఈ వైష్ణవులు కర్ణాటకప్రాంతం నుండి వచ్చినవారనే విషయం ఇక్కడ స్పష్టంగా చెప్పబడలేదు. గురుపరంపరాప్రభావంలో **"మేల్నాట్టిల్ నిన్ఱుమ్ శిల శ్రీవైష్ణవర్కళ్ ఎళ్రున్దరుళి మన్ననారై సేవిత్తు, అవర్తిరుమున్బే "ఆరావ ముదే" ఎన్గిఱ తిరువాయ్మొళ్రియై అనుసంధిత్తరుళ"** అని తెలుపబడింది. **"నయ్యవసరమున సాటి లేనట్టి మేల్నాటినుండి పలువురు వైష్ణవులొకనాడు వచ్చి యచట "గేలుదమ్ముల కీలించి "యారావముదే" యను తిరువాయ్ మొళ్రి యనుసంధింప"** అని ఆచార్యసూక్తి ముక్తావళిలో కూడా ఉన్నది.

**"అపూర్ణాసుధాభిధాంకమ్"** అంటే - **"ఆరావముదే"** అనే పదాన్ని పేరుగా కల్గిన స్వామిని ఉద్దేశించి రచింపబడిన - అని అర్థం. కుంభఘోణ క్షేత్రంలోని స్వామికి **"ఆరావముదన్"** అని పేరు. ఎంతసేపు సేవించినా తనివి తీరని సౌందర్యం కలవాడు గనుక ఆ స్వామికి ఈ పేరు కలిగింది. అమృతం తాగితే తృప్తి కలుగవచ్చు గాని విలక్షణమైన అమృత స్వరూపుడైన ఈ స్వామిని ఎంతసేపు సేవించినా తృప్తి కలుగదు - అని ఈ నామంలోని తాత్పర్యం. **"అపూర్ణ"** అంటే - అపర్యాప్తం - ఎంత అనుభవించినా చాలు అని అనిపించని - అని భావం. ఈదశకాన్ని గానం చేసినవారు వంగిపురత్తు ఆచ్చి, ఇయల్ప్పిళ్ళై, తొణ్డనూర్నంబి ఈ తొండనూర్నంబి శ్రీరామానుజుల శిష్యులైన తొండనూర్ నంబి కంటే భిన్నులై ఉండాలి. నాథమునులకు శ్రీరామానుజులకు మధ్య చాలా కాలవ్యవధి ఉన్నది కదా!

**14. నిశమ్య గాథాదశకం మనోజ్ఞం స నాథయోగీ ముదితోవశిష్టాః ।**
**గాథా స్తదీయా శ్ర్శవణామృతాని శుశ్రూషమాణః కురుకా మయాసీత్॥**

మనోహరమైన ఆ పది పాశురాలను విని నాథముని ఆనందించి, చెవులకు అమృతంవంటి మిగిలిన పాశురాలను కూడా వినగోరినవారై ఆళ్వార్ తిరునగరికి వెళ్ళారు.

**"మనసా జ్ఞాయతే ఇతి మనోజ్ఞః"** అనే వ్యుత్పత్తివల్ల ఇచటి మనోజ్ఞశబ్దం ద్వారా నాథమునులు ఆలకించిన పాశురాలలోని శబ్దమాధుర్యమే కాక, అర్థమాధుర్యం కూడా స్ఫురిస్తుంది. "శ్రవణామృతాని" అనే ప్రయోగం **"శెవిక్కినియ శెఞ్జొల్", "భక్తామృతమ్"** ఇత్యాది ప్రయోగాలను తలపిస్తుంది.

**15. నిషేవ్య భక్త్యా కురుకాపురేశం స నాథయోగీ హరి మాదిదేవమ్ ।**
**వినిద్రచిఞ్చాతరుమూలమాప పరాఙ్కుశం తత్ర మునిం దిదృక్షుః ॥**

ఆళ్వార్ తిరునగరికి ప్రభువు, హరి అయిన ఆదినాథుని సేవించి, నిద్రపోని చింతచెట్టు మూలప్రదేశం వద్దకు నమ్మాళ్వార్లను, మధుర కవులను దర్శించాలని వెళ్ళారు.

ఈనాటికీ ఆళ్వార్ తిరునగరిలోకి, నమ్మాళ్వార్ల కాలంనాటి నిర్నిద్రతింత్రిణి వృక్షానికి చెందిన సంతతివృక్షాన్ని దర్శించవచ్చు. ఆదిశేషుడే భగవదాజ్ఞపై నిర్నిద్రతింత్రిణిగా మాఱి, ఆళ్వార్లకు నివాసమయ్యారని ఆళ్వార్ల వైభవం తెల్పుతున్నది.

**16. యోగప్రభావా న్న తదా శఠారిమన్తర్హితం నాథముని ర్దదర్శ ।**
**తదా విషీదన్మనసా న్యషీదత్తద్దర్శనోపాయకలాం బుభుత్సుః ॥**

కాని, నమ్మాళ్వార్లు యోగప్రభావంతో అంతర్హితులైనందున నమ్మాళ్వార్లను నాథమునులు దర్శించలేకపోయారు. అపుడు వారు చాలా విచారించి, ఆళ్వార్లను ప్రత్యక్షం చేసికొనే ఉపాయాన్ని కోరి, అందుకోసం ప్రయత్నం చేశారు.

**17. కవీన్ద్రనోక్తం మధురాభిధేన స తత్ర గాథాదశకం శఠారేః ।**
**సాన్నిధ్యహేతో ర్ద్విసహస్రయుక్తాయుతం తదావర్తయతి స్మ వారమ్॥**

నాథమునులు అపుడు నమ్మాళ్వార్లను ప్రత్యక్షం చేసికోవడంకోసం, వారిని స్తుతిస్తూ మధురకవులు రచించిన, పదకొండు పాశురాలను కల **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"** అనే ప్రబంధాన్ని పన్నెండువేల మార్లు జపించారు.

ఈ ఉపాయాన్ని నాథమునులకు తెల్పినవారు మధురకవుల శిష్యులైన దాసపిళ్ళై అనేవారు. పదకొండు పాశురాలను కల కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధంలో చివరి పాశురం ఫలశ్రుతి కనుక **"గాథా దశకమ్"** అని అనడంలో అడ్డులేదు.



**18. ప్రీత శ్శఠారి ర్మధురేణ సాకం కవీన్ద్రనాగ్రే కృతసన్నిధానః ।**
**ఉపాదిశ త్సద్వయమన్త్రపూర్వం సార్థా నముష్మై చతురః ప్రబన్ధాన్॥**

ఆ విధంగా చేసిన జపంవల్ల నమ్మాళ్వార్లు సంతోషించి మధుర కవులతో పాటుగా నాథమునుల ముందు ప్రత్యక్షమై ముందుగా వారికి ద్వయమంత్రాన్ని ఉపదేశించి, తాము అనుగ్రహించిన **తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియతిరువన్దాది, తిరువాయ్‌మొழి**- అనే నాల్గు ప్రబంధాలను అర్థంతో పాటు ఉపదేశించారు.

వాక్యగురుపరంపరలో "శ్రీమన్నాథమునయే నమః" అనే వాక్యం తరువాత, "శ్రీమతే శఠకోపాయ నమః" అని అనేవాక్యం అనుసంధింప బడడానికి కారణం - నాథమునులకు ఆళ్వార్లు ద్వయమంత్రాన్ని ఉపదేశించడమే. ద్వయమంత్రాన్ని ఉపదేశించినవారే కదా ఆచార్యులు.

**"నాథనుక్కు నాలాయిర మురైత్తాన్ వాழியే"** అని నమ్మాళ్వార్ల వాழித్తిరునామసూక్తిప్రకారం ఆళ్వార్లు నాథమునులకు నాలాయిర దివ్యప్రబంధాన్ని ఉపదేశించారనే కథనం గురుపరం పరాప్రభావంలో కన్పిస్తుంది. **"నాథమునికళుక్కు "దివ్యం దదామి తే చక్షుః" ఎన్ఱ్గిఱపడియే దివ్యజ్ఞాన చక్షుస్సై ప్రసాదిత్తరుళి రహస్యత్రయత్తైయుమ్, తిరువాయ్ మొழியైయుమ్, ముగ్ఱ్ఱుముళ్ళ మూవాయిర ప్రబంధఙ్గళైయుమ్, అఖిలదర్శన తాత్పర్యఙ్గళైయుమ్, అష్టాంగయోగ రహస్యత్తైయుమ్ ప్రసాదిత్తరుళినార్"** (నాథమునులకు - నీకు దివ్యదృష్టిని అనుగ్రహిస్తాను- అని శ్రీకృష్ణుడు అర్జునుని అనుగ్రహించిన రీతిలో, దివ్యమైన జ్ఞాననేత్రాన్ని ఇచ్చి, రహస్యత్రయాన్ని, తిరువాయ్‌మొழி ప్రబంధాన్ని మిగిలిన మూడువేల పాశురాలను కల ప్రబంధాలను, అఖిలదర్శన తాత్పర్యాలను, ఇష్టాంగయోగ రహస్యాన్ని అనుగ్రహించారు) అని గురుపరంపరాప్రభావంలో తెలుపబడింది.

**19. చతుర్నిగమ్యర్థమయాన్ ప్రబన్ధాన్ స ద్రామిడానేత్య పరాఙ్కుశోక్తాన్।**
**సదా తదావర్తనసమ్ప్రదాయనిష్ణాతచేతా నిషసాద తత్ర ॥**

చతుర్వేదాలలోని అర్థాలను అనుసంధించేవి, నమ్మాళ్వార్లు అనుగ్రహించినవి అయిన తిరువిరుత్తమ్, తిరువాశిరియం, పెరియ తిరువన్దాది, తిరువాయ్‌మొళి అనే నాల్గు ప్రబంధాలను అర్థంతో పాటు గ్రహించి, నాథమునులు ఆద్రావిడదివ్యప్రబంధాలను సదా అనుసంధించే సంప్రదాయాన్ని గూర్చి మనస్సులో భావిస్తూ ఉన్నారు.

**"చతుర్నిగమ్యర్థమయాన్ ప్రబంధాన్ ద్రామిడాన్ పరాంకుశోక్తాన్"** అనే ప్రయోగానికి నమ్మాళ్వార్ల ద్వారా నాథమునులు నాల్గు వేదాల అర్థాన్ని వివరించే నాలాయిరదివ్య ప్రబంధాలన్నిటిని నాథమునులు పొందారని కూడా చెప్పవచ్చు. **"తదావర్తన సంప్రదాయనిష్ణాతచేతాః"** అనే ప్రయోగంవల్ల ఈనాడు పలు వైష్ణవ దేవాలయాలలో చేయబడే దివ్యప్రబంధసేవాకాల సంప్రదాయానికి ఆద్యులు శ్రీనాథమునులని తెలుస్తున్నది.

**20. మయా సమం తన్మననం కురుష్వ శ్రీనాథయోగి న్నితి సానుకమ్పః ।**
**శ్రీవీరనారాయణపుర్యధీశస్తమాహ్వయత్ స్వప్నముఖేన కృష్ణః ॥**

అపుడు వీరనారాయణపురంలోని అర్చామూర్తి శ్రీకృష్ణభగవానుడు నాథమునులకు స్వప్నంలో కన్పించి "మీరు నావద్దకు వచ్చి, మా సన్నిధిలో నాలాయిరదివ్యప్రబంధాన్ని సేవాకాలం చేయండి" అని ఆహ్వానించాడు.

**21. శ్రీవీరనారాయణకృష్ణ మేత్య స తేన సార్ధం మననం వితన్వన్ ।**
**అగాపయద్గానచణై స్స్వశిష్యైః దివ్యేన గానేన సహస్రగాథాః ॥**

నాథమునులు కాట్టుమన్నార్‌కోయిల్‌లోని మన్ననార్ సన్నిధికి చేరి, ఆ స్వామి సమక్షంలో దివ్యప్రబంధాలను ఆవృత్తి చేసి, గానవిద్యలో సమర్థులైన తమ శిష్యులు నల్గురకు (తిరువాయ్‌మొళిలోని) వేయి పాటలను దివ్యగానంతో గానం చేయించారు.

దీనినిబట్టి మొదటి అరైయర్‌గానం వీరనారాయణపురంలో చేయబడిందని చెప్పాలి. ఇక్కడ కథనంలో కొంత భేదం కన్పిస్తున్నది.



గురుపరంపరా ప్రభావంలో - వీరనారాయణ పురంలోని మన్ననార్ - "నేను ఎన్ని అవతారాలు ఎత్తినా జరుగని లోక రక్షణం ఈదివ్యప్రబంధాలవల్ల కల్గుతుంది. మీరు దీనిని లుప్తం కాకుండా రక్షించి, ప్రకాశింపజేయండి" అని పల్కి, అర్చకముఖంగా "వీటికి రాగతాళాలకు అనుగుణంగా గానాన్ని కూర్చండి" అని ఆజ్ఞాపించాడు. అపుడు నాథమునులు తమ మేనల్లుళ్ళు మేలైయకత్తు ఆళ్వాన్, కీళై అకత్తు ఆళ్వాన్‌లను పిలచి, వారిద్వారా శ్రీవేదవ్యాస మహర్షి వేదాలను ఉదాత్త - అనుదాత్త - స్వరిత - ప్రచయస్వరాలతో ఉచ్చరించేటట్లుగా చేసినట్లు, నాథమునులు కూడా ఈ దివ్యప్రబంధాలను దివ్యగాన ప్రక్రియలో కూర్చి, రాగతాళాలను నిర్ణయించి వారిద్వారా గానం చేయించారు - అని తెలుపబడింది. శ్రీరామానుజ వైభవమనే ద్రావిడ కావ్యంలో మన్ననార్ స్వప్నంలో ఆజ్ఞాపించిన వృత్తాంతం కన్పించలేదు.

**22. చోలక్షితీన్దు స్స్వరగానశౌణ్డాం కాఞ్చిత్ స్త్రియం గానపటుం విధాయ।**
**పరీక్షితుం ద్రాగ్భరతాగమజ్ఞై ప్రాజ్ఞై స్సమం నాథమునీన్ద్ర మాహ్వాత్॥**

చోళప్రభువు ఒక స్త్రీని గానవిద్యలో సమర్థురాలుగా తీర్చిదిద్ది, ఆమెను పరీక్షించడంకోసం భరతవేదంలో నైపుణ్యాన్ని కల పండితులతో, నాథమునులను కూడా ఆహ్వానించారు.

**23. సర్వేపి లోకా స్స్వరగానయుక్తం వివిన్దతే ద్రామిడగానతత్త్వమ్।**
**ప్రకాశయామీతి పురో నృపస్య సమీపమాప త్స ముని స్సశిష్యః॥**

"స్వరగానయుక్తమైన ద్రావిడగాన తత్త్వాన్ని లోకంలోని అందఱు తెలియరు. దానిని రాజు ముందు ప్రకటిస్తాను." అని తలచి నాథమునులు తమ శిష్యులతో పాటు రాజసభకు వెళ్ళారు.

**24. సభాజనం ప్రాప్య సభా ముపేతః సభాజనానాం పురతో నిదేశాత్।**
**స భాజనం సర్వకలావలీనాం భద్రాసనే నాథముని ర్న్యవాత్సీత్॥**

రాజు చేసిన సత్కారాన్ని స్వీకరించి సభను చేసి, ఆ ప్రభువు ప్రార్థనపై సభలో భద్రాసనంలో సకల కళలకు ఆధారభూతులైన నాథమునులు కూర్చున్నారు.

**“సభాజ-ప్రీతిసేవనయోః”** అనే ధాతువునుండి పుట్టిన సభాజన శబ్దానికి స్వాగతవచనాలతో, ఆలింగనకుశలప్రశ్నాదులతో సంతోష పెట్టడమని అర్థం. **“సభాజనాయోపకృతాన్మునీంద్రాన్”** అని రఘువంశ ప్రయోగం. **భాజనం, “సభా ముపేతః, సభాజనానామ్, సభాజనమ్”** అనే ప్రయోగాలలోని అనుప్రాస సౌందర్యం గమనించదగినది.

**25. ఇమే సుమధ్యే కలహాయమానే శ్రుత్వానయో ర్గానకలావివాదమ్ ।**
**నిరూప్య సమ్యఙ్నిగదేదమిత్థమిత్యాబభాషే నృపతి ర్మునీన్ద్రమ్ ॥**

అపుడు ప్రభువు నాథమునులతో “ఈకన్యలిద్దఱు తమ గానకళను గూర్చి వివాదపడుతున్నారు. వీరిద్దరి గానకళను మీరు చక్కగా పరీక్షించి, శాస్త్రానుసారంగా వివేకించి, వీరిలో ఎవరి గానం గొప్పదో తెలుపండి” అని అన్నాడు.

**26. తథేతి గానం స తయోః పరీక్ష్య జగాద కస్యాశ్చిదుదేతి గీతిః ।**
**మయా భవద్భి శ్చ పరం సుబోధా మయాపి దేవై రపి చాపరస్యాః॥**

నాథమునులు “సరే” అని పల్కి, వారిని ఇద్దఱిని పరీక్షించి, ఒకానొక కన్యను చూపి, “ఈమె గానకళను గూర్చి మీకు, నాకు అందఱికి తెలుసు. ఈరెండవ కన్యయొక్క గానకళను అయితే దేవతలు, నేను మాత్రమే తెలియగలం” అని అన్నారు.

**27. తతో మరున్మానవగానభేద**
**జ్ఞానోత్థసామాజికసంశయార్థమ్ ।**
**నాదేన నానాలయతాలమాత్రా-**
**మాహైకదా సోనణుమాత్రశూన్యమ్ ॥**



అపుడు దేవగాన - మనుష్యగాన మధ్యగల తారతమ్యాన్ని గూర్చి సభలోని వారికి కల్గిన సందేహాలను నాథమునులు నాదమాత్రాన్ని వినిపించడం ద్వారా వేర్వేరు లయలను, తాళాలను ఏమాత్రం మరపు లేకుండా ప్రదర్శించి వర్ణించారు.

**“మరుతౌ పవనామరౌ”** అనే అమరకోశ వచనాన్ని బట్టి మరుచ్ఛబ్దం దేవవాచకం కూడా.

**28. రాజాపి సామాజికమణ్డలేన సాకం తదఙ్ఘ్రోః ప్రణనామ హృష్టః ।**
**సంభావనాం సంప్రతిగృహ్య తస్మా చ్ఛ్రీవీరనారాయణ మాప భూయః ॥**

ప్రభువు చాలా సంతోషించి, సభ్యులందఱితో పాటు నాథమునుల చరణాలపై వాలి నమస్కరించాడు. ప్రభువు చేసిన సత్కారాలను గ్రహించి నాథమునులు మళ్ళీ తిరిగి వీరనారాయణపురాన్ని చేరారు.

ఈ సందర్భం వేర్వేరు గ్రంథాలలో వేర్వేరుగా తెలుపబడింది. గురుపరంపరాప్రభావంలో- ఇద్దఱు కన్యలు, ఒకరు మానవగానకళలో, వేఱొకరు దేవగాన కళలో ప్రవీణులు. వీరిద్దరు పోటీ పడి, ప్రభువు దగ్గరకు రాగా, ప్రభువు నాథమునులను పరీక్షార్థం ఆహ్వానించినట్లు, నాథమునులు దేవగానాన్ని ప్రశంసించి, ఆ గానాన్ని పాడే కన్యయే గొప్పదని పల్కి, దేవగానంలోని విశేషాలను సభ్యులకు వివరించినట్లున్నది.

శ్రీరామానుజవైభవమనే ద్రావిడగ్రంథంలో- గానకళలో వివాదపడిన కన్యలను ముందు రాజు పరీక్షించి, మానవగానాన్ని, ఆ గానాన్ని పాడే కన్యను మెచ్చాడని, ఆ తరువాత దేవగానం పాడే కన్య ఒక సందర్భంలో నాథమునులను సేవించినపుడు, ఆమె దేవగానకళను నాథమునులు మెచ్చారని, అపుడు ఆమె ప్రభువు వద్దకు మళ్ళీ వెళ్ళి, తన దేవగానకళను నాథమునులు ప్రశంసించారని, వారిని పరీక్షకులుగా పిలచి, పరీక్ష పెట్టమని అర్థించగా, ప్రభువు ఆ విధంగా మళ్ళీ ఆకన్యలిద్దఱికి ఏర్పాటు చేసిన పోటీలో నాథమునులు దేవగానాన్ని మెచ్చి, ఆ గానాన్ని పాడే కన్యను విజేతగా తెలిపారని - ఈ విధమైన రీతిలో ఈ సందర్భం వర్ణింపబడింది.

**29. జాతో జయత్సేనవిపశ్చితోంశః శ్రీ పుణ్డరీకాక్ష ఇతి ద్విజేన్ద్రః ।**
**కాలాధిపాంశః కురుకాధిపశ్చ తౌ చ్ఛాత్రతాం నాథమునే రవాప్తౌ ॥**

జయత్సేనులనే దివ్యసూరి అంశతో అవతరించిన పుండరీకాక్షులు **(ఉయ్యక్కొండార్)**, కాలాధిపుడనే దివ్యసూరి అంశతో అవతరించిన కురుకాధీశులు **(కురుకైకావలప్పన్)** అనే ఇద్దఱు నాథమునులకు శిష్యులయ్యారు.

**30. శ్రీపుణ్డరీకాక్షముఖా న్మునీన్ద్రః ఛాత్రానశేషాన్ సహ గానభఙ్గ్యా ।**
**అజీగ్రహద్ద్రామిడ వేదగాథాః స న్యాయతత్త్వం స్వకృతిఞ్చ భూయః ॥**

**ఉయ్యక్కొండార్, కురుకైకావలప్పన్** మొదలైన తమ శిష్యులకందఱిని దివ్యగాన సహితంగా దివ్యప్రబంధాన్ని, తాము రచించిన న్యాయతత్త్వ గ్రంథాన్ని నాథమునులు నేర్పారు.

శ్రీనాథమునులకు **ఉయ్యక్కొండార్, కురుకైకావలప్పన్, నంబికరుణాకరదాసర్, ఏఱు తిరువుడైయార్, తిరుక్కణ్ణమంగై ఆణ్డాన్, వానమామలైదేవియాణ్డాన్, ఉరుప్పట్టూర్ ఆచ్చాన్‌పిళ్ళై, శోకత్తూరాழ்వాన్**- అనేవారు ఎనిమిది మంది శిష్యులు - అని గురుపరంపరాప్రభావంలో తెలుపబడింది.

**31. అథాగమ చ్చోలపతి ర్దిదృక్షుః శ్రీరాజనారాయణ వాసుదేవమ్ ।**
**తదాకృతిధ్యానసమాధినిష్ఠం విసృష్టనానావిషయం మునిఞ్చ ॥**

ఒకనాడు చోళప్రభువు వీరనారాయణపురంలోని మన్ననార్‌ను, ఆ స్వామిని ధ్యానిస్తూ సమాధిలో ఉండేవారు, లౌకిక విషయాలపట్ల విరక్తులైన నాథమునులను దర్శించాలని వీరనారాయణపురానికి వెళ్ళారు.

**32. నిషేవ్య కృష్ణం స్వపురం ప్రయాంతం సహావరోధై ర్నృపతిం విభావ్య।**
**సాక్షాద్వ్రజస్త్రీసహితం ముకున్ద మాతత్పురం నాథమునిర్జగామ॥**

అక్కడ మన్ననార్‌ను సేవించి, తన అంతఃపురస్త్రీలతో కలసి తిరిగి వెడుతూ ఉండే రాజును చూచి శ్రీనాథమునులు అతడు, రేపల్లెలో గోపకన్యలతో కూడిన సాక్షాత్ శ్రీకృష్ణుడేనని తలచి యోగావేశంలో ఆ రాజును అతని నగరం వరకు వెంబడించారు.



**33. స పుణ్డరీకేక్షణముఖ్యశిష్యగణాయ పృష్టాగమనక్రమాయ ।**
**యథావదుక్త్వానుగతాయ భూయః శ్రీవీర నారాయణపార్శ్వ మాగాత్॥**

పుండరీకాక్షులు మొదలైన శిష్యులు "మీరెందుకు ఎక్కడికి ఈ విధంగా వెడుతున్నారు?" అని ప్రశ్నించగా నాథమునులు వారికి యథార్థమైన విషయాన్ని తెల్పి, తిరిగి వీరనారాయణపురంలోని స్వామివద్దకు వచ్చారు.

**34. భూయో హితం కృష్ణ ముపాస్య భూపం**
**సోముహ్యదారూఢగజం విభావ్య।**
**సామన్తమౌలౌ చరణం నివేశ్య**
**బ్రహ్మాదిమౌలౌ హరి మాత్తతార్క్ష్యమ్ ॥**

మళ్ళీ ఇంకొక సందర్భంలో వీరనారాయణపురంలోని శ్రీకృష్ణుని దర్శించి, సామంతరాజు శిరస్సుపై కాలుపెట్టి ఏనుగు ఎక్కి తిరిగి వెళ్ళే రాజును చూచి, బ్రహ్మాదుల శిరస్సులలో తన శ్రీచరణాన్ని పెట్టి గరుడుని అధిరోహించే హరిగా భావించి మోహాన్ని పొందారు.

ఈ రెండు శ్లోకాలలో ప్రస్తావింపబడిన ఐతిహ్యాలు రెండు భగవద్విషయం ఈడు వ్యాఖ్యానంలో, ఇరుపత్తునాలాయిరప్పడి వ్యాఖ్యానంలో **"తిరువుడైమన్నరై క్కాణిల్"** (తిరువాయ్-4-4-8) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్పిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై ప్రస్తావించారు. దీనిని బట్టి నాథమునుల భక్తిదశ నమ్మాழ்వార్ల భక్తిదశతో పోలినదని తెలుస్తున్నది. అందువల్లనే శ్రీయామునులు స్తోత్రరత్నం ఆరంభంలో **"నమోచింత్యాద్భుతాక్లిష్ట జ్ఞానవైరాగ్యరాశయే, నాథాయ మునయేగాథభగవద్భక్తి సింధవే"** (ఊహించడానికి సాధ్యంకాని, ఆశ్చర్యాన్ని కలిగించే, సహజమైన జ్ఞానం, వైరాగ్యం - అనే వీటి సమూహంవంటివారు, లోతైన భగవద్భక్తికి సముద్రం వంటివారు అయిన నాథమునులకు నమస్కారం) అని, **"అపరిమితా చ్యుత భక్తితత్త్వ**

జ్ఞానామృతాబ్ధిపరివాహశుభై ర్వచోభిః లోకేవతీర్ణ పరమార్థసమగ్ర భక్తియోగాయ" అని శ్రీనాథమునులను కీర్తించారు.

**35. స పుణ్డరీకేక్షణ మాదిదేశ శాస్త్రార్థవృత్త్యా ప్రథయస్వ తత్త్వమ్ ।
సమాధినిష్ఠో వరయోగభఙ్గ్యా పశ్యేతి తత్త్వం కురుకాధిపఞ్చ ॥**

నాథమునులు, తమ శిష్యులలో ఒకరైన ఉయ్యకొణ్డార్‌ను శాస్త్రార్థ ప్రక్రియలో తత్త్వప్రచారాన్ని చేయమని, ఇంకొక శిష్యులు కురుకైకావలప్పన్‌ను యోగమార్గాన్ని అవలంబించి సమాధినిష్ఠలో ఉండి, తత్త్వ సాక్షాత్కారాన్ని పొందమని ఆదేశించారు.

కురుకైకావలప్పన్‌కు గల తత్త్వసాక్షాత్కార వైశద్యాన్ని నిరూపించే ఒకానొక సంవాదాన్ని తిరువిరుత్తప్రబంధంలోని 38వ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళై ప్రస్తావించారు. కురుకైకావలప్పన్‌ను ఒకరు **"ఎనక్కు ఎమ్బెరుమానై స్మరిక్కైక్కు విరకు శొల్లవేణుమ్"ఎన్న, నాన్ ఉనక్కు అదు శొల్లుకిఱేన్, నీ ఎనక్కు మఱైక్కుకైక్కు విరకు శొల్- ఎన్హాన్"** (నాకు, భగవంతుని స్మరించే ఉపాయాన్ని తెలుపండి - అనగా, "నీకు నేను దానిని తెల్పుతాను, ముందు నీవు నాకు మరచిపోయే ఉపాయాన్ని తెలుపు" అని కురుకైకావలప్పన్ అన్నారట.) అనేది ఆ ఐతిహ్యం. అంటే, అన్ని వస్తువులలో భగవంతుడున్నందున, ఒక వస్తువునకు ఆ వస్తువుగా ఉండే స్వభావం గాని, పేరు గాని భగవంతుడందులో అంతర్యామిగా లేకపోతే కలుగదు. కనుక, ఆ వస్తువును చూచినపుడంతా, అందులో భగవంతుడు అంతర్యామిగా ఉన్నాడనే భావన కలుగవలసి ఉన్నందున, స్వామిని స్మరించవలసిన అక్కరయే లేదు కదా- అనేది కురుకైకావలప్పన్ సూక్తిలోని భావం. ఇదే సంవాదాన్ని తిరువాయ్‌మొళిలోని (3-4-4)వ పాశురానికి ఈడువ్యాఖ్యలో కూడా గమనించవచ్చు.

**36. పురా భవత్యుల్బణధీభరత్వాత్
సింహాసనాంశ స్తనయో మహాత్మా।
తం యామునేయం రచయేతి నామ్నా
స నాథయోగీ స్వసుతం జగాద ॥**

నాథమునులు, తమ కుమారుడు ఈశ్వరమునితో "భగవంతుని సింహాసనం యొక్క అంశతో గొప్ప ఉజ్జ్వలమైన బుద్ధి సంపదను కల మహాత్ముడు నీకు పుత్రుడుగా త్వరలో జన్మిస్తాడు. అతనికి యామును లని నామకరణం చేయండి" అని అన్నారు.

**37. శ్రుత్యర్థజాతై ర్ద్వయ మన్త్రతత్త్వయోగైశ్చ సద్రామిడవేదగానమ్ ।
శ్రీపుణ్డరీకాక్షముఖాన్ స శిష్యాన్ న్యయుఙ్క్త పౌత్రస్య తదోపదేష్టుమ్॥**

పుండరీకాక్షులు మొదలైన తమ శిష్యులకు - "మీరు మా పౌత్రునకు వేదాలను, ద్వయమంత్రాన్ని, మంత్రార్థాన్ని యోగాన్ని, ద్రావిడవేదాలను, వాని గానప్రక్రియను మొదలైనవానిని అన్నిటిని ఉపదేశించండి" అని ఆదేశించారు.

**38. కృతార్థ ఏవం కృతకృత్యశేషో బభూవ యోగాన్తసమాధినిష్ఠః ।
అవాప్తుకామో నిభృతాన్తరాత్మా సనాతనం బ్రహ్మ స నాథయోగీ ॥**

ఈ విధంగా, తమ అవతారకృత్యాలన్నిటినీ నిర్వహించి కృతార్థులై శ్రీనాథముని సనాతనబ్రహ్మమైన శ్రీమన్నారాయణుని చేరగోరి, ఇంద్రియాలను నియంత్రించి తమ అంతిమసమాధిలో నిష్ఠను పొంది, భగవత్ సాక్షాత్కారంతో కాలం గడిపారు.

**39. శిష్యేషు నాథాఖ్యమునీశ్వరస్య సమాధినిష్ఠే కురుకేశతాతే ।
తదన్యసచ్ఛాత్రయుత స్తతాన స పుణ్డరీకాక్షసుధీ రధీతమ్ ॥**

నాథమునుల శిష్యులలో కురుకైకావలప్పన్ అనేవారు యోగసమాధి నిష్ఠలో ఉండేవారు. పుండరీకాక్షులు యోగ్యులైన తమ శిష్యులకు తామధికరించిన తత్త్వార్థాలను నేర్పి ప్రచారం చేశారు.

ఈ విధంగా వీరిరువురు తమ ఆచార్యుల ఆజ్ఞను పాటించారు.

**40. శ్రీరామమిశ్రః కుముదాక్షసూరే రంశాద్య మూర్వ్యా మవతీర్ణ మాహుః ।**
**స పుణ్డరీకాక్ష మనీషిణాభూత్ శిష్యాగ్రణీ ర్దర్శితశిష్యభక్తిః ॥**

కుముదాక్షులనే నిత్యసూరుల అంశతో అవతరించిన శ్రీరామ మిశ్రులు గొప్ప బుద్ధిమంతులు. వీరు పుండరీకాక్షుల శిష్యులలో ముఖ్యులు. గొప్ప ఆచార్యభక్తిని కలవారు.

**41. శుశ్రూషయా ప్రీతమనా స్స తస్మై గురూపదిష్టం పరమార్థజాతమ్।**
**ద్వయేన సత్రా మనునోపదిశ్య పునర్వచో విశ్వజనీన మాఖ్యత్ ॥**

శ్రీరామమిశ్రుల శుశ్రూషతో ఆనందించిన పుండరీకాక్షులు పరమార్థత్వాన్ని ద్వయమంత్రంతో పాటు ఉపదేశించి, సంసారిజనుల హితానికి తగిన ఉపదేశాలను చేశారు.

"విశ్వస్మై జనాయ హితమ్ - విశ్వజనీనమ్" అనే వివరణను విశ్వజనీన శబ్దానికి గ్రహించాలి.

**42. మయోపదిష్టాన్ హరిదర్శనార్థాన్**
**కృతానురోధోప్యనుశాధి గూఢమ్।**
**త్వం భావినం నాథమునీన్ద్రపౌత్రం**
**శ్రీయామునేయం సుత మీశ్వరస్య ॥**

'నేను మీకు ఉపదేశించిన విష్ణుతత్త్వార్థాలను మీరు నాథమునుల పౌత్రులు, ఈశ్వరమునులకు పుత్రులైన శ్రీయామునులకు ఉపదేశించండి. వారి అవతారం త్వరలో సంభావిస్తుంది. వారికి ఉపదేశించడం కోసం, అవసరమైతే, వారిని సేవించవలసివచ్చినా, సేవించండి - అని అన్నారు.

"కృతానురోధోప్యనుశాధి గూఢమ్" అనే సూక్తి శ్రీపుండరీకాక్షుల భవిష్యద్దర్శనాన్ని సూచిస్తుంది. శ్రీరామమిశ్రులు యామునులను అనుసరించి తత్త్వబోధను చేయవలసి వచ్చింది కదా!



**43. శ్రీరామమిశ్ర స్స వచ స్తథేతి నిశమ్య తద్దుష్కరమేవ మత్వా ।**
**చిన్తాకులో వ్యాకృతదర్శనార్థః శ్రీయామునేయోదయలిప్సు రాస్త॥**

శ్రీరామమిశ్రులు "ఆవిధంగానే చేస్తాను" అని బదులు పలికారు. కాని, ఆ కార్యం మిక్కిలి కఠినమైనదని తలచి చింతను పొంది, శ్రీయామునుల అవతారం కోసం వేచి ఉండి, వైష్ణవదర్శన తత్త్వాలను ప్రచారం చేస్తూ కాలం గడిపారు.

**44. అథేశ్వరాత్సింహముఖాంశభూతః శ్రీయామునేయ స్తనయోజనిష్ట।**
**నిర్వృత్త చౌలో విధినోపవీతః ప్రారబ్ధ సోధ్యేతు మకృత్రిమోక్తీః ॥**

సింహముఖుడనే నిత్యసూరి అంశతో ఈశ్వరమునికి శ్రీయా మునులు కుమారుడై జన్మించాడు. సకాలంలో యామునులకు చౌలం, ఉపనయనం జరిగింది. యామునులు వేదాధ్యయాన్ని చేయడం ఆరంభించారు.

**45. ధియా సకృద్గ్రాహచణేన స్వపిత్రా న కిం గతోధ్యేతు మసీతి పృష్టః ।**
**ఆచష్ట సోపీతి కథం వ్రజేయం పూర్వేద్యురుక్తం గురురద్య వక్తి ॥**

శ్రీయామునులు ఏకసంధాగ్రాహి. ఒకనాడు శ్రీయామునులు ఆచార్యులవద్ద అధ్యయనానికి వెళ్ళలేదు. తండ్రి "ఎందుకు వెళ్ళలేదు?" అని ప్రశ్నించగా, "ఆచార్యులు నిన్న చెప్పిన పాఠాన్నే తిరిగి ఈ నాడు కూడా చెబుతున్నారు. నేను వెళ్ళి ఏమి చేయను?" అని యామునులు బదులిచ్చారు.

**46. ఏవం సమస్తాన్నిగమానధీత్య సలక్షణం శాస్త్రపథావతీర్ణః ।**
**తతః కృతోద్వాహవిధి ర్వ్యషీదత్ పఠన్ మహాభాష్యగురో స్సకాశే॥**

ఈ విధంగా సమస్త వేదాలను సలక్షణంగా అధ్యయనం చేసి, శాస్త్రాలన్నిటిలో పాండిత్యాన్ని గడించారు. తరువాత వివాహమాడారు. శ్రీమహాభాష్యభట్టువద్ద శాస్త్రవిశేషాలను అధ్యయనం చేయసాగారు.

**47. తదాక్కియాళ్వానభిధ స్సుధీన్ద్రః పురోహిత శ్చోలధరాధిపస్య ।**
**విద్వజ్జనద్రవ్యదశాంశహారీ స ప్రాహిణోద్భాష్యగురో ర్నిదేశమ్ ॥**

అపుడు, చోళప్రభువు వద్ద పురోహితునిగా ఆక్కియాళ్వాన్ (ఇతర పండితులను తనకు దాసులుగా చేసికొని, వారినుండి కప్పాన్ని గ్రహించే వాడు) అనే పేరు గల విద్వాంసుడుండేవాడు. అతడు విద్వాంసులందరినీ వాదంలో జయించి, వారి ఆదాయంలో పదవభాగాన్ని పన్నుగా గ్రహించే వాడు. అతడు మహాభాష్యభట్టును కూడా ఆవిధంగా పన్నును చెల్లించమని ఆదేశించాడు.

దశాంశమని ఆదాయపు పన్నుకు పేరు.

**48. స యామునేయో గురుఖేదహేతుం సమీక్ష్య తచ్ఛాసన మాత్తరోషః ।**
**ఛిత్వా తదాహర్తృకరే విలిఖ్య వాదార్థమేవం ప్రజిఘాయ పత్రమ్ ॥**

తమ ఆచార్యులకు విచారాన్ని కల్గించే ఆ ఆదేశపత్రాన్ని యామునులు చదివి కోపంతో దానిని చింపివేశారు. ఆ పత్రాన్ని తీసికొనివచ్చినవానిద్వారా వాదాన్ని చేయడానికి తాము సిద్ధంగా ఉన్నామని వ్రాసి వార్తను పంపించారు.

**49. న కేవలం సత్కవయో వయం స్మః న కేవలం తన్త్రతటం ప్రయాతాః।**
**కింతు ప్రతిద్వన్ద్వకరీన్ద్రగర్వసర్వస్వనిర్వాపణపఞ్చవక్త్రాః ॥**

ఆ పత్రంలో యామునులు "మేము కేవలం కవులం మాత్రమే కాదు, కేవలం శాస్త్రపారంగతులమే కాదు. ఇంతకు మించి, ప్రతివాదులనే గజాల కుంభస్థలాలను బ్రద్దలు చేయగల సింహాలం'' అని వ్రాశారు.

ఈ అర్థాన్నే ఇచ్చే శ్లోకాలు ఏవి? అంటే - "న వయం కవయ స్తు కేవలం న వయం కేవలతంత్రపారగాః, అపి తు ప్రతివాదివారణ ప్రకటాటోప విపాటనక్షమాః", "ఆశైలాదద్రికన్యాచరణకిసలయ న్యాస ధన్యోపకంఠాత్ ఆరక్షోనీతసీతాముఖ కమలసముల్లాసహేతోశ్చ సేతోః, ఆచప్రాచ్యప్రతీచ్య క్షితిధరయుగళాదర్కచంద్రావతంసాత్ మీమాంసా శాస్త్రయుగ్మశ్రమవిమల మనాః మృగ్యతాం మాదృశోన్యః" అనేవి.

**50. పురోహిత స్తత్ర విలోక్య పత్రం విజ్ఞాపితోదన్తసవిస్మయస్య ।**
**రాజ్ఞో నిదేశా త్సహ దేశికేన శ్రీయామునేయం గురు మానినాయ ॥**



పురోహితుడు - ఆక్కియాళ్వాన్ ఆ చీటిని చదివి రాజుకు చూపించాడు. రాజు దానిని చదివి చాలా ఆశ్చర్యపోయాడు. పురోహితుడు రాజాజ్ఞను తీసికొని, మహాభాష్యభట్టుతో పాటు యామునులను కూడా సభకు తీసికొని రమ్మని ఆజ్ఞాపించాడు.

**51. ఆకాలికాకాన్తనివాసశైలాత్ ఆజానకీజానికృతాచ్చ సేతోః ।**
**ఆశైలయుగ్మా దరుణేన్దుచూడాత్ మీమాంసకో మత్సదృశోస్తి నాన్యః ॥**

కాళికాదేవికి పతి అయిన శివుని నివాసం కైలాసపర్వతం నుండి శ్రీరాముడు నిర్మించిన సేతువువరకు, తూర్పున ఉండే ఉదయాచలం నుండి పడమరలోగల అస్తాచలం వరకు నాతో సమానుడైన మీమాసంకుడు వేఱొకడు లేడు.

ఈ శ్లోకం పూర్వం ప్రస్తావింపబడిన **"ఆశైలాత్"** అనే శ్లోకానికి ప్రతిరూపం.

**52. ఇతి స్ఫుటార్థం వినిబధ్య పత్రం మహీపతే ర్ద్వారి పురోహితేన ।**
**తర్కం విధిత్సు స్స సభా ముపేత్య ప్రాప్తార్హణో భూపతి మిత్యువాచ॥**

ఈ విధంగా ఒక శ్లోకాన్ని ఒక పత్రంలో వ్రాసి యామునులు రాజద్వారపాలకుని చేతికి ఇచ్చి, వాదాన్ని చేయడం కోసం రాజసభలో ప్రవేశించారు. ప్రభువు శ్రీయామునులను గౌరవించి సత్కారం చేశాడు. అపుడు యామునులు ప్రభువుతో ఈవిధంగా పలికారు.

**53. అస్మాక (మారిప్సిత) మారబ్ధితవాదవిధ్యోః**
**పరీక్షణార్థం భవతా మహీన్ద్ర ।**
**ఆకారణీయా స్సహసా ప్రవాచో**
**విపశ్చితో నిశ్చితశాస్త్రతత్త్వాః ॥**

రాజా! మా ఇద్దఱిమధ్య జరిగే శాస్త్రార్థ వివాదాన్ని పరీక్షించడానికి నీవు అన్ని శాస్త్రాలతత్త్వాన్ని తెలిసినవారు, తర్కవేత్తలు అయిన విద్వాంసులను ఆహ్వానించు.

ప్రమాణానుకూల తర్కాలనేవి వాదానికి అత్యావశ్యకం. ఇటువంటి తర్కాలను తెలిసినవారనే విషయం "ఆకారణీయాః ప్రవాచః" అనే పదం ద్వారా ధ్వనిస్తుంది.

**54. తథేతి సర్వానపి లబ్ధవర్ణానాహూయ చోళక్షితిప స్సభాయామ్।**
**దేవ్యా సహాధిష్ఠితభద్రపీఠః ప్రవర్తయామాస తయోర్వివాదమ్॥**

యామునుల మాటలకు చోళరాజు సమ్మతించి, సభకు విద్వాంసుల నందఱిని ఆహ్వానించాడు. సింహాసనంలో రాణితో కలసి కూర్చొని, వారిద్దరిమధ్య శాస్త్రవాదాన్ని ప్రవర్తింపజేశాడు.

"లబ్ధః వర్ణః స్తుతిః యేన సః లబ్ధవర్ణః" అనే వ్యుత్పత్తివల్ల స్తుతింపబడేవాడని అర్థం. వర్ణమంటే స్తుతి వర్ణనమే వర్ణం.

**55. యావన్న తౌ వాదపరా వభూతాం**
**దేవౌ చ తావత్పణ మిత్యకార్ష్టామ్ ।**
**స యామునేయస్య వచో జితశ్చేత్**
**పురోహితోర్ధం విషయం ప్రదద్యామ్ ॥**

యామునులకు ఆక్కియాళ్వానుకు మధ్య శాస్త్రవాదం ఆరంభం కావడానికి ముందు రాజు రాణి ఇద్దఱు తమ మధ్య ఒక ఒప్పందం చేసికొన్నారు. శ్రీయామునులు రాజ పురోహితుని వాదంలో ఓడిస్తే, యామునులకు అర్థరాజ్యం ఇవ్వాలనేది ఆ ఒప్పందం.

ఇక్కడ విషయశబ్దం ప్రదేశ (రాజ్య) వాచకం. "విషయ స్స్యాదింద్రి యార్థే దేశే" అని విశ్వనిఘంటువు. "దేశవిషయౌ తూపవర్తనమ్" అని అమరం.

**56. అస్తిత్వనాస్తిత్వపదే త్వదుక్తే ఛిన్ద్యాం గిరా లౌకికవైదికార్థే ।**
**నోచేచ్ఛిరః పాదుకయా జహీతి పురోహితోభాషత యామునేయమ్॥**

బాలకుడైన యామునులతో పురోహితుడు - "లౌకికవైదిక విషయాలలో నీవు దేనిని గూర్చి "అస్తి" అని, "నాస్తి" అని అంటూ వాదిస్తావో, దానిని



నేను ఖండిస్తాను". ఆవిధంగా నేను చేయలేకపోతే నా శిరస్సుపై పాదుకతో కొట్టాలి" అని అన్నాడు.

**57. తథేతి వృద్ధం విహితప్రతిజ్ఞం స లౌకికన్యాయవిదాహ బాలః ।**
**అత్రోత్తరం దేహి జనన్యవన్ధ్యా తవేతి రాజాపి చ సార్వభౌమః ॥**

ఈవిధంగా ప్రతిజ్ఞచేసిన వృద్ధుడైన రాజపురోహితునితో, లౌకిక వైదిక న్యాయకోవిదుడైన, బాలుడు యామునులు "నీ తల్లి గొడ్రాలు కాదు, ఈ రాజు సార్వభౌముడు" అనే రెండు లౌకిక వాక్యాలను పల్కి "వీనిని ఖండించు" అని అన్నారు.

గ్రంథాంతరాలలో **"రాజపత్నీ పతివ్రతా"** అనే మూడవ వాక్యాన్ని కూడా యామునులు పల్కినట్లున్నది. గురుపరంపరాప్రభావంలో కూడా- **"త్వన్మాతా న వంధ్యా, రాజా సార్వభౌమః, రాజపత్నీ పతివ్రతా"** ఎన్ఱు ఇప్పడి లౌకికత్తిలే మూన్ఱు వార్తై అరుళిచ్చెయ్య" అని ఉన్నది.

**58. అశక్నువన్నుత్తర మత్ర దాతుం సోవాఙ్ముఖో భూమిపతేః పురోధాః ।**
**అద్వైతవాదీ శ్రితభేదవాదం శాస్త్రీయ మాలమ్బ్య జగాద వాదమ్ ॥**

రాజపురోహితుడు ఈ లౌకిక వాక్యాలలో దేనికీ సమాధానం చెప్పలేక పోయాడు. సిగ్గు బరువుతో తలదించుకొన్నాడు. ఈ విధంగా లౌకికవాదంలో పరాజితుడైన అతనికి శాస్త్రవిషయంలో వాదం చేయవలసి ఉన్నది. అతడు అద్వైతవాది కనుక భేదవాదాన్ని నిరసించే శాస్త్రీయ వాదాన్ని ఆరంభం చేశాడు.

**59. మిథ్యాప్రపఞ్చోయ మముష్య శుక్తి దుర్వర్ణవద్భాసతయా స చాఖ్యత్।**
**ఏతన్న సమ్యగ్యదయం ప్రపఞ్చో మిథ్యా తదన్తస్థతయా తథా సా॥**

రాజపురోహితుడు - "వాస్తవానికి ఈ ప్రపంచం అంతా మిథ్య శుక్తి (ముత్తెపుచిప్ప)లో లేని రజతం ఉన్నట్లు తోచిన రీతిలో, వాస్తవానికి లేని మిథ్య అయిన ఈ లోకం ఉన్నట్లు భాసిస్తున్నది. బ్రహ్మమొక్కటే సత్యం" అని వాదించాడు. వెంటనే యామునులు - "నీవు చెప్పే మిథ్యా వాదం సరి

కాదు. ఈ ప్రపంచం మిథ్య అయితే, ఈ జగత్తులో మిథ్య కూడా ఒక విషయంగా అంతర్భవించినందున, అదికూడా మిథ్య కావలసివస్తుంది.

**60. త్వయా ప్రపఞ్చస్య తదద్య మిథ్యామిథ్యాత్వమేవ ప్రతిపాదితం స్యాత్ ।**
**కి న్నామ మిథ్యాత్వ మిహ త్వదుక్తం పురః ప్రసిద్ధార్థకదమ్బకస్య ॥**

ఈ విధంగా నీవు ప్రపంచం మిథ్యకాదని సాధించిన వాడవయ్యావు (అంటే- ప్రపంచం సత్యమని సాధించినవాడవయ్యావు - అని భావం.) వాస్తవానికి ఎదురుగా, సుప్రసిద్ధంగా సుస్పష్టంగా గోచరించే ఈ ప్రపంచం మిథ్య అని అంటే ఏమి? దానిని తెలియజెప్పు.

**61. ప్రతీయమానేతరతా కిము స్యాత్? ఉత స్వత స్సంవిదగోచరత్వమ్?।**
**తద్రూపబుద్ధిః కిము తత్స్వరూపే తస్మిన్నతద్బుద్ధిరుతాద్య ఇష్టః॥**

1. ప్రతీయమానమవుతున్న వస్తువుకంటే ఈ జగత్తు భిన్నమైనందున దానికి మిథ్యాత్వాన్ని పల్కుతావా? (2) లేక, సహజంగా అది సంవిత్తుకు విషయం కానందున మిథ్యాత్వాన్ని పల్కుతున్నావా? (3) లేక, నీవు చెప్పే మిథ్యాత్వం తత్స్వరూపంలో తద్రూపబుద్ధి అంటావా? (సత్యమైన వస్తువుతో సమానమని అంటావా?) (4) లేక, తద్రూపంలో అతద్బుద్ధి అంటావా? (అసత్యమైన వస్తువుతో సమానమని అంటావా?)

శ్రీయామునుల సిద్ధిత్రయంలోని ఆత్మసిద్ధిలో గల **"నాసత్ ప్రతీతేః, బాధాం చ న సదిత్యపి యన్న తత్. ప్రతీతేరేవ సత్ కిం న్న? బాధాత్ నాసత్ కుతో జగత్? తస్మాత్ అవిద్యయైవేయ మవిద్యా భవతాశ్రితా. కించ, భేదప్రపంచస్య ధర్మో మిథ్యాత్వ లక్షణః. మిథ్యా వా పరమార్థో వా నాద్య కల్పోయమంజసా. తన్మిథ్యాత్వే ప్రపంచస్య సత్యత్వం దురపహ్నవమ్. పారమార్థ్యేపి తేనైవ తవాద్వైతం విహన్యతే"** ఇత్యాది వాక్యాల భావాన్ని ప్రస్తుత శ్లోకాలలో గమనించవచ్చు. దీనివల్ల కవికి యామున గ్రంథాలతో గల పరిచయం స్పష్టం.

**62. నేష్టం ద్వయ శ్చాత్ర హి తత్త్వసంవిదగోచరత్వే ఇతి చేదిదఞ్చ ।**
**యతః ప్రపఞ్చస్య చ గోచరత్వం న స్యాదత స్తావదసాంప్రతం స్యాత్ ॥**



మొదటి రెండు పక్షాలు అయుక్తాలు. తత్త్వజ్ఞానానికి గోచరం కాకపోవడమే మిథ్య అయితే, ఈప్రపంచం యొక్క జ్ఞానం గోచరం కాకుండా పోవాలి. కాని, ఈ ప్రపంచ జ్ఞానగోచరమవుతున్నది కనుక ఇది మిథ్య కాబోదు.

**63. ఖణ్డత్వముణ్డత్వగుణౌ చ పూర్ణ శృఙ్గత్వ మప్యేకగవే కథం స్యాత్।**
**మయా జితో లౌకికవైదికార్థ న్యాయేన మధ్యేసభ ముక్తిభఙ్గ్యా ॥**

మూడవ, నాల్గవ పక్షాలు కూడా తగనివి. ఎందుకంటే, ఒకే గోవ్యక్తిలో ఖండత్వ, ముండత్వాలనే విరుద్ధ ధర్మాలు ఏ రీతిలోను సంభవించవు కదా. అదేరీతిలో, తత్ స్వరూపంలో తద్రూప జ్ఞానం, తద్రూపంలో అతత్ బుద్ధి - అనేవి రెండూ పరస్పర విరుద్ధ ధర్మాలు. ఇవి ఒకే వ్యక్తిలో ఘటించవు. పూర్ణశృంగాన్ని కల గోవులో ఖండత్వ, ముండత్వాలనే పరస్పర విరుద్ధ గుణాలు కుదరవు. కనుక ఈ మిథ్యాత్వ లక్షణం బొత్తిగా కుదరదు. ఈవిధంగా నీవు ఈ సభ మధ్యలో లౌకికవాదంలోను శాస్త్రవాదంలోను పరాజితుడవైనావు.

**64. నోపానహా వృద్ధతయా హత స్త్వం తర్కేణ కిన్తు ప్రహతో ధిగల్పమ్।**
**సభాసదో వీక్ష్య తదా తమేవం విధూతపారోధసయుక్తిజాతమ్ ॥**

నీవు నాకంటే వృద్ధుడవైనందున నీవు పరాజితుడవైనా, నిన్ను నేను నీ శిరస్సుపై పాదుకలతో కొట్టలేను. నీవు ఇతఃపూర్వమే తర్కవాదాలతో కొట్టబడ్డావు" అని రాజపురోహితునితో యామునులు అన్నారు. అపుడు ఆ సభలో ఉండే వారంతా యామునులు పురోహితు నియుక్తులనన్నిటిని జయించడం గమనించారు. **(ధిగల్పమ్ - అనేది అనాదరోక్తి )**

**65. అనన్తరం సాధ్వితి సాలిలిఙ్గ మాం త్రాతు మాయాత ఇహేతి రాజ్ఞీ।**
**శ్రుత్వా స భూపో ముదిత స్తదుక్తం పురోధసం శిష్య మముష్య కృత్వా॥**

తరువాత, రాజపత్ని సాధువాదాలను పల్కుతూ, బాలకుడైన యామునులను కౌగలించుకొని "నన్ను రక్షించడంకోసం వచ్చారా?"

**("ఆళవన్దారే!")** అని పల్కింది. (ఎందుకంటే - రాజు పందెంలో గెలిచి ఉంటే, అతనికి రాణి ఆఱు నెలలు దాసీతనం చేయవలసి వచ్చేది. ఆ ఆపద తీరిందికదా) ప్రభువు కూడా చాలా సంతోషించి, తన పురోహితుని యామునులకు శిష్యునిగా చేశాడు.

**66.** అస్మై విభజ్యాథ దిదేశ దేశ-
మాదేశతోర్ధం నిజవల్లభాయాః ।
మహీభుజా దత్త మవాప్య రాజ్యం
ప్రాజ్యోదయం స్వీకృతరాజ్యభోగమ్ ॥

అపుడు రాణి రాజుతో "మనం చేసికొన్న ఒప్పదం ప్రకారం యామునులకు అర్ధరాజ్యం ఇవ్వండి" అని అన్నది. రాజుకూడా ఆ విధంగానే తన రాజ్యంలో సగభాగాన్ని యామునులకు ఇచ్చాడు. ఈ విధంగా యామునులు రాజ్యభోగాన్ని పొందినవారయ్యారు.

**"ప్రభూతం ప్రచురం ప్రాజ్యమ్"** అని అమరం. అధికమని దీని అర్థం.

**67.** తం రామమిశ్రోభ్యగమ ద్వినేతుం స్వచిత్తఖేలత్పరమార్థదానాత్ ।
అశక్నువన్ దర్శన మస్య లబ్ధుం తద్దర్శనజ్ఞానసకలానిదానమ్ ॥

ఆ విధంగా రాజ్యాధికారాన్ని అనుభవించే యామునులను వైష్ణవసిద్ధాంతం వైపు మరలించి వినీతులను చేయడంకోసం, తమ మనస్సులో కదలాడే పరమార్థాలను వారికి అందించడం కోసం ఆ యామునులను శ్రీరామమిశ్రులు అనుసరించారు. కాని, వారి దర్శనం లభించనందున, ఆ యామునుల దర్శనాన్ని పొందడానికి తగిన ఉపాయాన్ని గూర్చి వారు ఆలోచించాడు.

**68.** అలర్కపత్రం తదభీష్ట మాషణ్మాసం కరే ప్రాదిత పాచకస్య ।
విలోకనం దైవవశా న్న తస్య యత్నేన చాపం మహతేతి ఖిన్నః ॥



యామునులు చాలా ఇష్టపడే ముళ్ళ ఉస్తెకూరను ఆఱు నెలల కాలం పాటు యామునులకు వంట చేసేవానికి అందించారు. అయినా, దైవవశాత్తు వారికి యామునులతో కలయిక ఒక్కనాడు కూడా లభించలేదు. అందువల్ల శ్రీరామమిశ్రులు చాలా ఖిన్నులయ్యారు.

**69.** యత్రాహ్ని నాదిక్షదలర్కపత్రం తస్మిన్ స పౌరోగవ మిత్యువాచ ।
నాస్మిన్ దినే దత్త మలర్కపత్రం త్వయా కథం వాభ్యవహారహేతోః ॥

ఆ దుఃఖం వల్ల శ్రీరామమిశ్రులు ఒకనాడు ముళ్ళఉస్తెకూరను ఇవ్వడం మానివేశారు. ఆ నాడే యామునులు పాకశాలాధికారిని "ఈ నాడు భోజనంలో ముళ్ళ ఉస్తెకూర లేదేమి?" అని ప్రశ్నించారు.

"పౌరోగవుడు అంటే -పాకశాలాధ్యక్షుడు. **"పురోగోః జల మత్రాస్తీతి పురోగుః, పాకస్థానం, తస్యాయ మధ్యక్షః పౌరోగవః"** అని దీని వ్యుత్పత్తి.

**70.** కోదాదితః పూర్వ మితి బ్రువాణం పౌరోగవో భాషత యామునేయమ్।
ఆమాసషట్కం స్థవిరోగ్రజన్మా దినేదినే కశ్చిదలర్కపత్రమ్ ॥

ఇంత కాలంగా ఈ కూరను ఎవరు తీసికొని వచ్చారు?" అని అడిగారు. ఆఱునెలలుగా "ప్రతిదినం ఎవరో ముదుసలి బ్రాహ్మణుడు వచ్చి ఆ కూరను ఇచ్చేవారు. వారు ఈ నాడు ఇవ్వలేదు" అని పాకశాలాధి కారి అన్నాడు.

**71.** ప్రాదాద్భవద్దర్శనవాఞ్ఛయా స కిమద్య నాదాదితి తన్న జానే ।
నిశమ్య తస్యేతి వచో జగాద శ్వస్తం ద్విజం మేన్తిక మానయస్వ ॥

"మిమ్ములను కలవాలనే కోరికతో ఆఱు నెలలుగా అతడు కూరను ఇస్తున్నాడు. ఈనాడు ఎందుకు ఇవ్వలేదో కారణం తెలియదు" అని వంటశాల అధికారి పల్కిన మాటను విని యామునులు "రేపు ఆ వ్యక్తి మళ్ళీ వస్తే ఆయనను నా వద్దకు తీసికొని రా" అని అన్నారు.

72. ఇతీరిత స్సూపకృదప్యనైషీత్
శ్రీరామమిశ్రార్య మముష్య పార్శ్వమ్ ।
తం యామునేయో నిజగాద నిత్యం
పత్రం త్వమాలర్క మదాః కిమర్థమ్ ॥

ఈ విధంగా యామునులచే చెప్పబడిన పాకశాలాధికారి మఱునాడు తన వద్దకు ముళ్ళ ఉస్తెకూరను తీసికొనివచ్చిన శ్రీరామమిశ్రులను యామునుల వద్దకు తీసికొనివెళ్ళాడు. అపుడు యామునులు శ్రీరామ మిశ్రులను చూచి "మీరు ఇంతకాలంగా ముళ్ళఉస్తె కూరను ఎందుకు ఇస్తున్నారు?"

73. క్షేత్రేషు కిం తే ఫలవత్సు కామో ధనేషు వాఞ్ఛా కిముతాదృశేషు।
తేనేతి పృష్ట స్సత మాబభాషే క్షేత్రేషు చార్థేషు న మేభిలాషః ॥

చక్కగా పండే క్షేత్రాలపట్ల మీకు కోరిక ఉన్నదా? లేక, ధనం పైన ఆసక్తి ఉన్నదా?" అని అడిగారు. ఈవిధంగా ప్రశ్నింపబడ్డ శ్రీరామ మిశ్రులు యామునులతో "నాకు క్షేత్రాలపట్ల గాని, ధనంపట్ల గాని అభిలాష లేదు.

74. న్యస్తో నిగూఢం భవదీయపూర్వై ర్నిధి ర్మయి భ్రాజతి తం గృహాణ।
ఇతీరిత స్తేన స తం బభాణ కిం వా మయా తస్య కృతే విధేయమ్॥

మీకంటే ముందు ఆచార్యులచే రహస్యమైన నిధి ఒకటి నాలో గుప్తంగా నిక్షిప్తమై ఉన్నది. నాలో ఉండే ఆ నిధిని మీరు స్వీకరించండి" అని అన్నారు. శ్రీరామమిశ్రులు ఈ విధంగా పలుకగానే యామునులు వారితో "అయితే, ఈ విషయంలో నేను చేయవలసిన కర్తవ్యమేమి?" అని ప్రశ్నించారు.

"పూర్వ" శబ్దం పూర్వదిక్కును ఉండే వస్తువును నిర్దేశిస్తే విశేష్యనిఘ్న మవుతుంది. పూర్వులైన పితృపితామహులను తెలిసినపుడు పులింగమవు తుంది. "పూర్వే వదంతి, పూర్వైః కృతమ్" ఇత్యాది ప్రయోగాలు



ఉదాహరణీయాలు. ఇక్కడ "గరీయాన్ బ్రహ్మదః పితా" అని ప్రశంసింపబడే పూర్వాచార్యులు ఈ శబ్దం చేత తెలుపబడ్డారు.

75. స చాహ వస్తుం ఘటికా శ్చతస్ర-
స్త్వయాన్వహం ద్వాః క్రియతా మరోధా ।
అపోఢదౌవారికరోధకృత్యః
ప్రాచష్ట సోష్టాదశవాసరేస్మై ॥

శ్రీరామమిశ్రులవుడు - "నేను ప్రతిదినం నాల్గు గడియల కాలం నీతో ఉండగోరుతున్నాను. ఆ సమయంలో దారిని అడ్డులేకుండా చేయాలి" అన్నారు. ఆవిధంగా శ్రీరామమిశ్రులు ద్వారపాలకులకే అడ్డుపెట్టబడని వారై యామునులతో పద్దెనిమిది దినాలపాటు ప్రతిదినం సంభాషించారు.

76. శ్రీకృష్ణగీతోపనిషద్విరాజదష్టాదశాధ్యాయసమర్థితార్థమ్ ।
ఆకర్ణ్య తస్మాన్ముదిత స్తమర్థమార్తో విరక్తశ్చ దినే దినే సః ॥

శ్రీకృష్ణుడు పల్కిన గీతోపనిషత్తులో ప్రకాశించే పదునెనిమిది అధ్యాయాలలో తెలుపబడిన అర్థాన్ని శ్రీయామునులు విని, చాలా ఆనందించారు. అప్పటినుండి ప్రతిదినం వారు భగవంతునిపట్ల ఆర్తిని, లౌకిక విషయాలపట్ల విరక్తిని కలవారయ్యారు.

"పరమాత్మని యో రక్తో విరక్తోపరమాత్మని" (ఎవరు పరమాత్మ పట్ల భక్తిని, పరమాత్మ కానివానిపట్ల వైరాగ్యాన్ని కల్గిఉన్నాడో) అనే శ్రుత్యర్థ ప్రకారంగా యామునులకు పరమాత్మ రక్తి, లౌకిక విరక్తి కల్గిందని తాత్పర్యం. వారు ఆలకించినది గీతోపనిషత్ సారం కదా! ఈ అర్థాన్నే యామునులు తరువాత గీతార్థసంగ్రహరూపంలో వెలయించారు.

77. కృష్ణం త మాసాదితు మభ్యుపాయః
కో వేత్తి తం కౌతుకవా నపృచ్ఛత్ ।
తేనేతి పృష్టః పరమోభ్యుపాయః
తదర్థసాక్షాత్కరణైకహేతుః ॥

ఆకృష్ణునిచేరే ఉపాయం ఏది? అనే కుతూహలాన్ని కలవారై యామునులు శ్రీరామమిశ్రులను అడిగారు. అపుడు శ్రీరామమిశ్రులు "ఆ పరమాత్మను సాక్షాత్కరించుకోగల్గిన గొప్ప ఉపాయం ఒకటి ఉన్నది".

**78.** అస్తీతి తస్మై విజనే జగాద శ్లోకస్య సోర్థం చరమస్య గూఢమ్ ।
తత స్సమాకర్ణ్య విరక్తిభాజా నిరస్తసంసారరసాదరేణ ॥

అని ఈవిధంగా పల్కి శ్రీరామమిశ్రులు యామునులను ఏకాంతానికి తీసికొనిపోయి గీతలోని చరమశ్లోకంలోని రహస్యార్థాన్ని తెలిపారు. దానితో శ్రీయామునులు పూర్తివిరక్తిని పొందారు. వారి హృదయం సంసారానందానికి పూర్తిగా దూరమైనది.

**79.** స యామునేయేన సమం మహాత్మా సమాసదద్రఙ్గపురం గరీయః ।
తం శేవధిం వో జగదేకకన్దం రఙ్గేన్ద్ర ముద్దామదయామ్బురాశిమ్ ॥

మహాత్ములైన శ్రీరామమిశ్రులు శ్రీయామునులతో శ్రీరంగానికి వెళ్ళారు. జగత్తుకు మూలకారణం, గొప్ప నిధి, గొప్ప దయకు సముద్రం వంటివాడైన శ్రీరంగనాథుని దర్శింపజేశారు.

"నిధిర్నా శేవధిః" అని అమరకోశవచనం. శేవధి అంటే -నిధి.

**80.** ప్రాదర్శయ త్తం భవదీయపూర్వైః సమార్జితోయం నిధి రిత్యముష్మై।
అర్థం రమాముద్రిత మాప్తుమేత మిదం ప్రయోజ్యానసపత్రభావమ్॥

"ఈ నిధిని మీ పూర్వాచార్యులు ఆర్జించారు. దీనిని దర్శించండి" అని యామునులకు శ్రీరంగనాథుని చూపించారు. ఈ లక్ష్మీలాంఛిత మైన పుండరీకాక్షమైన నిధిని పొందడంకోసం శరణాగతిని ఉపాయంగా ప్రయోగించాలి." అని అన్నారు.

**81.** ఇత్యానతాయోపదిదేశ తస్మై శ్రీరామమిశ్రో ద్వయమన్త్రరత్నమ్।
సాక్షాత్కృతిం జగ్ముషి రఙ్గరాజే స యామునేయో ద్వయమన్త్రలాభాత్ ॥



శ్రీరామమిశ్రులు తమకు నమస్కరించిన యామునులతో పల్కి, ద్వయమంత్రోపదేశాన్ని చేశారు. ఈ ద్వయమంత్రలాభం వల్ల శ్రీయామునులు శ్రీరంగనాథుని ప్రత్యక్షీకరించుకోగలిగారు.

**82.** ఆనన్దబాష్పావిలలోచన స్తమాపాదచూడం హృదయేన్వభుంక్త ।
శ్రీరఙ్గరాజానుభవాత్త్రిదణ్డిభావేన సంన్యాస్యదపాస్య రాగమ్ ॥

అపుడు యామునుల నేత్రాలు ఆనందబాష్పాలతో నిండిపోయాయి. వారు శ్రీరంగనాథుని రూపాన్ని ఆపాదచూడంగా హృదయంలో అనుభవించారు. ఆ విధంగా శ్రీరంగనాథుని అనుభవంతో లౌకిక విషయాలపట్ల విరక్తులై శ్రీయామునులు సన్న్యసించారు.

**83.** అర్థస్య లాభే సతి శాశ్వతస్య కిం నశ్వరం వస్తు భజన్తి సన్తః? ।
స సంవిదాత్మేశ్వరసిద్ధివేదప్రామాణ్య మాస్తోత్రయుజోష్ట చక్రే ॥
గీతార్థ సంక్షేపణ పురుషార్థనిరూపణ స్తోత్రమణీన్ ప్రబంధాన్ ॥

శాశ్వతమైన అర్థలాభాన్ని పొందినపుడు సత్పురుషులు అశాశ్వతమైన అర్థాన్ని కోరరు కదా ! (ఆ విధంగానే పరమార్థస్వరూపుడైన శ్రీరంగనాథుని అనుభవంవల్ల లౌకికమైన అర్థాల అనుభవాన్ని వీడి యామునులు సన్న్యాసాశ్రమ స్వీకారాన్ని చేశారు.) తరువాత యామునులు సంవిత్సిద్ధి, ఆత్మసిద్ధి, ఈశ్వరసిద్ధి - అనే సిద్ధిత్రయాన్ని, ఆగమప్రామాణ్యం, స్తోత్రరత్నం, చతుఃశ్లోకి, గీతార్థసంగ్రహం, పురుషనిర్ణయం - అనే ఎనిమిది గ్రంథాలను రచించారు.

**84.** అంశా బభూవుః కుముదాక్షశఙ్కుకర్ణాహినేత్రోజ్జ్వలవామనానామ్।
శ్రీయామునేయస్య చ తస్య శిష్యా భవాబ్ధిమగ్నోద్ధరణప్రవీణాః॥

కుముదాక్షుడు, శంకుకర్ణుడు, సర్పనేత్రుడు, ఉజ్జ్వలుడు, వామనుడు- అనే దివ్యసూరుల అంశలతో జన్మించిన అయిదుగురు మహానుభావులు

శ్రీయామునులకు శిష్యులయ్యారు. వారందఱు సంసారసాగరంలో మునిగిన జీవులను ఉద్ధరించడంలో సమర్థులు.

**85.** **ఏషాం మహాపూర్ణమనీషి రజ్గికుశీలవాధీశ్వరకాఞ్చిపూర్ణాః ।**
**శ్రీమాల్యభృద్గోష్ఠిపురేశపూర్ణా ఇతి క్షితౌ ఖ్యాతి మవాపు రార్యాః ॥**

వారు, పెరియనంబి, తిరువరంగప్పెరుమాళ్ అరైయర్, కాంచీ పూర్ణులు, తిరుమాలైయాణ్డాన్, తిరుక్కోట్టియూర్నంబి -అని ప్రసిద్ధిని పొందినవారు (కుశీలవులంటే గాయకులు.)

**86.** **స సమ్యగేతా నపరాంశ్చ శిష్యాన్ సాకం ద్వయేనోపనిషద్రహస్యమ్।**
**అధ్యాపయద్ద్రామిడ మాగమం చ సుధావయస్యా స్స్వకృతా కృతీశ్చ॥**

శ్రీయామునులు ఈ అయిదుగురు శిష్యులకు, ఇంకా పలువురు శిష్యులకు ద్వయమంత్రాన్ని, ఉపనిషద్రహస్యాలను, ద్రావిడవేదాలను, అమృతంతో సమానమైన తమ గ్రంథాలను నేర్పించారు.

**87.** **పితామహ స్తే పరిగృహ్య చాస్మాన్ కిఞ్చిద్రహస్యం కురుకేశతాతే।**
**న్యస్తం చకారేతి స రామమిశ్రగిరాప గఙ్గాధరరాజధానీమ్ ॥**

తరువాత ఒకనాడు యామునులతో శ్రీరామమిశ్రులు "మీ పితామహులైన నాథమునులు మమ్మల్లను శిష్యులుగా పరిగ్రహించి, మాలో ఒకరైన కురుకైకావలప్పన్ అనే వారివద్ద యోగరహస్యాన్ని నిక్షిప్తం చేశారు. దానిని వారివద్దకు వెళ్ళి నేర్వండి" - అని అన్నారు. దీనిని విని శ్రీయామునులు తిరువనంతపురానికి వెళ్ళారు.

**88.** **స తత్ర జీర్ణాలయకుడ్యభాగే నివిష్ట మారూఢసమాధిభేదమ్ ।**
**విలోక్య తస్యావసరం ప్రపిత్సుః సహాస్తే పశ్చాన్నిభృతం స్వశిష్యైః॥**

అక్కడ కురుకైకావలప్పన్ ఒక పాడుపడిన ఇంటిగోడ వెనుక యోగసమాధిలో మునిగి ఉన్నారు. శ్రీయామునులు వారీవిధంగా యోగనిష్ఠులై



ఉండడం చూచి, వారిని దర్శించడంకోసం తమ శిష్యులతో పాటు వారి వెనుక కనపడకుండా తగిన సమయంకోసం నిలచి వేచి ఉన్నారు.

**89.** **స యోగనిష్ఠః పరివృత్య పశ్చాత్**
**కో వాగమత్ శొట్టైకులోద్భవోఽత్ర ।**
**ఇతి బ్రువాణం పదయోః ప్రణమ్య**
**భక్త్యైద మాపృచ్ఛత యామునేయః ॥**

యోగసమాధిలో ఉండే అప్పన్ సమాధినుండి కన్నులు తెరచి, వెనుకకు తిరిగి "ఇక్కడ శొట్టైకులానికి చెందినవారెవరైనా వచ్చారా?" అని ప్రశ్నించారు. ఈమాట విని యామునులు భక్తితో వారి చరణాలలో నమస్కరించి ఈ విధంగా ప్రశ్నించారు.

**90.** **పశ్చాన్నివిష్టం నిభృతం కథం మా మబుద్ధ యోగీతి తముక్తవంతమ్।**
**తత్తస్య శొట్టైక్కులజేతరేషాం నానుగ్రహోఽస్తీతి మమైవ మూచే ॥**

"మీ వెనుకనే కనపడకుండా ఉండే నన్ను మీరు ఏవిధంగా తెలిసికొన్నారు". ఈ ప్రశ్నకు అప్పన్ "శొట్టైకులంలో పుట్టినవారి విషయంలో తప్ప స్వామి ఇంకెవరిపట్ల ఇంతటి అనుగ్రహాన్ని చూపడు. కనుక ఈ విధంగా ప్రశ్నించాను" అని అన్నారు.

**91.** **ఉక్త్వైవ మస్మై వినతాయ యోగ-**
**రహస్యవిజ్ఞాన సముత్సుకాయ ।**
**కాలే వదేయం చరమే మమేతి**
**తం ప్రాహిణోత్ స్వాంతిమ పత్రదానాత్ ॥**

ఈ విధంగా పల్కి, తనకు నమస్కరించినవారు, యోగవిజ్ఞానాన్ని గూర్చి తెలిసికోవాలనే ఉత్సుకతతో ఉండేవారైన యామునులతో "నా చరమకాలంలో ఈ రహస్యాన్ని మీకు ఉపదేశిస్తాను" అని పల్కి, తమ అంతిమ సమయాన్ని తెలిపే పత్రాన్ని వ్రాసి వారికి ఇచ్చారు.

ఈ ఐతిహ్యం భగవద్విషయం ఈడు 2-6-2వ పాశురవ్యాఖ్యలో ఉట్టంకింపబడింది. ఇది ఇక్కడ ఐదవ శ్లోక వ్యాఖ్యానంలో వివరింప బడింది.

**92.** **పత్రం సమాదాయ తదన్త్యకాల నిరూపకం రఙ్గగతాశ్శృణోత్సః ।**
**రఙ్గ్యగ్రతో రఙ్గికుశీలవేశగీతా మనన్తేశయకీర్తిగాథామ్ ॥**

ఆ పత్రాన్ని తీసికొని యామునులు శ్రీరంగాన్ని చేరారు. ఒకనాడు శ్రీరంగనాథుని సమక్షంలో అరైయర్‌స్వామి **"వయలణి అనన్దపురమ్ నడమినో నమర్‌కళుళ్ళీర్!, నాముమక్కుఱియ చ్చొన్నోమ్"** (అందమైన పంటపొలాలను కల తిరువనంతపురానికి వెళ్ళి అక్కడ స్వామిని సేవించండి. నేను మీకు తెలిసేటట్లు ఉపదేశిస్తున్నాను) అనే తిరువాయ్ మొழிలో సంసారులను ఉద్దేశించి నమ్మాழ்వార్లు తిరువనంతపుర క్షేత్రాన్ని దర్శించమని పల్కిన పాశురాన్ని గానం చేయగా విన్నారు.

**93.** **ప్రాయాద్యదానన్తపురే ముకున్దం సిసేవిషు స్స్వప్త మనన్తభోగే ।**
**తదావధిం పత్రముఖేన తస్య విలోక్య మధ్యే సరణి వ్యషీదత్ ॥**

వెంటనే వారు తమ శిష్యులతో అనంతపురక్షేత్రానికి బయలు దేరారు. దారిలో కురుకైకావలప్పన్ తమకు వ్రాసి ఇచ్చిన పత్రం గుర్తుకు రాగా, దానిని పరిశీలించి చూచారు. అప్పన్ నిర్దేశించిన చరమసమయం అప్పటికే ఆసన్నమైనదని తెలిసి, ఆ సమయంలోగా తాము తిరువనంత పురానికి చేరడం అసాధ్యమని గ్రహించి, శ్రీయామునులు చాలా చింతించారు.

**94.** **అప్రాప్య తద్యోగరహస్య మార్తః సమేత్య శిష్యై స్సహ రఙ్గధామ ।**
**ప్రవర్తకో వైష్ణవదర్శనస్య శిష్యేషు క స్స్యాదితి తేన మేనే ॥**

ఆ విధంగా కురుకైకావలప్పన్‌వద్దనుండి యామునులు యోగ రహస్యాన్ని అభ్యసించలేక చాలా ఆర్తిని పొందారు. శిష్యులతో కలసి వారు శ్రీరంగాన్ని చేరారు. శ్రీవైష్ణవధర్మ ప్రచారాన్ని తమకు పిమ్మట తమ శిష్యులలో ఎవరు నిర్వహించగలరు? అని యామునులు ఆలోచించారు.



**95.** **స్థానేష్వఞ్జనకుఞ్జరావనిధరశ్రేష్ఠోరుగోష్ఠీ పురీ-**
**ముఖ్యేషూపనివేశ్య శిష్యతిలకాన్ సర్వాః ప్రజా రక్షితుమ్।**
**తత్పూఃపూర్ణమనీషిణో నిజజయస్తమ్భానివాసౌ స్థితో**
**రఙ్గే కఞ్చన లిప్సు రాత్మసదృశం శిష్యై స్తదన్యై ర్వృతః ॥**

వేంకటాచలం, హస్తిగిరి, గొప్పదైన గోష్ఠీనగరం మొదలైన చోట్ల ఆ క్షేత్రాల నామాలతో అంకితమైన పేర్లను కలవారైన శ్రీశైలపూర్ణులు, కాంచీ పూర్ణులు, గోష్ఠీపూర్ణులు మొదలైన తమ ముఖ్యశిష్యులను తమ విజయ స్తంభాలను వలె నిలిపి, శ్రీయామునులు, తాము మిగిలిన శిష్యులతో పాటు శ్రీరంగంలో నిత్యవాసం చేశారు. తమకు తగిన సమర్థుడైన ఒకానొక శిష్యుడు లభించగలడనే ఆశతో వేచి ఉన్నారు.

కావ్యంలోని సర్గాంతంలో భిన్నవృత్తాన్ని ప్రయోగించాలనే నియమాన్ని పాటిస్తూ కవి ఇక్కడ చివరలో శార్దూలవిక్రీడిత వృత్తాన్ని ప్రయోగించారు.

శ్రీదివ్యసూరిచరితమనే మహాకావ్యంలో పదహారవ సర్గ సంపూర్ణం.



## శ్రీగరుడవాహన పండితుడు రచించిన

# శ్రీదివ్యసూరిచరితంలో

## పదిహేడవ సర్గ

## (శ్రీరామానుజ వైభవం)

1. తుణ్డీరాహ్వయవిషయే మహాగ్రహారః
పూదూరిత్యవనివిశేషకోస్తి కశ్చిత్ ।
ఆవాసో హరిచరణాబ్జభక్తిభాజాం
విప్రాణాం శ్రుతిశిఖరాధ్వజాఙ్ఘికానామ్ ॥

తుండీర (తొండ) మండలంలో శ్రీపెరుంబూదూర్ అనే గొప్ప బ్రాహ్మణాగ్ర హారం ఉండేది. ఈ నగరంలో హరిచరణారవిందాలలో భక్తిని కలవారు, వేదాంతమార్గసంచారాన్ని చేయడంలో - అంటే - వేదాంతతత్త్వ నిర్ణయం చేయడంలో - సమర్థులైన బ్రాహ్మణులు నిత్యవాసం చేసేవారు.

ఎంత గొప్ప జ్ఞానం ఉన్న అది భగవద్భక్తిగా పరిణమించకపోతే ఉపయోగంలేదు. **"భక్త్యా శాస్త్రాత్ వేద్మి జనార్దనమ్"** అనికదా సూక్తి. ఈ విషయాన్ని మూడవ పాదం సూచిస్తుంది.

ఇక్కడ **"జాంఘిక"** శబ్దప్రయోగం విలక్షణమైనది. గహనాలైన శాస్త్రన్యాయాలతో వేదాంతార్థ నిర్ణయం చేయడం అంతసులభం కాదు. అటువంటి దుర్గమ వేదాంతమార్గంలో అవలీలగా సంచరించగల్గినవారనే అర్థం ఈ శబ్దం ద్వారా స్ఫురిస్తుంది. **"జంఘాలోతిజవ స్తుల్యౌ"** అని అమరం. మిక్కిలి వేగంగా సంచరించగలిగేవారని ఈ పదానికి అర్థం. దివ్యప్రబంధ సూక్తులను అనుసరించి చేసిన ప్రయోగంగా దీనిని భావించవచ్చు. ఆళ్వార్లు తమ ప్రబంధాలలో భగవంతుడు నివసించే దివ్యదేశాలను కీర్తించే సందర్భాలలో పలుచోట్ల అచట ఉండే విప్రులు వేదార్థనిర్ణయదక్షులని కీర్తిస్తారు. **"శెఙ్జొల్ నాన్మఱైయోర్ తెన్నళుందియల్ మన్నినిన్ఱ"** (పెరియ తిరు-



7-6-5) (ఋజువాక్కులైన వేదాలను అభ్యసించినవారు నివసించే, దక్షిణ దిక్కులోని తిరువళుందూర్ అనే దివ్యదేశం) అని, **"నావార్ పుకழ் వేదియర్ మన్నియ నాఙ్గూర్"** (4-7-9) (చక్కని వాగ్బలాన్ని కలవారనే కీర్తినికల వైదికులు నిత్యవాసం చేసే తిరునాఙ్గూర్ దివ్యదేశం) అని, **"తెళివ్వ నాన్మఱైయోర్ నాఙ్గై"** (తేటపడిన జ్ఞానాన్ని కల, చతుర్వేదాలను అభ్యసించిన విప్రులు నివసించే తిరునాఙ్గూర్ దివ్యదేశం) (4-3-9) అని, **"శిఱప్పుడై మఱైయోర్ నాఙ్గై నన్నడువుళ్"** (4-3-2) అని ఈ విధంగా పలుచోట్ల ఇటువంటి సూక్తులను గమనించ వచ్చు. ఆళ్వార్లు భగవదభిమాన స్థలాలలో వేంచేసి ఉండే మహనీయులను కీర్తించగా, ఇక్కడ కవి జగదాచార్యులు అవతరించిన శ్రీపెరుంబూ దూర్‌లో నిత్యవాసం చేసే మహనీయుల వైభవాన్ని కీర్తిస్తున్నారు. ఆళ్వార్ల సూక్తి ప్రథమపర్వాత్మకం కాగా, ఈవిధంగా ప్రకృతసూక్తి చరమ పర్వాత్మకం. ఇటీవలికాలం వరకు (సుమారు 70-80 సంవత్సరాల క్రితం వరకు) శ్రీపెరుంబూదూర్ ప్రసిద్ధమైన శాస్త్రాధ్యయన కేంద్రంగా భాసిల్లడం సువిదితమే కదా? **"అగ్రహార"** శబ్దానికి బ్రాహ్మణ నివాసమనే అర్థం ద్రావిడదేశంలో వ్యవహారంలో ఉన్నది.

శ్రీభూతపురిలోని బ్రాహ్మణోత్తముల మహిమ ప్రపన్నామృతంలో **"వేదాధ్యయనశీలైశ్చ విద్వద్భిః బ్రాహ్మణోత్తమైః, కావ్యనాటకపాఠైశ్చ వేదపాఠైశ్చ స్తథైవ చ, తార్కికై శ్శాబ్దికై శ్చాపి వేదవేదాంతపారగైః.... నాదితా స్సర్వత శ్శుభా"** (వేదాధ్యయనాన్ని చేసే, పండితులైన బ్రాహ్మణోత్తము లతో, కావ్య నాటకాలను చదివే పండితులతో, తార్కికులతో, వ్యాకరణ పండితులతో, వేదవేదాంతాలను పూర్ణంగా తెలిసినవారితో కూడినది) అని వర్ణింపబడింది.

2. పర్యఙ్కోరగపతిభావివిప్రయోగ-
ప్రస్తావాసహ ఇవ భక్తవత్సలత్వాత్ ।
యత్రాసౌ సహ రమయా పురైవ వాసం
వైకుణ్ఠో రచయతి కేశవాభిధానః ॥

ఈ దివ్యదేశంలో శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవితో కలసి కేశవ నామంతో నిత్యవాసం చేస్తున్నాడు. ఈ విధంగా స్వామి శ్రీవైకుంఠాన్ని వదలి ఇక్కడ నిత్యవాసం చేయడానికి కారణం భక్తవాత్సల్యమే. కలియుగంలో, తన భక్తుడైన ఆదిశేషుడు శ్రీరామానుజుల రూపంలో అవతరించబోతాడని తెలిసినస్వామి, ఆ విశ్లేషాన్ని సహించలేక, భూతపురి అనబడే శ్రీపెరుంబూదూర్‌కు ముందుగానే వచ్చి కేశవనాముడై అక్కడ నెలకొన్నాడు.

స్కాందపురాణాంతర్గతమైన శ్రీభూతపురీ మహాత్మ్యంలో శ్రీమన్నారాయణుడు ఆదికేశవుడై భూతపురిలో ఆవిర్భవించిన వృత్తాంతం తెలుపబడింది. దాని ప్రకారం, భగవంతుడు భూతగణాల, శివుని ప్రార్థన మేరకు అక్కడ ఆదికేశవుడై వెలసినట్లు తెలుపబడినా, ప్రకృతంలో కవి, ఆదిశేషుని విశ్లేషాన్ని సహించలేక భగవంతుడు ముందుగానే భూతపురిలో ఆదికేశవుడై అవతరించినట్లు పల్కడం ప్రకృత విషయమైన శ్రీరామానుజుల వైభవానికి అనుగుణం. "భక్తవిప్రయోగ ప్రస్తావాన్ని సైతం సహించలేనివానివలె" అని అంటూ భగవంతుని భూతపురీ నివాసానికి హేతువు ఉత్ప్రేక్షింపబడినందున హేతూత్ప్రేక్ష.

3. యత్రోద్యద్ద్విజసవనాగ్నిధూమలేఖా-
లేఖాలిప్రమదవిధానవైజయన్తీ ।
నిఃశ్రేణీ దివ మధిరోహతో జనస్యా-
లిశ్రేణీ గగనవినీలనీరజస్య ॥

ఆభూతపురిలో నివసించే విప్రులు నిత్యం చేసే యజ్ఞయాగాది కార్యక్రమాలలో పైకి లేచిన ధూమరేఖలు ఏవిధంగా కన్పిస్తున్నాయి? అని అంటే - ఆయా యజ్ఞయాగాదులలో ఆరాధింపబడే పలువురి దేవతలకు ఆనందాన్ని కల్గించడంకోసం తమ భవనాల అగ్రభాగాలలో నిలుపబడ్డ ధ్వజాల (పతాకల) వలె ఉన్నాయి. జనులు స్వర్గాన్ని అధిరోహించడం కోసం నిలుపబడ్డ నిచ్చెన వలె ఉన్నవి. గగనమనే నీలకమలంలోని తేనెను ఆస్వాదించడంకోసం వరుసగా చేరిన తుమ్మెదల బారువలె ఉన్నది.



**"పతాకా వైజయంతీ స్యాత్"** అని అమరం. **"వైజయంతీ పతాకాయామ్"** అని మేదినీ నిఘంటువు. పతాక -అని దీని అర్థం. **"విజయతే అనయా"** అని, **"విజయతాం సంబంధినీ"** అనే వ్యుత్పత్తుల ద్వారా వైజయంతి అనే పదం విజయసూచకం. కనుక, ఆయా దేవతల పూజారూపమైన యజ్ఞయాగాదులు వారి వైభవ సూచకాలు కనుక, అపుడు పైకి ఎగసే ధూమరేఖలు వారి విజయసూచకాలైనందున, అవి వారికి ఆనందాన్ని ఇచ్చే పతాకాలై తోస్తున్నాయి అని అనడం సరసం. **"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"** ఇత్యాదిగా స్వర్గ ఫలప్రాప్తికి సాధనాలుగా జ్యోతిష్టోమాది యాగాలు వేదంలో విధింపబడ్డాయి. కనుక, ఆ యాగాలలో పైకి ప్రసరించే ధూమరేఖలు స్వర్గానికి నిచ్చెనలవలె తోస్తున్నాయి అని చెప్పబడింది. ఆ విధంగానే ఆకాశం నీలవర్ణంగా ఉన్నందున అది ఒక పెద్ద నల్ల కలువగా ఆకాశం వైపు ప్రసరించే నల్లని ధూమరేఖలు ఆ కలువలో వాలిన తుమ్మెదల బారులవలె తోస్తున్నవి- అని భావం.

దివ్యప్రబంధాలలో పలు చోట్ల ఆ యా దివ్యదేశాలను వర్ణించే టపుడు అక్కడ నివసించే వైదిక బ్రాహ్మణులు చేసే యజ్ఞయాగాదుల సూచకంగా వారి గృహాలనుండి ధూమరేఖలు ఆకాశంవైపు ప్రసరిస్తున్నా యని ఆళ్వార్లు వర్ణించడం కన్పిస్తుంది. తిరువాయ్‌మొళిలోని **"వడమొళి మఱైవాళర్ వేళ్వియుళ్ నెయ్యళల్ వాన్‌పునై ప్పోయ్ తిడవిశుమ్బిలమరర్ నాట్టై మఱైక్కుమ్ తణ్‌తిరుప్పులియూర్"** (8-9-8) (తిరుప్పులియూర్ అనే దివ్యదేశంలో నివసించే, సంస్కృత వేదాన్ని అభ్యసించిన వైదికులు నిర్వహించే యజ్ఞాలలో సమర్పించిన నేతినుండి పుట్టిన పొగ పైకి ప్రసరించి, దృఢమైన ఆకాశంలోని దేవతల దేశమైన స్వర్గాన్ని ఆవరిస్తున్నది) అనే సూక్తి ఇందుకొక ఉదాహరణ. ఈ ప్రక్రియను అనుసరిస్తూ కవి భూతపురివైభవాన్ని, అక్కడ నివసించే మహనీయుల మహిమను వర్ణించారు. **"లేఖా అదితినందనాః"** అని లేఖాశబ్దానికి దేవతలని అర్థం. **"చిత్రాదౌ లిఖ్యంతే"** - చిత్తరువులలో వ్రాయబడేవారు- అనే లేఖాశబ్దవ్యుత్పత్తిద్వారా ఆకాశంలోకి ఎగసే

ధూమరేఖలు ఆ యా దేవతల రూపాలలో భాసించడం ద్వారా వారికి ఆనందాన్ని కల్గిస్తున్నాయనే భావం స్ఫురిస్తుంది. ఆ యా దేవతల ఆరాధనలలో వస్త్రచిత్రాదులలో వారి రూపాన్ని చిత్రీకరించడం ఆగమసిద్ధం.

**4. ఏకోభూన్మధురిపు భక్తినిఘ్నచిత్తః**
**తత్రోర్వీసురపతిరాసురీకులేన్దుః ।**
**త్రైలోక్యావనచణసూనుజన్మభూర్యో**
**ధాతారం వ్యజయత కాశ్యపం మహిమ్నా ॥**

అటువంటి భూతపురిలో మధుసూదనుని శ్రీచరణాలలో లగ్నమైన మనస్సును కల ఒక బ్రాహ్మణోత్తములు కేశవసోమయాజి ఉండేవారు. వారు ఆసూరివంశానికి ప్రకాశాన్ని, ఆనందాన్ని కల్గించే చంద్రునివంటి వారు. ఆ మహనీయులు, ముల్లోకాలను రక్షించగల్గిన కుమారులకు (శ్రీరామానుజులకు) తండ్రి అయినందున కశ్యపప్రజాపతిని కూడా మహిమలో జయించారు.

**"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్విక స్స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః"** (ఎవనిని, అతడు పుట్టే సమయంలో మధుసూదనుడు కటాక్షిస్తాడో, అతడు సాత్త్వికుడని తెలియదగినవాడు, అతడే మోక్షపురుషార్థాన్ని గురించి ఆలోచిస్తాడు) అనే సూక్తినిబట్టి **"మధురిపు భక్తి నిఘ్నచిత్తః"** అనే ప్రకృతశ్లోకంలోని ప్రయోగాన్ని బట్టి కేశవసోమయాజికి జాయమానదశలోనే మధుసూదన భక్తి ఏర్పడిందని, వారు సాత్త్వికాగ్రేసరులని తెలుస్తున్నది. **"తస్యాం పుర్యాం మహాప్రాజ్ఞో యజ్వా కేశవనామకః, వేదవేదాంగసంపన్నః సర్వశాస్త్రవిశారదః, సదాచారసమాయుక్తః సత్యధర్మ పరాయణః"** (ఆ భూతపురిలో గొప్ప బుద్ధిని కలవారు, వేదవేదాంగాలను తెలిసినవారు, అన్ని శాస్త్రాలలో సమర్థులు, మంచి ఆచారాన్ని కలవాడు, సత్యధర్మనిష్ఠులు అయిన కేశవ సోమయాజి ఉండేవారు) ఇత్యాదిగా కేశవసోమయాజి గొప్పతనం ప్రపన్నామృతంలో వర్ణింపబడింది.



కశ్యపుడు, అదితి చేసిన తపస్సువల్ల భగవానుడు వారికి కుమారుడై, వామనరూపంలో జన్మించి, ముల్లోకాలను అన్నిటిని తన సొత్తుగా కొలిచి నిరూపించాడు. కాని, ఆ వామనావతారంలో కూడా త్రైలోక్య రక్షణ పూర్తికాలేదు. అందువల్ల భగవంతుడు తన పర భక్తుడైన ఆదిశేషుని శ్రీరామానుజుల రూపంలో జగద్రక్షణార్థం అవతరింపజేశాడు. ఇన్ని అవతారాలను ఎత్తినా భగవంతునకు సాధ్యం కాని త్రైలోక్యరక్షణం శ్రీరామానుజుల వల్ల సాధ్యమైనది. అటువంటి శ్రీరామానుజులను పుత్రునిగా పొందిన కేశవసోమయాజి కశ్యపప్రజాపతిని మహిమలో జయించారనడం వాస్తవంకదా!

శ్రీభాగవతంలో కూడా **"అజుష్టగ్రామ్యవిషయా వనపత్యౌ చ దంపతీ, స వ్రాథేపవర్గం మే మోహితౌ మమ మాయయా, గతే మయి యువాం లబ్ధ్వా వరం మత్సదృశం సుతమ్... తయోర్వాం పునరేవాహ మాదిత్యా మాస కశ్యపాత్, ఉపేంద్ర ఇతి విఖ్యాతో వామనత్వాచ్చ వామనః" (10-పూర్వ-3-420)** అని అదితి, కశ్యపులకు తాను వామనుడై జన్మించిన వృత్తాంతాన్ని భగవంతుడే స్వయంగా తెలిపాడు.

శ్రీరామానుజులకు, వామనమూర్తికి మధ్య గల సామ్యాన్ని అముదనార్ ఇరామానుశనూర్రన్దాది - ప్రబంధంలో **"వామనన్ శీలన్"** (40) అనే సూక్తి ద్వారా దర్శింపజేశారు. ఈ సూక్తిని వివరిస్తూ పిళ్ళై లోకమ్ జీయర్- **"శ్రీవామనావతారత్తిలే అర్థిత్వాదినిరపేక్షమాక త్తానే వశిష్ఠచండాలాది విభాగమఱ సర్వరుడైయవుమ్ తలైకళిలే "నల్లడిప్పోదు" ఎన్నుమ్బడియాన శ్రీపాదత్తైవైత్తాప్పోలే, "నిదిధ్యాసితవ్యః" ఇత్యాది వేదాంతశాస్త్రవిహితమాయ్, "మహనీయవిషయిణీ ప్రీతిర్భక్తిః" ఎన్గిఱపడియే ప్రీతిరూపమాన ఇన్ద భగవత్కామత్తై శ్రీభాష్యముఖేన అరుళిచ్చెయ్‌దారాకైయాలుమ్, లోకత్తార్ ఎల్లార్‌క్కుమ్ భగవత్సంశ్లేషమ్ పిఱక్కుమ్బడి అవర్‌కళుడైయ అధికారానధికారజ్ఞళై ప్పారాదే ఉపదేశిత్తారా కైయాలుమ్, అవనుడైయ స్వభావమే**

ఇవర్క్కుమ్ స్వభావమయాయ్, అవనోడు తుల్యరానాక్ - ఎన్దదాయ్ గ్రఃః"
(వామనన్ శీలన్ - శ్రీవామనావతారంలో స్వామి ఎవరూ కోరకపోయినా తానే వశిష్ఠ - చండాలాది తారతమ్యాన్ని చూడకుండా అందఱి శిరస్సులపై "నల్లడిప్పోదు" అందమైన శ్రీపాదపద్మం - అనే రీతిలోని శ్రీపాదాన్ని పెట్టినట్లుగా, "నిదిధ్యాసితవ్యః" (మనస్సులో నిలుపుకోదగినవాడు) ఇత్యాదిగా వేదాంతశాస్త్రంలో విధింపబడినది, "మహనీయవిషయిణీ ప్రీతిః భక్తిః" - గొప్పవారి విషయంలోని ప్రీతియే భక్తి- అనేటట్లు ప్రీతిరూపమైన ఈ భగవత్కామాన్ని (భక్తిని) శ్రీభాష్యరూపంలో అనుగ్రహించినందున, లోకంలోని అందఱికి భగవత్సంశ్లేషం (సంబంధం) కలిగేటట్లుగా వారి యోగ్యతా యోగ్యతలను చూడకుండా శ్రీరామానుజులకు ఉపదేశించారు. ఆవిధంగా, వామనుని స్వభావమే శ్రీరామానుజుల స్వభావమైనందువల్ల, వామనునితో సమానమైన స్వభావాన్ని కలవారని తెలిసింది) అనే వివరణాన్ని అనుగ్రహించడం స్మరించాలి. ఇది వీరిద్దరి మధ్య గల సామ్యం ఇక, వామనుని కంటే శ్రీరామానుజులకు గల ఆధిక్యాన్ని శ్రీఅముదనార్ "మణ్మిశైయోనికళ్ తోఱుమ్ పిఱన్దు ఎజ్గళ్ మాదవనే కణ్ణుఱ నిఱ్కిలుమ్ కాణకిల్లా ఉలకోర్కళెల్లామ్ అణ్ణల్ ఇరామానుశన్ వన్దు తోన్ఱియ అప్పొழుదే నణ్ణరు ఞానమ్ తలైక్కొణ్డు నారణఱ్కాయినరే" (41) (మన శ్రియఃపతియే భూలోకంలోని అన్ని జాతులలో అవతరించి, అందఱికి సర్వసులభుడై గోచరించినా అతనిని శేషి - అని గుర్తించని లోకులు స్వామి అయిన శ్రీరామానుజులు ఈలోకానికి వచ్చి అవతరించగానే దుర్లభమైన జ్ఞానం గొప్పగా కలవారై భగవంతునకు శేషమయ్యారు) అనే పాశురంలో సుస్పష్టం చేశారు. ఈ విధంగా జగద్రక్షణలో వామనునికంటే అధికులైన శ్రీరామానుజులను పుత్రునిగా పొందిన కేశవసోమయాజి కశ్యప ప్రజాపతికంటే మిన్న అయ్యారు.

5. ఆర్ద్రేభే సమజని చైత్రమాసి తస్మా -
దార్ద్రాత్మా బహులకృపారసేన కశ్చిత్ ।



నిస్సీమాఖిలగుణసజ్జనాశ్రయత్వాత్
శ్రీరామానుజ మకృతాఖ్యయా పితాయమ్॥

ఆ కేశవసోమయాజి వల్ల నామకరణం చైత్రమాసం ఆర్ద్రానక్షత్రంలో గొప్ప కృపాగుణంతో ఆర్ద్రమైన హృదయాన్ని కల మహనీయులు ఒకరు అవతరించారు. అంతులేని అన్ని కల్యాణగుణాలకు ఆకరమైనవారు, సజ్జనులకు ఆశ్రయమైనందున ఆ మహనీయబాలునకు తండ్రి "శ్రీరామానుజ" అనే నామాన్ని పెట్టారు.

పూవు పుట్టగానే పరిమళించే రీతిలో శ్రీరామానుజులలో జన్మతః భాసించే కల్యాణగుణాలను చూచి తండ్రి వారికి శ్రీరామానుజనామాన్ని పెట్టారని భావం. (ఆర్ద్రశబ్దానికి అది నామవాచకమైనపుడు ఆర్ద్రానక్షత్ర మని, విశేషణమైనపుడు తడసిన-మృదువైన - అని అర్థం.) శ్రీరామానుజులలో పలు కల్యాణగుణాలున్నా వారి కృపాగుణం విలక్షణం. అందువల్లనే కూరేశులు "అస్మద్గురోః భగవతోస్య దయైక సింధోః" అని వారి షాడ్గుణ్యపూర్తిని భగవచ్ఛబ్దంద్వారా తెలిపి, దయాగుణానికి అద్వితీయ సముద్రంగా శ్రీరామానుజులను సంభావించారు. అముదనార్ కూడా "కారేయ్ కరుణై ఇరామానుశా! ఇక్కడలిడత్తిల్ ఆరే అఱిబవర్ నిన్నరుళిన్ తన్మై?" (మేఘంతో సాటి వచ్చే కరుణను కల రామానుజా! మీ కృపాగుణ మహిమను ఈ భూమిలో ఉండేవారెవరు తెలియగలరు?) అని అన్నారుకదా!

"చైత్రమాసే శుక్లపక్షే పంచమ్యాం గురువాసరే, మధ్యాహ్నే కర్కటే లగ్నే నక్షత్రే రుద్రదైవతే" అని శ్రీరామానుజావతారం వర్ణింపబడింది. "ఆర్ద్రయా రుద్రః ప్రథమాన ఏతి" అనే వైదికసూక్తి రీతిలో ఆర్ద్రానక్షత్రం రుద్రుని అధిదేవతగా కల్గినది కనుక "నక్షత్రే రుద్రదైవతే" అని నిర్దేశింపబడింది. పలు ఇతర చరిత్ర గ్రంథాలలో రామానుజులకు నామకరణాన్ని వారి మేనమామ తిరుమలనంబి చేసినట్లు తెలుపబడింది.

6. శుద్ధాత్మా హృదయనివిష్టకైటభారిః
చక్రాజ్కో ధృతసకలక్షమాకలాపః ।

సర్వేషాం మరుదభినన్దితాత్మవృత్తిః
శేషత్వం ప్రకటయతి స్మ యో పరోక్షమ్ ॥

శ్రీరామానుజులు తాము ఆదిశేషులనే విషయాన్ని తమలో భాసించే కొన్ని స్వభావాలద్వారా వ్యక్తం చేశారు. అవి ఏవి? అంటే - (1) ఆదిశేషులు, శ్రీరామానుజులు పరిశుద్ధాత్ములు - అంటే - ఆదిశేషుడు తెల్లని వర్ణాన్ని కలవాడు, రామానుజులు పరిశుద్ధ స్వభావాన్ని కలవారు. (2) ఇద్దఱు తమలో భగవద్రూపాన్ని నిలుపుకొన్నవారు. హృదయనిష్ట కైటభారులు. అంటే- ఆదిశేషుడు తన ఒడిలో భగవానుని కల్గి ఉంటాడు. శ్రీరామానుజుల హృదయంలో భగవద్రూపం సదా సుప్రతిష్ఠమై ఉంటుంది. (3) ఇద్దఱు చక్రాంకాన్ని కలవారు. అంటే- ఆదిశేషుడు కుండలాకారంలో తన శరీరాన్ని కల్గి ఉన్నాడు. "కుండలీ" అని సర్పానికి పేరుకదా! లేక, పగడలపై చక్ర చిహ్నాన్ని కలవాడు. శ్రీరామానుజులు శ్రీసుదర్శనాది లాంఛనాలను కలవారు. (4) ఇద్దఱు ధృతసకలక్షమాకలాపులు. అంటే- ఆదిశేషుడు. తన శిరస్సుపై భూమిని మోస్తాడు. శ్రీరామానుజులు క్షమాది సకలగుణాలను కల్గి ఉన్నారు. (5) ఇద్దఱు మరుదభినందితాత్మవృత్తులు. అంటే- ఆదిశేషుడు సర్పం కనుక కేవలం వాయువును ఆహారంగా గ్రహించి శరీరధారణ చేస్తాడు. శ్రీరామానుజులు సమస్తజనుల హార్దికాభినందలను పాత్రమైన వర్తనాన్ని కలవారు. లేక, అందరికి ప్రాణసములు.

మరుత్తులు అంటే దేవతలు. ఇక్కడ ఈ శబ్దం పరమపదవాసులను తెలుపుతున్నట్లుగా గ్రహించవచ్చు. అంటే, శ్రీరామానుజుల కార్యాలను చూచి పరమపదవాసులు ఆనందించి అభినందించారు - అనే భావం.

"బాలం విలోక్య విబుధాః స్ఫురదంశుజాల మాచంద్ర వర్ణమమలం సుగుణాలవాలమ్, సమ్యగ్వితర్క్య బహుథాఖిల దివ్యచిహ్నైః శేషోయ మేవ భవతీతి దృఢం తమూచుః" అని శ్రీరామానుజుల చిహ్నాలను, గుణాలనుబట్టి వారు ఆదిశేషస్వరూపులని నిశ్చయింపబడినవైనాన్ని ప్రపన్నామృతం (2వ అధ్యాయం) తెలిపింది.



7. వక్త్రోద్యద్విషమవిషాకులద్విజిహ్వ-
వ్యాపారం విహితవిజిహ్మగత్వభఙ్గీ ।
భౌజఙ్గం వపు రపహాయ శేషభోగీ
యద్రూపం త్రిభువనవన్దితం జగామ ॥

ఆదిశేషుడు, తన నోటి నుండి వెలువడే విషంవల్ల విషమమైన, వ్యాకులపఱచే రెండు నాల్కల వ్యాపారాన్ని కల్గిన, కుటిలగతిని కల్గిన తన భుజంగరూపాన్ని వీడి, త్రిభువనవందితమైన, అమృతమయ వచనాలను కల, ఋజువ్యాపారాన్ని కల్గిన రూపాన్ని స్వీకరించి, శ్రీరామానుజులుగా అవతరించాడు.

ఆదిశేషుని రూపంలో ఉండే దోషాలు ఏమీ శ్రీరామానుజ రూపంలో లేవని తెలుపబడడం చేత, ఆదిశేషరూపంకంటే శ్రీరామానుజరూపానికి కల వైలక్షణ్యం తెలుపబడింది. (ఆదిశేషులు) శ్రీరామానుజులుగా అవతరించడంలోని రహస్యం.

వేదం "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" అని భగవంతుడు అవతరించినపుడే అతని గొప్పతనం వాత్సల్యసౌశీల్యాదులతో అతిశ యిస్తుందని అన్నది. ఆవిధంగానే, ఆదిశేషులు కూడా శ్రీరామానుజు లుగా అవతరించిన తరువాత అతిశయించిన వైభవాన్ని పొందారు - అనే అర్థస్వారస్యం ఇక్కడ స్ఫురిస్తుంది. దీనిని బట్టి శ్రీరామానుజుల అవతారానికి, భగవదవతారానికి గల సామ్యం ఇక్కడ చెప్పబడినట్లయినది. ఇక, తరువాతి శ్లోకంలో భగవదవతారాల కంటే ఆధిక్యం తెలుపబడుతున్నది.

8. శేషత్వం సకలజగద్ధురంధరస్యా-
పర్యాప్తం మధుమథనస్య మన్యమానః ।
లిప్సు ర్యో జగతి తదీయకిఙ్కరాణాం
భూరీణామపి సమవాతరత్పురస్తాత్ ॥

ఆదిశేషులు పరమపదంలో సమస్తజగత్తుల నిర్వహణభారాన్ని మోసే మధుసూదనునకు శేషవృత్తులను చేస్తూ భగవచ్ఛేషత్వాన్ని పొందినా, తావన్మాత్రంతో తృప్తి చెందనివారై, తదీయశేషత్వం సిద్ధిస్తే తప్ప భగవచ్ఛేషత్వం పరిపూర్ణం కాదని తలచి, ఈలోకంలో చరమపర్వనిష్ఠను పొందడంకోసం శ్రీరామానుజులుగా అవతరించారు.

ఇందులో శ్రీరామానుజులుగా ఆదిశేషులు భూమిపై అవతరించ డానికి ఒక హేతువు ఉత్ప్రేక్షింపబడింది. "సిద్ధే తదీయశేషత్వే సర్వార్థాః సంభవంతి హి" అనే రీతిలో తదీయశేషత్వంతో తప్ప భగవచ్ఛేషత్వానికి పూర్తి సిద్ధించదు కనుక, ఆదిశేషులు దానిని పొందడం కోసం శ్రీరామానుజులై అవతరించారని తాత్పర్యం.

శ్రీవరవరమునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో ఆళ్వార్ల అందటి అవతారస్థలాలను, వారి అవతారక్రమాన్ని గూర్చి ప్రస్తావించిన తరువాత, **"ఆళ్వార్ తిరుమకళార్ ఆణ్డాళ్ మదురకవియాళ్వార్ ఎతిరాశరా మివర్కళ్" (21)** ఇత్యాదిగా ఆణ్డాళ్‌ను, మధురకవులను, శ్రీరామానుజులను కలిపి అనుసంధించారు. ఈవిధంగా చేయడంలోని ఆంతర్యాన్ని శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ తమ వ్యాఖ్యలో వివరిస్తూ - **"ఇవర్ మూవరుమ్ ఆచార్యాభిమాన నిష్ఠరాకైయాలుమ్... "విట్టుశిత్తర్ తఙ్గళై తేవరై" ఎన్నుమ్, "తేవు మఱ్ఱఱియేన్" ఎన్నుమ్" "అడి పణిన్దుయ్‌న్దు" ... ఆకైయాలే ఇవర్కళ్ మూవరుడైయ అవతరణత్తైయు మరుళి చ్చెయ్‌కిఱార్"** (వీరు ముగ్గురూ ఆచార్యాభిమాన నిష్ఠులు అయినందున..., ఈ ముగ్గురి అవతారాలను కలిపి ప్రస్తావిస్తున్నారు) అని ఈ ముగ్గురు ఆచార్యాభిమాన నిష్ఠను కలవారైనందున వీరిని ఏకత్ర అనుసంధించడం జరిగిందని అన్నారు. ఈవిధమైన శ్రీరామానుజుల చరమపర్వనిష్ఠాగ్రేసరత్వాన్ని కవి ప్రకృతశ్లోకంలో సూచించారని భావించాలి. తిరువాయ్‌మొళిలోని **"పయిలుమ్ శుడరొళి" (3-7)** అనే దశకానికి ఈడువ్యాఖ్యలో ప్రవేశాన్ని అనుగ్రహించే నమ్బిళ్ళై **"కదాచిత్ కేశవే వృత్తిః తద్భక్తైర్వా సమాగమః"** అనే ప్రమాణంలోని **"వా"** శబ్దానికి శ్రీరామానుజులు



ఏవకారార్థాన్ని తెల్పుతూ చరమపర్వనిష్ఠా వైభవాన్ని ప్రతిపాదించడం వంటి పలు ఉదాహరణలు కూడా శ్రీరామానుజుల చరమపర్వనిష్ఠాగ్రేసరత్వాన్ని తెలుపుతున్నాయి.

**9. చౌలాదా వథ విధివత్ క్రియాకలాపే**
**నిర్వృత్తే గురు రవదాతధీభరస్య ।**
**అభ్యస్తాఖిలనిగమస్య తస్య పశ్చా-**
**దుద్వాహోత్సవమపి కారయాంబభూవ ॥**

స్వచ్ఛమైన బుద్ధిని కల్గిన శ్రీరామానుజులకు సకాలంలో తండ్రి కేశవసోమయాజి చౌలం, ఉపనయనం వంటి సంస్కారాలను జరిపించారు. పరంపరాగతమైన స్వాధ్యాయాన్ని (వేదాన్ని) అధ్యయనం చేసిన శ్రీరామానుజులకు ఉచిత కాలంలో వివాహాన్ని కూడా జరిపించారు.

శ్రీరామానుజులకు క్రీ.శ. 1022 సంవత్సరంలో అక్షరాభ్యాసం, 1024వ సంవత్సరంలో ఉపనయనం, 1033వ సంవత్సరంలో వివాహం జరిగాయని, 1034వ సంవత్సరంలో పితృవియోగం కలిగిందని, ఆ సంవత్సరమే కుటుంబంతో కంచిని చేరారని చారిత్రకుల అభిప్రాయం.

**"కృత్వాన్నప్రాశనం తస్య చౌళం చాపి యథాక్రమమ్, మౌంజీబంధం చకారాథ పుత్రస్యామితతేజసః, గర్భాష్టమే శుభదినే కేశవార్యో మహాయశాః, వేదాన్ సలక్షణాన్ తస్య స్వయ మేవోపదిశ్య చ, విద్యాస్నాతస్య పుత్రస్య వివాహం కర్తుముద్యతః, తతస్తు షోడశే వర్షే పుత్రస్యాదిత్యవర్చసః, వివాహం విధినా చక్రే స విప్రో వేదపారగః"** (శ్రీరామానుజులకు కేశవసోమయాజి అన్నప్రాశనచేసి, తరువాత యథాక్రమంగా చౌలాన్ని గర్భాష్టమ వర్షంలో మంచిరోజున ఉపనయనాన్ని చేశారు. స్వయంగానే సలక్షణంగా, సాంగంగా వేదాలను ఉపదేశించారు. తరువాత పదహాఱవ సంవత్సరంలో వివాహం చేయగోరి, సూర్యుని తేజస్సువంటి తేజస్సును కల శ్రీరామానుజులకు వివాహాన్ని యథావిధిగా చేశారు) అని ప్రపన్నామృతం తెల్పింది.

దీనివల్ల కాంచీపురం చేరడానికి ముందే శ్రీరామానుజులు గృహస్థాశ్రమ స్వీకారాన్ని చేసినట్లు స్పష్టపడుతున్నది.

10. శాస్త్రాణాం దురధిగమప్రమేయభాజాం
జాలాని ప్రథమమ కుణ్ఠధీః పఠిత్వా ।
శ్రీకాఞ్చ్యాం వరద ముపాస్య వేదచూడా-
పాఠోత్కో భజత స యాదవప్రకాశమ్ ॥

మొక్కవోని బుద్ధిని కల శ్రీరామానుజులు ముందుగా తత్త్వాన్ని గ్రహించడానికి కఠినాలైన పలు సామాన్య శాస్త్రాలను అధ్యయనం చేశారు. తరువాత కంచిని చేరి, వరదుని సేవించి, వేదాంత శాస్త్రాధ్యయనంలో ఆసక్తిని కలవారై యాదవప్రకాశునివద్దకు వెళ్ళారు.

ఈ విషయం ప్రపన్నామృతంలో - "అధీత్య సర్వశాస్త్రాణి జ్ఞానం సంపాదయామ్యహమ్, ఇతి బుద్ధి స్సముత్పన్నా లక్ష్మణార్యస్య నిశ్చితా, తతో జనముఖాత్ శ్రుత్వా యాదవం విదుషాం పరమ్, తత్సమీపే శాస్త్రపాఠం శ్రోతుకామః కుశాగ్రధీః... కాంచ్యాం వాసం కుటుంబేన సాకం చక్రే... యాదవస్య విపశ్చితః, సమీపే శాస్త్రపఠనం చక్రే రామానుజ స్సుధీః" ఇత్యాదిగా ప్రస్తావింపబడింది.

11. అర్థానా మథ నిగమాన్తవాక్యపఙ్క్తే -
రద్వైతం నిగదతి యాదవప్రకాశే ।
సద్వైతప్రకటనలమ్పట స్తదాత్వే
పాణ్డిత్యం స్ఫుట మతనిష్ట లక్ష్మణార్యః ॥

వేదాంత వాక్యాలకు యాదవప్రకాశులు అద్వైతసిద్ధాంతపరంగా వ్యాఖ్యానం చేయగా, విశిష్టాద్వైత సిద్ధాంతానుగుణంగా వివరించడంలో ఆసక్తిని కల శ్రీరామానుజులు తమ పాండిత్యాన్ని పలు సందర్భాలలో ప్రకటించారు.



ఈ సందర్భం ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావంలో- "యాదవ ప్రకాశనుమ్ - "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఎన్గిఱ శ్రుతి వాక్యత్తుక్కు ఖండత్వముండత్వ పూర్ణశృంగత్వఙ్గళ్ ఒరు గోవ్యక్తియిలే ఘటిక్కుమ్బోదితే బ్రహ్మత్తుక్కు ఇన్ద విశేషణమ్ కూడువదు" ఎన్ఱు అపార్థప్రతిపాదనమ్ పణ్ణ, ఇళైయాழ్వార్ అత్తై నిషేధిత్తు, సత్యశబ్దత్తాలే క్షణికవ్యావృత్తియైయుమ్, జ్ఞానశబ్దత్తాలే అచిద్వ్యావృత్తియైయుమ్, అనంతశబ్దత్తాలే పరిచ్ఛిన్న వ్యావృత్తియైయుమ్ పణ్ణి, చేతనాచేతన విలక్షణమాయ్, నిత్యమాయిరుక్కుమ్ బ్రహ్మమ్" ఎన్న, అవనుమ్ హుంకారమ్ పణ్ణినాన్" (యాదవప్రకాశుడు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనే శ్రుతివాక్యానికి, "సగం ఖండింపబడిన కొమ్ములను కల్గినది, కొమ్ములు పూర్తిగా తీసివేయబడినది, కొమ్ములను పూర్తిగా కల్గినది - అనే పరస్పర విరుద్ధ విశ్లేషణాలు ఒకే గోవులో సంభవించి నపుడు కదా పరబ్రహ్మకు కూడా ఈ విరుద్ధవిశేషణాలు కూడుతాయి"- అని అపార్థాన్ని పలుకగా, శ్రీరామానుజులు ఆ అర్థాన్ని నిషేధించి, సత్యశబ్దంచేత పరబ్రహ్మం క్షణికమైనది కాదని, జ్ఞానశబ్దం ద్వారా అచిత్తు కంటే పరబ్రహ్మం భిన్నమని, అనంతశబ్దంచేత పరిచ్ఛిన్నమైన వానికంటే వేఱయినదని తెలుస్తున్నదని తెలిపి, చేతనాచేతన విలక్షణమైన నిత్యమై పరబ్రహ్మం ఉంటుంది- అనే అర్థాన్ని తెలిపారు. అపుడు యాదవుడు కోపంతో హుంకరించాడు) అని ప్రస్తావింపబడింది. వడుగనంబి రచించిన యతిరాజ వైభవంలోకూడా "తతః కదాచిద్గురి యాదవేన సర్వం ఖలు శ్రుత్యవిశారదేన, అపార్థ ఉక్తే స యథార్థ ముక్త్వా రామానుజోదర్శయ దర్థసారమ్" అని చెప్పబడింది. ఇందువల్ల "అద్వైతం నిగదతి నిగమాంత వాక్యపంక్తేః" అనే ప్రకృతగ్రంథసూక్తిని బట్టి "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే శ్రుత్యర్థ విచారంలో కూడా అపార్థాన్ని అద్వైతపరంగా యాదవుడు పలుకగా, దానిని కాదని శ్రీరామానుజులు యథార్థప్రతిపాదన చేశారని భావించాలి.

12. సద్వైతం శ్రుతిశిఖరార్థ మాత్మనీనం
వ్యాహర్తు శ్రవణసుధాం కథాం నిశమ్య ।

శ్రీరామానుజవిబుధస్య యామునేయః
తాం కాంచీమభజత వీక్షితుం సశిష్యః ॥

వేదాంతవాక్యాలకు ఆత్మకు తగిన, క్షేమకరమైన విశిష్టాద్వైత పరంగా వివరణాన్ని చేసే శ్రీరామానుజుల కీర్తిని శ్రీయామునులు శ్రవణామృతంగా విని, వారిని చూడాలనే ఆశతో తమ శిష్యులతో పాటు కంచికి వచ్చారు.

ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావం, ప్రపన్నామృతం మొదలైన గ్రంథాలలో చోళరాజు కుమార్తెకు పట్టిన బ్రహ్మరక్షస్సును శ్రీరామానుజులు విడిపించి, యాదవుడు తమను చంపాలని చేసిన ప్రయత్నం నుండి తప్పించుకొని, కంచిని చేరిన తరువాతనే, యామునులు శ్రీరామానుజులను చూడాలనే ఆశతో శ్రీరంగంనుండి కంచికి వచ్చినట్లున్నది. కాని, శ్రీరామానుజులకు సమకాలీనులైన ఆంధ్రపూర్ణులు రచించిన యతిరాజవైభవంతో బ్రహ్మరక్షస్సు మోక్షానికి ముందే ఈ సందర్భం జరిగినట్లు కన్పిస్తుంది. యతిరాజవైభవం, దివ్యసూరిచరితం - ఈ రెండు శ్రీరామానుజుల కాలంలోనే రచింపబడిన ప్రబంధాలనే విషయం గుర్తించాలి.

**13.** సేవిత్వా వరద మనన్తదీర్ఘికాయాః
పావన్యా స్తటభువి యాదవప్రకాశమ్।
శిష్యాణాం నిశితధియాం గణైః పరీతం
నక్షత్రై శ్శశినమివ వ్యలోకయిత్సః॥

పరమపవిత్రమైన అనంతసరస్తీరంలో వేంచేసి ఉండే శ్రీవరదరాజస్వామిని సేవించిన తరువాత శ్రీయామునులు, కుశాగ్రబుద్ధులైన తన శిష్యులతో పాటు వరదుని సేవించాలని వచ్చే యాదవప్రకాశుని, నక్షత్రాల మధ్య చంద్రుని వలె, చూచారు.

**14.** తం పార్శ్వస్ఫురిత మముష్య శిష్యమధ్యే
నిర్దిష్టం కరసముదఞ్చనాత్ స్వశిష్యైః ।



దృష్ట్వాసౌ మహిమనిధిం కదా మమాన్తే-
వాసీ స్యాదితి సదయాలు రాలులోకే ॥

అపుడు యామునులు, తమ శిష్యులు చేతిని చాచి చూపించిగా, యాదవప్రకాశుని శిష్యుల మధ్యలో నడచి వస్తున్న శ్రీరామానుజులను చూచారు. చూచి ఈ మహిమనిధి నా శిష్యుడెపుడు కాగలడోకదా!- అని ఆ దయాళువు అయిన యామునులు కటాక్షించారు.

ఈ సందర్భంలో ప్రపన్నామృతం, గురుపరంపరాప్రభావం శ్రీరామానుజుల దివ్యమంగళవిగ్రహాన్ని వివరంగా వర్ణించాయి. ప్రపన్నామృతంలోని **"ఆయాంతం విప్రమధ్యే తు స్వహస్తేన సుశోభినా, సఖ్యుర్విప్రస్య బాలస్య హస్తం సంగృహ్య చాదరాత్, దీర్ఘబాహుం విశాలాక్షం నిమ్ననాభిం తనూదరమ్, కంబుకంఠం స్నిగ్ధకేశమ్, పూర్ణచంద్ర నిభాననమ్, విశాలవక్షం బింబోష్ఠ మున్నతాంసం జనప్రియమ్, సమ్యక్ ఫేనసంకాశ వస్త్రద్వయవిరాజితమ్, సువర్ణకటి సూత్రేణ శోభమానం సుశోభినా, నవరత్న వికీర్ణాభ్యాం కుండలాభ్యా మలంకృతమ్, బిసతంతు నిభైః శుభ్రైః బ్రహ్మసూత్రై ర్విరాజితమ్, ఛిద్రోర్ధ్వపుండ్రసంయుక్త లలాటేనాతిశోభితమ్, తమవేహి యతిశ్రేష్ఠరామానుజ మకల్మషమ్"** (యామునార్యా ! మధురమందహాసాన్ని కల, ఆ బ్రాహ్మణుల మధ్యలో ఉండే శ్రీరామానుజులను చూడండి. తమ చేతిలో ప్రీతిగా తమ స్నేహితుడైన ఒక బ్రాహ్మణబాలుని చేతిని ఊతగా గ్రహించి వచ్చేవారు, ఆజానుబాహువు, విశాలమైన నేత్రాలను కలవారు, లోతైన నాభిని, సన్నని నడుమును కలవారు, శంఖంవంటి కంఠాన్ని, దట్టమైన నల్లగా మెఱిసే కేశాలను, పూర్ణచంద్రునివంటి ముఖాన్ని, విశాలమైన వక్షస్సును, ఎఱ్ఱని దొండపండువంటి పెదవులను, ఎత్తైన మూపురాలను కలవారు, సర్వజనాభిరాములు, చక్కగా విభజించబడిన అంగసంపదను కలవారు, మనస్సును ఆకట్టుకొనే కాంతితో మంచి లక్షణాలతో కూడినవారు, పాలసముద్రంలోని నురుగువంటి తెల్లని వస్త్రద్వయాన్ని ధరించినవారు, మిక్కిలి అందమైన బంగారు మొలనూలును, నవరత్నాలు పొదిగిన

కుండలాలను కలవారు, తామరతూడులవంటి తెల్లని యజ్ఞోపవీతాలను కలవారు, చక్కగా విభక్తమైన ఊర్ధ్వపుండ్రాలతో ప్రకాశించే ఫాలాన్ని కలవారు అయినవీరు. రామానుజులని గ్రహించండి) అనే ఈ శ్లోకాలు గమనించ దగినవి. గురుపరంపరాప్రభావంలో మాత్రం తిరుక్కచ్చినంబి అపుడు శ్రీరామానుజులను నిర్దేశిస్తూ యామునులకు చూపినట్లున్నది.

**15.** శ్రీరామానుజవిదుషానుగచ్ఛతా తం
వ్యాహర్తుం కిమపి దురాసదావకాశః ।
ఆలోకై శ్చిర మనుగృహ్య తం దయార్ద్రైః
శ్రీరఙ్గం నగర మసా వియాయ భూయః ॥

యాదవప్రకాశుని అనుసరిస్తూ వెళ్ళే శ్రీరామానుజులతో సంభాషించే అవకాశం ఏమీ యామునులకు లభించలేదు. అందువల్ల శ్రీయామునులు శ్రీరామానుజులను తమ దివ్యకటాక్షాలతో "ఆముదల్వన్ ఇవన్" అని చిరకాలం అనుగ్రహించి, శ్రీరంగనగరాన్ని చేరారు.

ఈసందర్భంలో యామునులు శ్రీరామానుజులు శ్రీవైష్ణవసిద్ధాంత నిర్వాహకులు అయేటట్లు అనుగ్రహించమని వరదరాజస్వామిని ఉద్దేశించి **"యస్య ప్రసాదకలయా బధిరః శ్రుణోతి పంగుః ప్రధావతి జవేన చ వక్తి మూకః, అంధః ప్రపశ్యతి సుతం లభతే చ వంధ్యా తం దేవదేవ మనిశం శరణం గతోస్మి"** (ఏ వరదరాజ స్వామియొక్క అల్పమైన అనుగ్రహంతో చెవిటివాడు వినగలడో, కుంటివాడు వేగంగా పరిగెత్తగలడో, మూగవాడు మాటలాడగలడో, గుడ్డివాడు చూడగలడో, గొడ్రాలు పుత్రుని పొంద గలదో, అటువంటి దేవదేవుని నిత్యం శరణు పొందుతున్నాను) అని అంటూ శరణాగతి చేసినట్లు యతిరాజవైభవం, గురుపరంపరాప్రభావం, ప్రపన్నామృతం మొదలైన గ్రంథాలలో ఉన్నది.

రామానుజవైభవమనే ద్రావిడ కావ్యంలో - **"తేనమర్ కమలక్కణ్ణాల్ తిరున్దుఅ నోక్కి ఇన్ద, మానుపావన్ తాన్ వన్దెమ్ మతత్తినిల్ ఉఱువానాకిల్,**



**పోన కాలత్తిల్ మాఅన్ పొరువెన ఉలకై ఎల్లామ్, ఊనమిల్ ఇన్బ వీట్టిల్ ఉఱుమ్బడి పణ్ణుమ్ ఎన్న.** (తేనె నిండిన తామరపూలవంటి నేత్రాలతో చక్కగా కటాక్షించి, ఈ మహానుభావుడు వచ్చి మన మతంలో చేరినట్లయితే- పూర్వ కాలంలో నమ్మాళ్వార్లకు సమానంగా లోకాన్ని అంతటిని ఆనంద మయమైన పరమపదాన్ని పొందేటట్లు చేయడానికి వీలవుతుంది), **"శిన్దనై శెయ్దు నిన్టు తిరుమకళ్కోనే! యిన్ద, అన్దమిల్ కుణత్తినానై అడియనేన్ తనక్కు ప్పిన్బిఙ్గు, ఎన్దై! నిన్ తరిశనత్తుక్కతిపనా యిరుత్తి మణ్ణోర్, పన్దమామ్ పిఅవి నీఙ్గి ప్పరకతి అడైయుమ్ వణ్ణమ్".** (బాగా లోతుగా ఆలోచించి, ఓ శ్రియఃపతీ! తండ్రీ! ఈ అంతు లేని గుణాలను కల శ్రీరామానుజులను నా తరువాత ఈ లోకంలో మీ శ్రీవైష్ణవదర్శనానికి నాయకులుగా చేసి ఈ భూలోకవాసులు సంసారబంధాన్ని పోగొట్టుకొని పరగతిని పొందే రీతిలో చేయండి) అని యామునులు చేసిన ప్రార్థన వర్ణింపబడింది.

శ్రీయామునులు క్రీ.శ.1035వ సంవత్సరంలో శ్రీరామానుజులను కటాక్షించారని చారిత్రకాభిప్రాయం.

**16.** శ్రీరామానుజముఖశిష్యవర్గసేవ్యే
వ్యాఖ్యానం విదధతి యాదవప్రకాశే ।
తద్రాజ్యాధిపతనయ స్తదా బభూవ
బ్రాహ్మేణ ప్రతిభయరక్షసా గృహీతః ॥

ఈ విధంగా శ్రీరామానుజులు మొదలైన శిష్యులచేత సేవింపబడే యాదవప్రకాశుడు వేదాంతవాక్యవివరణను తన శైలిలో కొనసాగించాడు. అపుడు, ఆ చోళదేశాన్ని పాలించే ప్రభువుకుమారుడు భయంకరమైన ఒక బ్రహ్మరక్షస్సుచే పట్టుకొనబడి బాధపడ్డాడు.

యతిరాజవైభవంలో కూడా "తద్దేశభూపస్య సుతే పిశాచగ్రస్తే" అని రాజకుమారునకే పిశాచం ఆవహించినట్లున్నది. కాని, ప్రపన్నామృతంలో, గురుపరంపరాప్రభావం, ఆచార్యసూక్తి ముక్తావళివంటి గ్రంథాలలో మాత్రం

రాజకుమార్తెను బ్రహ్మరక్షస్సు పట్టుకొన్నట్లున్నది. "**తత స్తద్దేశపాలస్య పుత్రీం రక్షోగ్రహీత్ మహత్**" అని ప్రపన్నామృతంలో, "**అన్దరాజ్యత్తిల్ రాజావిన్ పెణ్పిళ్ళైయై బ్రహ్మరక్షస్సు పిడిక్క**" అని గురుపరంపరాప్రభావంలో చెప్పబడింది.

**17.** **ఉద్దామగ్రహమదనిగ్రహం విధాతుం**
**నిష్ణాతం నిరుపమమన్త్రవాదశౌణ్డమ్ ।**
**శ్రుత్వోర్వీపతి రథ యాదవప్రకాశం**
**శిష్యాణాం పరివృత మాహ్వయత్సమూహైః ॥**

ప్రభువు ఈవార్తను విని, యాదవప్రకాశుడు, ఎటువంటి గొప్ప పిశాచాన్ని అయిన వదలగొట్టడంలో సమర్థుడు, సాటి లేని గొప్ప మంత్రాలను ప్రయోగించడంలో దిట్ట అని తెలిసి, అతనిని అతని శిష్యులతోపాటు పిశాచాన్ని వదలగొట్టడంకోసం ఆహ్వానించాడు.

**18.** **రక్షో యద్ గ్లపయతి మామకాత్మజం తత్**
**విక్షోభం నయ నిరపాయమన్త్రశక్త్యా ।**
**ఇత్యుక్త్వా నిజతనయస్య సంనిధానం**
**మేదిన్యాః పతి రనయద్యతిం క్షణేన ॥**

"ఒక బ్రహ్మరక్షస్సు నా పుత్రుని పట్టి భయపెడుతున్నది. మీరు మీ అమోఘమైన మంత్రశక్తితో మా కుమారునకు కల్గిన బాధను తీర్చాలి" అని చోళప్రభువు శిష్యగణసహితుడై వచ్చిన యాదవుని తన కుమారుని వద్దకు వేగంగా తీసికొనిపోయాడు.

**19.** **ఆలోక్య ప్రతిభయరక్షసా పురస్తా-**
**దావిష్టం ధరణిపురన్దరస్య సూనుమ్ ।**
**ఉద్దామం జపతి మనుం యతావవాదీత్**
**సక్రోధం చరణ మశఙ్కితః ప్రసార్య ॥**



అపుడు యాదవప్రకాశుడు, తన ముందున్న, పిశాచం ఆవహించిన రాజకుమారుని చూచాడు. ఒక గొప్పదైన ఒక మంత్రాన్ని అతడు నివారణోపాయంగా జపించాడు. అపుడు ఆ బ్రహ్మరక్షస్సు ఏమాత్రం శంకించకుండా తన కాలును ముందుకు చాచి యాదవుని అవమానిస్తూ కోపంతో ఈ విధంగా పల్కింది.

**20.** **జానేహం మనుపదవైభవం త్వదీయం**
**ప్రాచీనం జనురపి జన్మ మామకఞ్చ ।**
**తేషు త్వం కిమపి న వేత్సి కిన్తు శాన్తం**
**పాపం మాం కథమివ శిక్షితుం సమాగాః ॥**

ఓ బ్రాహ్మణా! నీవు ప్రయోగించే మంత్రంయొక్క ప్రభావం ఎంత గొప్పదో నాకు బాగా తెలుసు. నీవు పూర్వజన్మలో ఎవడవో కూడా, నాకు బాగా తెలుసు. కాని, వీనిని ఏమీ నీవు తెలియవు. పాపం శమించుగాక! ఇటువంటి నీవు నన్ను నిగ్రహించాలని ఏవిధంగా వచ్చావు?

**21.** **ఇత్యేవం స గదితవజ్జగాద రక్షః**
**కిం వై తన్మనుపద మాదృతం మమాద్య ।**
**కో వా హం గతజననే తవాపి కాభూ-**
**దుత్పత్తి స్త్వమసి యతోఖిలం వదేతి ॥**

యాదవుడపుడు బ్రహ్మరక్షస్సుతో "నేను ప్రయోగించిన మంత్రం ఏది? గత జన్మలో నేనెవడను? నీవెవరవు? దీనిని అంతటిని తెలియజెప్పు" అని అన్నాడు.

**22.** **రక్ష స్తం యతి మభణీదితి బ్రువాణం**
**భావత్కం మనుపద మీదృశం పునస్త్వమ్ ।**
**ప్రాగ్జన్మన్యసి మధురాన్తకాగ్రహారా-**
**మ్బ్యాధారోన్నతతటవామలూరుగోధా ॥**

అపుడు బ్రహ్మరక్షస్సు- "బ్రాహ్మణా ! నీవు ప్రయోగించిన మంత్రం ఇది. నీవు గడచిన జన్మలో మధురాంతక మనే అగ్రహారంలోని తటాకం గట్టుపై ఉండే పుట్టలో నివసించే ఒక ఉడుమువు.

**"నిహాకా గోధికాసమే"** అని అమరం. అంటే - నీటి ప్రాంతంలో నివసించే ఉడుము.

**23.** శేషాద్రిప్రవరమహాయ గచ్ఛతాం త్వం
తత్రాటన్ పథి హరిధామ వైష్ణవానామ్ ।
యద్భుక్తోజ్ఝిత శుచిభక్తలేశమాదా-
స్త్వం తస్మాదిహ తను మీదృశీ మయాసీః ॥

తిరుమలలో వేంచేసి ఉండే స్వామికి జరిగే ఉత్సవాలను సేవించడం కోసం వెళ్ళే శ్రీవైష్ణవులు దారిలో మధురాంతక క్షేత్రంలో విడిది చేశారు. అపుడు వారు భుజించగా మిగిలిన ప్రసాదంలోని కొద్ది భాగాన్ని నీవు తిన్నావు. పరమపవిత్రమైన ఆ ప్రసాదాన్ని స్వీకరించిన కారణంగా నీవు ఈ ఉత్తమమైన రూపాన్ని ఈ జన్మలో పొందావు.

**24.** పూర్వస్మి న్నహమపి జన్మని ద్విజాతిః
ప్రారబ్ధం క్రతువర మృత్విజాం గణేన ।
తత్రత్యై రజనిషి మన్త్రకర్మలోపై-
ర్బ్రాహ్మస్యాకృతి మిహ రక్షసః ప్రపన్నః ॥

నేను, పూర్వజన్మలో బ్రాహ్మణవంశంలో పుట్టాను. అపుడు నేనొక గొప్ప యజ్ఞాన్ని ఋత్విక్కులతో ప్రారంభించాను. ఆ యజ్ఞంలో జరిగిన మంత్రకర్మలో పొలవల్ల నేనీ బ్రహ్మరక్షస్సు రూపాన్ని పొందాను.

**25.** త్రస్తోహం తవ సవిధోషితాదముష్మా-
చ్ఛేషాంశా జ్జన మవితుం కృతావతారాత్ ।
భూభర్తు స్త్యజ సుత మిత్యసౌ వదేచ్చేత్
రక్షస్త్వం తమపి హఠాదహం త్యజేయమ్ ॥



ఆదిశేషుని అంశతో జన్మించినవారు, నీవద్ద ఇపుడున్నవారైన శ్రీరామానుజులకు నేను భయపడుతున్నాను. "రాజకుమారుని నీవు విడచి వెళ్ళిపో"- అని ఈయన పల్కితే, నేనపుడు వెంటనే ఈ రాజకుమారుని వీడి వెళ్ళిపోతాను.

**26.** ఆలోకై రమృతమయై రివానుబద్ధం
దుష్కర్మాఖిలమపి దూరితం మదీయమ్ ।
ముక్తి శ్చాభవదితి పాదపద్మయో స్తం
ప్రాణంసీత్ప్రకటితభక్తి యాతు తస్య ॥

ఈ రామానుజుల అమృతంవంటి కటాక్షాలవల్ల నా పాపం అంతా తొలగిపోయింది. ఈ బ్రహ్మరక్షస్సు రూపంనుండి నాకు మోక్షం లభించింది"- అని పల్కుతూ ఆ బ్రహ్మరక్షస్సు శ్రీరామానుజుల శ్రీచరణపద్మాలలో మిక్కిలి భక్తితో నమస్కరించింది.

**27.** తద్యాతు క్షితిపతినన్దనం విముచ్య
త్వద్యాతు ద్రుత మధునా నియోగ మాప్త్వా ।
సన్దిష్ట స్స చ యతినేతి వీక్ష్య రక్ష-
స్సన్తుష్టో మధుమధురా మువాచ వాచమ్ ॥

అపుడు యాదవప్రకాశుడు. శ్రీరామానుజులతో - "రాజకుమారుని విడచిపో"అని బ్రహ్మరక్షస్సును ఆజ్ఞాపించు. నీ ఆజ్ఞవల్ల ఈ రక్షస్సు త్వరగా విడచివెళ్ళిపోతుంది" అని అన్నాడు. శ్రీరామానుజులు మిక్కిలి సంతుష్టులై, బ్రహ్మరక్షస్సును చూచి తేనెవంటి తీయని పల్కులను ఈవిధంగా అన్నారు.

ఈ శ్లోకంనుండి 31వ శ్లోకంవరకు ప్రతిశ్లోకంలోని పూర్వార్ధపాదాలలో, ఉత్తరార్ధపాదాలలో శ్రుతిసుభగమైన ప్రాస అమరిఉండడం గమనించవచ్చు. **"తద్యాతు-త్వద్యాతు, జానే-క్ష్మనే, నిర్యాతే- మర్యాదా"** ఇత్యాది ప్రాసక్రమం గమనించదగినది.

**28. జానే త్వాం మమ వశగం ముదా యథేష్టం**
**క్ష్మానేతు స్సుత మపహాయ యాహి ।**
**తచ్చిహ్నం నిజపదపిప్పలద్రుభేదాత్**
**హృచ్చిన్తా మపనయ భూపతేః ప్రకాశ్య ॥**

నీవు నా వశంలో ఉన్నావని తెలుసు. నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. నీవు ఈరాజకుమారుని విడచిపెట్టి, నీకిష్టమైన చోటుకు వెళ్ళు. నీవు వెళ్ళినదానికి గుర్తుగా నీవు ఇంతకాలం నివసిస్తున్న ఈ పిప్పలవృక్షాన్ని (రావిచెట్టును) విరుగగొట్టి వెళ్ళు. ఈ గుర్తును చూచి ప్రభువునకు అతని మనస్సులో ఉండే దుఃఖం తొలగిపోతుంది".

**29. ఇత్యాజ్ఞాం ప్రసభ మముష్య యాతు లబ్ధ్వా**
**తత్యాజ క్షితిజసుతం సహాత్మదోషైః ।**
**అశ్వత్థం సహ వృపవిప్రియై రభాజ్క్షీ-**
**ద్విశ్వస్త స్సహ యతినా నృపోపి తస్మిన్ ॥**

ఈ విధంగానే శ్రీరామానుజులు చేసిన ఆజ్ఞను బ్రహ్మరక్షస్సు పొంది వెంటనే తన పాపాలతోపాటు రాజకుమారుని కూడా విడచిపెట్టింది. వెళ్ళిపోతూ తాను నివసించే అశ్వత్థవృక్షాన్ని పడగొట్టింది. ఈ గుర్తును చూచి యాదవునితో పాటు ప్రభువుకూడా బ్రహ్మరక్షస్సు తన కుమారుని విడచి వెళ్ళిపోయిందని నమ్మాడు.

**30. నిర్యాతే నిజతనయాద్గ్రహే నృపాలో**
**మర్యాదాధిక మధిరూఢవాన్ ప్రమోదమ్ ।**
**పర్యాయోరగపతయే పరం సపర్యాం**
**పర్యాయాకృత విదుషాం ద్విషాం(యతేః) పురస్తాత్ ॥**

తన కుమారుని బ్రహ్మరక్షస్సు విడచివెళ్ళగానే, ప్రభువు అంతులేని ఆనందాన్ని పొందాడు. ఆదిశేషస్వరూపులైన శ్రీరామానుజులకు పండితుల, యాదవుని సమక్షంలో అతడు సపర్యను చేశాడు.



"పర్యాయోరగపతి" - అంటే ఆదిశేషుల వేరొక అవతారమని అర్థం.

**31. ఉద్దామం నరపతినార్హణం వితీర్ణం**
**తద్దాన్తో నిజగురవే సమర్ప్య భక్త్యా ।**
**శ్రీకాఞ్చీం సహ గురుణా వివేశ భూయః**
**స్సాకాంక్షే మనసి దధత్సదేవరాజమ్ ॥**

ప్రభువు తనకుచేసిన గొప్ప సత్కారాన్ని ఇంద్రియ నిగ్రహాన్ని కల్గిన శ్రీరామానుజులు తమ గురువైన యాదవప్రకాశునకు సమర్పించారు. గురువుతో పాటు కంచికి చేరి మళ్ళీ వరదరాజస్వామి పట్ల మనస్సును లగ్నం చేశారు.

ప్రభువు ఇచ్చిన గొప్ప కానుకల పట్ల ఏమాత్రం లాభంలేకుండా వానిని తన గురువుకు రామానుజులు సమర్పించడం వారి దాంతత్వ స్వభావాన్ని తెల్పుతుంది. "దామ్యతి ఇంద్రియేభ్య ఇతి దాంతః, దము- ఉపశమే" అని ఈ శబ్ద వ్యుత్పత్తి.

**32. అభ్యఙ్గం విరచయతో గురౌ విరుద్ధం**
**వ్యాఖ్యాతి శ్రుతిశిఖరైకవాక్యతత్త్వమ్ ।**
**శ్రీరామానుజవిదుషో రుషా కదుష్ణం**
**ప్రాప్తం తన్నయనపయ స్తదా తదూర్వోః ॥**

ఒకనాడు శ్రీరామానుజులు తమ గురువైన యాదవప్రకాశునకు అభ్యంగాన్ని చేయించేటపుడు, యాదవుడు ఛాందోగ్యంలోని "కప్యాస" శ్రుతికి అపార్థాన్ని చెప్పాడు. ఆ అపార్థాన్ని విని శ్రీరామానుజుల మనస్సులో చాలా విచారం కల్గినందున అపుడు వారి కంటినుండి పుట్టిన వేడిదుఃఖాశ్రువులు యాదవుని తొడలపై చిందాయి.

శ్రీరామానుజవైభవంలో అయితే ముడుచుకొన్న వేళ్ళ ప్రస్తావం కన్పించలేదు. "దోష్ణం కదుష్ణం మందోష్ణమ్" అని నిఘంటువు గోరువెచ్చని- అని అర్థం.

33. దగ్ధోరు ర్నయనపయఃకణై స్తదీయైః
క్రోధాన్ధో యతి రవదత్స లక్ష్మణార్యమ్ ।
పాఠ్యోద్య ప్రభృతి మయా ప్రతీప మా భూత్ -
గచ్ఛ త్వం మమ నయనాధ్వనో యథేచ్ఛమ్ ॥

ఆ వేడి కన్నీటి బిందువులచే దహింపబడ్డ యాదవప్రకాశుడు క్రోధాంధుడై, శ్రీరామానుజులను చూచి "ఈనాటినుండి నాదగ్గర నీవు విద్యాభ్యాసాన్ని చేయనక్కరలేదు. నాకంటిముందునుండి నీకిష్టమైన చోటుకు వెళ్ళిపో" అని ఆజ్ఞాపించాడు.

గురుపరంపరాప్రభావంలో- బ్రహ్మరక్షస్సు విమోచన వృత్తాంతానికి ముందే శ్రీయాదవప్రకాశుడు శ్రీరామానుజులను మోసగించి తనతో గంగానదికి తీసికొని పోయి, మణికర్ణికా ఘట్టంలో ముంచి చంపాలని యత్నించడం, తమ పినతల్లి కుమారులైన గోవిందభట్టర్ ఈ దురాలోచనను దారిలో పసిగట్టి శ్రీరామానుజులకు తెలియజేయగా, శ్రీరామానుజులు తప్పించుకొని, వ్యాధ దంపతుల రూపంలో వచ్చిన శ్రీపెరుందేవి వరదరాజ స్వామి అనుగ్రహంతో కంచి చేరడం - వర్ణింపబడింది. ప్రపన్నామృతంలో మాత్రం ఈ సందర్భం బ్రహ్మరక్షస్సును విడిపించిన తర్వాత జరిగినట్లు కన్పిస్తున్నది. యతిరాజవైభవంలో కూడా ఆవిధంగానే తెలుపబడింది. దివ్యసూరి చరితంలో ఈ సందర్భప్రస్తావన నామమాత్రంగా కూడా లేదు.

34. ఇత్యుక్తో గురు మపహాయ ముక్తపాఠః
శ్రీకాఞ్చ్యాం కృతవసతి స్సమం గృహిణ్యా ।
కైఙ్కర్యం ప్రతిదిన మాతనోత్సశాలా-
కూపామ్భో దదదిభశైలవల్లభాయ ॥

ఈ విధంగా పల్కిన గురువు యాదవప్రకాశునివద్ద శాస్త్రపాఠాన్ని మాని, శ్రీరామానుజులు తమ ధర్మపత్నితో కలసి కంచిలో నివాస మేర్పరచుకొన్నారు. ప్రతిదినం శ్రీవరదరాజస్వామికి "శాలక్కిణఱు"- అనే బావినుండి స్వామి ఆరాధనకు ఆవశ్యకమైన తీర్థాన్ని సమర్పించే కైంకర్యాన్ని చేయసాగారు.



35. శ్రుత్యన్తోదిత మభిధేయ మన్యథాస్మా-
దాఖ్యాతు ర్విధుమివ రాహుతో విముక్తమ్ ।
తం కర్తుం స్వమతరతం స యామునేయః
ప్రాహైషీత్స నుతిమణిం మహార్హపూర్ణమ్ ॥

వేదాంతవాక్యాల అర్థాన్ని విపరీతంగా వ్యాఖ్యానించే ఈ యాదవ ప్రకాశులను వదలిపెట్టిన శ్రీరామానుజులు రాహువునుండి ముక్తులైన చంద్రునివంటివారయ్యారు. వారిని తమ మతమైన విశిష్టాద్వైతం పట్ల ఆసక్తులయేటట్లు చేయడంకోసం శ్రీయామునులు తాము రచించిన స్తోత్రరత్నాన్ని మహాపూర్ణులతో పాటు కంచికి పంపించారు.

ఈ సంఘటన క్రీ.శ.1041వ సంవత్సరంలో జరిగిందని చారిత్రకుల భావన.

36. కాఞ్చీం స ద్రుత మభిగమ్య తిష్ఠమానః
కూపామ్భోహరణపరాయణాయ తస్మై ।
స్వచ్ఛన్దం శ్రుతిమణిజం పపాఠ విష్ణో -
రుత్కర్షప్రకటనకారి పద్య మేకమ్ ॥

ఆ మహాపూర్ణులు (పెరియనంబి) కంచికి చేరి, శాలక్కిణఱు నుండి ఆరాధనతీర్థాన్ని చేసికొని వచ్చే శ్రీరామానుజులకు వినిపించేటట్లు విష్ణుపరత్వాన్ని ప్రకటించే "స్వాభావికానవధికాతిశయే శితృత్వమ్" ఇత్యాది స్తోత్రరత్నశ్లోకాన్ని పఠించారు.

37. శ్రుత్వా తత్ప్రకటితమాధవాపదానం
సానన్దం త మచకథత్ప్రుథుం స పూర్ణమ్ ।

యేనేదం శ్రుతిమధురం వ్యధాయి పద్యం
క్వన్వాస్తే స గురు రముం పునర్దిదృక్షే ॥

మాధవుని వైభవాన్ని ప్రకటించే ఆ శ్లోకాన్ని మహాపూర్ణులవల్ల ఆలకించి శ్రీరామానుజులు వారితో ఈ విధంగా అన్నారు. "శ్రుతిమధురమైన ఈ శ్లోకాన్ని ఎవరు రచించారు? దీనిని రచించిన ఆ ఆచార్యులను సేవించాలని నాకు ఉన్నది".

38. పద్యం తాదృశ మిద మాహ యామునేయో
యోగీన్ద్ర ర్వసతి పున స్స రఙ్గధామ్ని ।
సత్యం తే సులభ ఇతి ప్రణీయ పూర్ణః
తేనాగాత్సహ సహసా కదమ్బతీర్థమ్ ॥

అపుడు మహాపూర్ణులు - "ఈ సరసమైన పద్యాన్ని శ్రీయామునులు రచించారు. ఆ యోగీంద్రులు శ్రీరంగంలో నివసిస్తారు. మీరు కోరితే వారిని కలువవచ్చు" అని శ్రీరామానుజులతో అన్నారు. ఈ విధంగా పల్కి మహాపూర్ణులు శ్రీరామానుజులను తమ వెంట తీసికొని శ్రీరంగంలోని కావేరీనదీ తీరాన్ని వేగంగా చేరారు.

శ్రీరామానుజులు యామునులను చూడడం కోసం శ్రీరంగానికి క్రీ.శ.1042వ సంవత్సరంలో వెళ్ళారు.

39. శ్రీరఙ్గాత్కనకసరిత్తటే చలన్తౌ
శ్రీరఙ్గే కలకలశబ్దతో విదిత్వా ।
వైకుణ్ఠం గత ఇతి యామునేయయోగీ
మూర్ఛాలౌ హృది భిదురాహతా వివాస్తామ్ ॥

వారిద్దరు శ్రీరంగంలోని చేరి కావేరీనదీ తీరాన్ని చేరే సమయానికి శ్రీరంగంలో గొప్ప కోలాహలాన్ని విన్నారు. "యామునాచార్యులవారు



వైకుంఠాన్ని చేరారు" - అని విని వారికి మనస్సులో మోహం కల్గింది. హృదయంలో వజ్రపుదెబ్బ తగిలిన వారివలె అయ్యారు.

**"కులిశం భిదురం పవిః"** అనే నిఘంటువు వల్ల భిదురమంటే వజ్రాయుధం.

40. ఉద్బుద్ధః కథమపి తం మహార్ణపూర్ణో
నిన్దన్తం నియతిగతిం ప్రబుద్ధ మేత్య ।
కావేరీతటలవణావటోపకణ్ఠం
యోగీన్ద్రో రనఘ మసేవయత్ప్రతీకమ్ ॥

కొంచెంసేపటికి ఏదో విధంగా తేరుకొని మహాపూర్ణులు విధిగతిని నిందించేవారు, తెలివిని పొందినవారైన శ్రీరామానుజులకు కావేరీనదీ తీరంలో ఒక ఇసుక ప్రదేశంలో ఆ యామునుల పవిత్రమైన చరమ శరీరాన్ని దర్శింపజేశారు.

అవటమంటే భూమిలో చేయబడిన లోతైన గోయి. ఇక్కడ ప్రతీకమంటే- చరమదేహం. **"అనఘమ్ ప్రతీకమ్"** అని అనడం- మహాభక్తుల శరీరాన్ని భగవంతుడు పరమపవిత్రమైన స్థానంగా భావించి నెలకొని ఉండడాన్ని సూచిస్తుంది. **"సంధాయాం సందధే బ్రహ్మణైషః నైనం జహాత్యహస్సు పూర్వేషు"** అని అంటూ వేదంకూడా భక్తశరీరాన్ని భగవానుడు విడువడని అన్నది. **"తిరుమాల్ వైకున్దమే తణ్తిరువేఙ్గడమే ఎనదుడలే"** (వైకుంఠం, చల్లని వేంకటాచలం, నా శరీరం) అని నమ్మాళ్వార్లు స్వయంగా తమ శరీరాన్ని భగవంతుడు ఆదరించి తన నివాసంగా పరిగ్రహించాడని అన్నారు. తిరువాయ్‌మొళి ప్రబంధంలో నమ్మాళ్వార్లు **"ఇవైయు మవైయుమ్"** అనే (1-9) దశకంలో తమ ఒక్కొక్క దివ్యాంగంలోను స్వామి ఆదరంతో వేంచేసి ఉండే వైనాన్ని కీర్తించారు. ప్రతిజీవునిలో భగవంతుడు అంతర్యామిగా ఉండే స్థితికంటే ఇది విలక్షణమైనది. దివ్యమంగళవిగ్రహంతో, సకల పరివారసహితుడై **"అరవత్తమళియ నోడుమ్ అళ్గకియ పాఱ్కడ**

**లోడుమ్"** (ఆదిశేషుడనే పాన్పుతో, అందమైన క్షీరాబ్ధితో... స్వామి నా హృదయంలో ప్రవేశించాడు) ఇత్యాదిగా పెరియాళ్వార్లు పల్కిన రీతిలో వేంచేసి ఉండే విశిష్టమైన సన్నివేశం ఇది.

**41. వ్యాకీర్ణప్రచలశిఖో విముక్తకణ్ఠం**
**వ్యాక్రోశన్ విస్మరబాష్పపూరితాక్షః ।**
**తత్క్షోణీతలలుఠనాతిధూసరాఙ్గో**
**విక్షోభాకులకరణో యతిం వ్యనంసీత్ ॥**

చెల్లాచెదరైన కేశపాశంతో, పెద్దగా గొంతెత్తి విలపిస్తూ, కళ్ళనుండి కారిన దుఃఖాశ్రువులు శరీరమంతా వ్యాపించగా శరీరమంతా ధూళిధూసరితం అయేటట్లుగా శ్రీరామానుజులు అక్కడ భూమిపై పడి దొర్లిదొర్లి, తమ అన్ని అంగాలలో బాధతో మిక్కిలి క్షోభను పొందినవారై, ఆయామునుల చరమశరీరానికి నమస్కరించారు.

ఎంతో ఆశతో శ్రీయామునులను దర్శించాలని వచ్చిన శ్రీరామానుజులకు శ్రీయామునుల వైకుంఠప్రాప్తి వార్త మిక్కిలి మనఃక్షోభను కల్గించింది. దానివల్ల వారి మనస్సులో, దేహంలో కల్గిన వికారాలను ఈ శ్లోకం కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తున్నది.

**42. శోకాంతే ధృతివిభవేస్య చక్షు రస్రం**
**వ్యారౌత్సీత్తను మతను ర్జహార కమ్పః ।**
**అతఙ్కో హృదయ మచూచరద్విజేతుః**
**భఙ్గే హ్యేదధతి పరాజితాః ప్రకర్షమ్॥**

శోకంవల్ల శ్రీరామానుజుల ధైర్యమంతా పోయింది. కన్నులనుండి శోకబాష్పాలు ధారగా స్రవించాయి. శరీరం అంతా మిక్కిలిగా వణకింది. భయం హృదయాన్ని అపహరించింది. ధైర్యభంగం కల్గినపుడు ఈ విధమైన వికారాలన్నీ కల్గుతాయి కదా.



**43. తత్త్వార్థం వితరితు మేష్యతేథ యస్మై**
**వ్యాఖ్యాజ్ఞా సమబధి యా కరేన్త్యకాలే ।**
**పాదాబ్జం శ్రితవతి తస్య లక్ష్మణార్యే**
**సా ముద్రా పరిముముచే స్వయం యతీన్ద్రోః ॥**

తమ వద్దకు రాబోయే శ్రీరామానుజులకు తత్త్వార్థాన్ని ఉపదేశించడం కోసం శ్రీయామునులు అంత్యకాలంలో తమ చేతిలో వ్యాఖ్యానముద్రను ధరించారు. ఎపుడైతే శ్రీరామానుజులు శ్రీయామునుల చరమశరీరాన్ని దర్శించారో, అపుడే వెంటనే ఆ వ్యాఖ్యానముద్ర ముడుచుకొని పోయింది. వారి వేళ్ళు యథాస్థానానికి వచ్చాయి.

ఇక్కడ ఈ శ్లోకంలో కన్పించే సన్నివేశానికి, మిగిలిన శ్రీరామానుజ చరిత్ర గ్రంథాలలో కన్పించే సన్నివేశానికి భేదం కన్పిస్తున్నది. యతిరాజ వైభవంలో **"రంగేశముఖ్యా అపి సూరయస్తే దృష్ట్వా మహాపూర్ణయుతాయ తస్మై, రామానుజార్యాయ నివేద్య శాంతాః శ్రీయామునార్యంగుళి ముద్రణం చ, తద్వ్యాససూత్రం వివరీకరిష్యే, తత్తాతనామాపి శఠారినామ, యుక్తం విధాస్యాముభయో రితీర్య రామానుజోవందత తత్పాదాబ్జే"** అని చరమదశలో శ్రీయామునుల మనస్సులో గల కొఱతలను సూచిస్తూ వారి చేతిలోని మూడు వేళ్ళు ముడుచుకోగా, శ్రీరామానుజులు తిరవరఙ్గప్పెరుమాళ్ అరైయర్ మొదలైనవారివల్ల ఈ విషయాన్ని తెలిసికొని, ఆ మూడు కొఱతలను తాము తప్పక తీర్చగలమని ప్రతిజ్ఞ చేశారని, అపుడే ఆ వేళ్ళు మూడు యథాస్థితిని పొందాయని తెలుపబడింది. గురుపరంపరాప్రభావంలో, ప్రపన్నామృతంలో కూడా ఈవిధమైన కథనమే కన్పిస్తుంది తప్ప, వ్యాఖ్యాముద్రతో శ్రీయామునుల చేతివేళ్ళు ముడుచుకొని ఉన్నట్లు కన్పించదు.

ఇక్కడ కవి ఈ రీతిలో పల్కడంలోని ఉద్దేశ్యాన్ని పరిశీలించినపుడు ఈవిధమైన సమాధానాన్ని చెప్పవచ్చునని తోస్తుంది. శ్రీరామానుజులు

తమను శ్రీయామునులకు, ద్రోణునకు ఏకలవ్యునివలె, శిష్యులుగా భావించేవారని ప్రసిద్ధి. తిరుమాలై యాణ్డాన్ శ్రీరామానుజులకు తిరువాయ్మొழி ప్రబంధార్థాలను సందర్భంలో, శ్రీరామానుజులు కొన్ని అపూర్వార్థాలను వ్యక్తం చేయగా, "ఇది విశ్వామిత్రసృష్టి, ఈ అర్థాలను నేను యామునుల వద్ద వినలేదు" అని ఆణ్డాన్ కోపించారని, అపుడు తిరుక్కోట్టియూర్నంబి ఈ సంగతిని విని, "శ్రీయామునుల హృదయంలో లేని ఏదీ శ్రీరామానుజులకు స్ఫురించదని, శ్రీరామానుజులు పలికే అర్థాలన్నీ యామునులకు సమ్మతాలే అని, వానిని తాము గతంలో యామునులవద్ద విన్నా"మని అన్నారని కూడా ప్రసిద్ధి. ఈ విధంగా శ్రీయామునులు చరమ కాలంలో తాము ప్రదర్శించిన వ్యాఖ్యాన ముద్రద్వారా, తమ హృదయంలోని అర్థాలను అన్నిటిని శ్రీరామానుజుల హృదయంలో ప్రవేశింపజేసిన విషయాన్ని సూచించారనే భావనతో కవి ఈ విధంగా పల్కి ఉండవచ్చు. దీనికి ఉపోద్బలకంగా తరువాత శ్లోకంలోని **"తత్త్వార్థం నిధి మివ లబ్ధమాశు తస్మాత్"** అనే ప్రయోగాన్ని స్మరించవచ్చు. కాని, చరిత్రలో మాత్రం యామునుల చరమదేహం ఈ విధమైన వ్యాఖ్యాన ముద్రను కల్గి ఉన్నట్లు ప్రసిద్ధి లేదు. రామానుజ వైభవంలో యామునులు వేళ్ళు ముడిచిన విషయం ప్రస్తావింపబడలేదు.

**44.** శోకాగ్నిప్రవరవిలీనచిత్తలాక్షా -
పిణ్డేసౌ యతితిలకస్య పుణ్య మఙ్గమ్ ।
తత్త్వార్థం నిధిమివ లబ్ధమాశు తస్మాత్
తత్రాసాత్సుదృఢ మముద్రయన్మనీషీ ॥

శోకాగ్ని ప్రసరించినందున బాగా మెత్తబడి కరగిన లక్కవంటి తమ చిత్తంలో బుద్ధిమంతులైన శ్రీరామానుజులు యతితిలకులైన యామునుల పుణ్యశరీరాన్ని, వారి వ్యాఖ్యానముద్రద్వారా లభించిన నిధివంటి తత్త్వార్థాలను, మళ్ళీ తిరిగి వానిని కోల్పోతామేమో!- అనే భయంవల్లనా ! అన్నట్లుగా, తమ హృదయంలో చాలా దృఢంగా ముద్రించుకొన్నారు.



**45.** తత్త్వార్థగ్రహణమహోయ జీవతోస్మా-
ద్రఙ్గేన్దు ర్మయి వితతాన న ప్రసాదమ్।
ఇత్యన్తస్స్ఫురితగురువ్యథో న నత్వా
రఙ్గేశం పునరగమ త్తత స్స కాఞ్చీమ్ ॥

"శ్రీయామునులవల్ల తత్త్వార్థాన్ని గ్రహించడమనే ఉత్సవానికి శ్రీరంగనాథుడు అనుగ్రహించలేదు" అనే మనస్సులో కల్గిన గొప్ప బాధవల్ల శ్రీరామానుజులు శ్రీరంగనాథుని సేవించకుండానే కాంచీనగరానికి తిరిగి వెళ్ళిపోయారు.

జీవించి ఉండగా ఆళవందార్ను తాము కలిసే అవకాశాన్ని శ్రీరంగ నాథుడు అనుగ్రహించలేదనే మనఃక్లేశంతో శ్రీరంగనాథుని దర్శించకుండానే కంచికి శ్రీరామానుజులు తిరిగి ప్రయాణమైన సందర్భాన్ని శ్రీరామానుజ వైభవం ఈవిధంగా తెల్పింది. శీరార్ అరఙ్గనకర్ క్కిడన్ద తిరుమాల్ శెయ్ద ఉపకారమ్, పోరాదో ఇన్దు ఎనక్కెన్న ప్పూవై వణ్ణన్ ఉడన్ వెఱుత్తఙ్గు, ఆరా అన్బర్ ఆళవన్దార్క్కు అడుత్త కన్మమ్ అమైత్తదప్పిన్, నేరార్ ఇళైయాழ்వార్ ఉడనే మీణ్డు కాఞ్జిక్కు ఏకినార్. (మహిమను నిండుగా కల శ్రీరంగనగరంలో శయనించి ఉండే శ్రీరంగనాథస్వామి ఇపుడు నాకు చేసిన ఉపకారం చాలదా? అని అంటూ అతసీసుమవర్ణుడైన శ్రీరంగనాథునిపట్ల కోపాన్ని పొంది, అక్కడ మహాభక్తులైన శ్రీఆళవందార్కు చేయవలసిన అంతిమ సంస్కారాలు ముగిసిన తరువాత ఋజుత్వాన్ని నిండుగా కల శ్రీరామానుజులు మళ్ళీ కంచికి వేంచేశారు.)

**46.** కాఞ్చీశార్చావనిరతః పురేవ కాఞ్చీ-
పూర్ణార్యం స వరదసూనృతోక్తిపాత్రమ్ ।
ఆచార్యం నిజ మచికీర్షదప్యవశ్యం
నో గణ్యో భవతి మహాత్మనాం కులాది ॥

పూర్వంవలె శ్రీరామానుజులు కంచిలోని వరదరాజస్వామి ఆరాధనలో నిమగ్నులయ్యారు. ఆ సమయంలో, వరదరాజస్వామితో సాక్షాత్తుగా సంభాషించే యోగ్యతను కలవారైన కాంచీపూర్ణులను తమకు ఆచార్యులు కాదగినవారుగా కోరారు. ఎందుకంటే, మహాత్ముల కులం మొదలైనవి ఏవీ పరిగణింపబడనక్కరలేదు. వారి జ్ఞానమే పరిగణనీయం.

"సూనృతః ప్రియే సత్యే" అనే అమరకోశవచనం ప్రకారం ఇక్కడ సూనృతశబ్దానికి ప్రియమని అర్థం. కాంచీపూర్ణులు వరదరాజస్వామి ప్రియంగా మాట్లాడే మాటలకు పాత్రమైనవారు - అర్థం.

**47.** పూర్ణో యద్యపి వరదానుకమ్పయాహం
నో యుక్తం ద్విజవర! లౌకికక్రమస్య ।
ఇత్యుక్త్వా ప్రణతిపరం స తం న్యరౌత్సీత్
నోచ్ఛ్రాయం ప్రథయతి సజ్జన స్స్వకీయమ్ ॥

శ్రీకాంచీపూర్ణులు శ్రీరామానుజుల అభిప్రాయాన్ని విని, "ద్విజోత్తమా! నా విషయంలో వరదరాజస్వామి అనుగ్రహం పూర్ణం ఉన్నప్పటికీ, లౌకిక క్రమాన్నిబట్టి ఇది తగదు" అని పల్కి శ్రీరామానుజుల మాటను మృదువుగా తిరస్కరించారు. సజ్జనులెపుడూ తమ ఔన్నత్యాన్ని వ్యక్తం చేయరు.

**48.** యద్యేవం సుమతిధురీణ! కేచిదర్థాః
చిన్త్యన్తే మనసి మయాద్య తాన్నివేద్య ।
శ్రీకాఞ్చీపతివరదాయ తన్ముఖోక్తం
కర్తవ్యం మమ కథయేతి సోఽబ్రవీత్తమ్ ॥

"ఆ విధంగా అయితే, బుద్ధిమంతులలో గొప్పవాడవైన కాంచీపూర్ణా ! నేను కొన్ని విషయాలను గూర్చి నా మనస్సులో ఆలోచిస్తున్నాను. వానిని మీరు వరదరాజస్వామి సన్నిధిలో నివేదించి, వానికి స్వామి చెప్పే కర్తవ్యమేమో తెలిసికొని నాకు తెలుపండి" అని శ్రీరామానుజులు కాంచీపూర్ణులతో అన్నారు.



**49.** ఇత్యుక్త స్స పది తథేతి కాఞ్చిపూర్ణో
విజ్ఞప్తుం రహసి జగామ దేవరాజే ।
వ్యాధూతవ్యజన మవేక్ష్య తం చచక్షే
సోపేత్థం కిమపి భవాన్వివక్షతీతి ॥

శ్రీరామానుజులు ఈ విధంగానే దానికి కాంచీపూర్ణులు "ఆ విధంగానే" అని పల్కి, వెంటనే వరదరాజస్వామితో ఏకాంతంలో సంభాషించడానికి వెళ్ళారు. వీవన వీచే కైంకర్యాన్ని చేసే కాంచీపూర్ణులను చూచి వరదరాజ స్వామి "నంబీ! మీరేదో నాతో చెప్పాలని అనుకుంటున్నట్లు తోస్తున్నదే !" అని అన్నాడు.

**50.** ఇత్యుక్తో వరద మువాచ సోతి నమ్రో
మాం రామానుజబుధ ఏవ మాచచక్షే ।
కేప్యర్థా మనసి విచిన్తితా మయా తాన్
ఉక్త్వా తే కథయ హితాహితం మమేతి ॥

పల్కిన వరదరాజస్వామితో కాంచీపూర్ణులు చాలా వినయంగా ఈ విధంగా అన్నారు. "నేను కొన్ని విషయాలను గూర్చి నా మనస్సులో చింతిస్తున్నాను. వానిని వరదరాజస్వామికి తెల్పి, హితమేదో, అహితమేదో తెలిసికొని నాకు తెలుపండి" అని శ్రీరామానుజులు నాతో అన్నారు.

**51.** విజ్ఞప్త స్స తమితి వాచ మాచచక్షే
కాఞ్చీశ స్సుమతివర స్స లక్ష్మణాఖ్యః ।
దాసత్వం సహజ మభఙ్గురం దధానో
భావజ్ఞో మమ సకలార్థతత్త్వవేత్తా ॥

ఈ విధంగా పల్కిన కాంచీపూర్ణులకు కంచినగరాధీశుడైన వరద రాజస్వామి ఈ విధంగా అన్నాడు "కాంచీపూర్ణా! రామానుజులు గొప్ప

బుద్ధిమంతుడు. అతనికి దాసత్వం సహజమైనది, నిత్యమైనవి. నా మనస్సులోని భావాన్ని అతడు తెలియగల్గినవాడు. సకలార్థతత్త్వాలను తెలిసినవాడు.

శ్రీరామాయణంలో శ్రీరాముడు లక్ష్మణుని ఉద్దేశించి **"భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ!, త్వయా"** అనిపల్కిన సూక్తి ఇక్కడ స్మరణీయం.

**52. శ్రీసాన్దీపనివిదుషో యదూద్వహః ప్రా-**
**గప్రాక్షత్సపది యథా సమస్తవిద్యాః ।**
**ప్రాప్యార్థా నయ మఖిలాం స్తథా గురుభ్యః**
**త్రాతుం కాంక్షతి జనతాం నిదేశతో మే ॥**

పూర్వం సాందీపిని మహర్షివద్ద శ్రీకృష్ణుడు సకల విద్యలను శ్రవణం చేసి లోకకల్యాణాన్ని చేసినట్లే, ఈ రామానుజులు కూడా నా ఆజ్ఞవల్ల గురువుల వద్ద సకలవిద్యలను పొంది, లోకాన్ని రక్షించాలని కోరుతున్నారు.

**53. తద్భావోత్తర మిద మస్త్యహం హి తత్త్వం**
**సద్వైతం మతమపి సాధనం ప్రపత్తిః ।**
**మోక్ష స్స్యాద్భువి చరమస్మృతిశ్చ హిత్వా**
**పూర్ణార్యే మహతి సమాశ్రయోస్య కార్యః ॥**

అతని మనస్సులోని భావాలకు సమాధానాలు ఇవి. (అవి ఏమంటే) (1) శ్రియఃపతి అయిన నేనే పరతత్త్వాన్ని, (2) భేదమే - సద్వైతమే - విశిష్టాద్వైతమే సిద్ధాంతం. (3)మోక్షసాధనం ప్రపత్తి. (4) ఈ జన్మలోనే మోక్షం కల్గుతుంది. (5) అంతిమస్మృతి అక్కరలేదు. (6) శ్రీరామానుజులు మహాపూర్ణులను ఆచార్యులుగా ఆశ్రయించాలి.

**54. శ్రుత్వార్థాన్వరదసమీరితాన్ స కాఞ్చీ-**
**పూర్ణార్యాత్ హృది కలితాన్నత స్తదఙ్ఘ్రోః ।**
**ఆనన్దప్రసరదమన్దరోమహర్షః**
**శ్రీరఙ్గం పుర మథ లక్ష్మణః ప్రతస్థే ॥**



వరదరాజస్వామి తమకు తెల్పిన సమాధానాలను కాంచీపూర్ణులు శ్రీరామానుజులకు వినిపించారు. వానిని విన్న రామానుజులకు రోమాంచం కలిగే అవధిలో గొప్ప ఆనందం కల్గింది. తరువాత శ్రీరామానుజులు కాంచీపూర్ణుల చరణాలలో నమస్కరించి, శ్రీరంగనగరానికి బయలుదేరారు.

ఆఱు వార్తలను కాంచీపూర్ణులవల్ల శ్రవణం చేసిన తరువాత శ్రీరామానుజులు, కాంచీపూర్ణులు స్వీకరించగా మిగిలిన భుక్తాన్ని శేషాన్ని స్వీకరించే ప్రయత్నం చేసినా ఫలించలేదనే వృత్తాంతం వడివ*ழ*కియ నమ్బిదాసర్ రచించిన శ్రీరామానుజవైభవమనే ద్రావిడకావ్యంలో ఉన్నది. అయితే ఈ వృత్తాంతం ప్రపన్నామృతంలో, గురుపరంపరాప్రభావంలో ఆఱు వార్తలను వినడానికి ముందే జరిగినట్లు తెలుపబడగా, యతిరాజ వైభవంలో కాని, ప్రకృతగ్రంథంలో కాని ఆ సందర్భం సూచనాప్రాయంగా కూడా ప్రస్తావింపబడలేదు.

ఇక్కడ ఇంకొక విషయం కూడా గమనించాలి. వరదరాజస్వామి తిరుక్కచ్చినంబితో శ్రీరామానుజులనుగూర్చి తెల్పుతూ, "రామానుజులు ఆచార్యులవద్ద విద్యాభ్యాసం చేయడం శ్రీకృష్ణుడు సాందీపని మహర్షివద్ద విద్యాభ్యాసం చేయడంవంటిది" - అని అన్నట్లు పల్కిన మాట గురుపరంపరాప్రభావంలో, శ్రీరామానుజవైభవంలో ఆచార్యసూక్తి ముక్తావళి కావ్యంలో వేఱొక సందర్భంలో పల్కినట్లు కన్పిస్తుంది. తిరుక్కోట్టియూర్‌నంబి ప్రోద్బలంతో తిరుమాలైయాణ్డాన్ సన్నిధిలో శ్రీరామానుజులు తిరువాయ్‌మొ*ழ*ి ప్రబంధాన్ని కాలక్షేపం చేసే సమయంలో శ్రీరామానుజులు ఆణ్డాన్ తెలిపే అర్థాలకంటే విలక్షణమైన కొన్ని అపూర్వార్థాలను తెలిపేవారు. వానిని విని ఆణ్డాన్ "ఇవి అన్నీ విశ్వామిత్రసృష్టి" అని కోపించి కాలక్షేపాన్ని నిలిపివేశారు. తరువాత కొంతకాలానికి తిరుక్కోట్టియూర్‌నంబికి ఈ విషయం తెలిసి, శ్రీరామానుజులు పల్కిన అపూర్వార్థాలను తాము గతంలో శ్రీయామునులద్వారా ఆలకించామని, శ్రీయామునులకు శ్రీరామానుజులు

ఏకలవ్యశిష్యులని అంటూ సాందీపని వద్ద శ్రీకృష్ణుడు విద్య నభ్యసించిన వృత్తాంతాన్ని ఉదాహరణగా పేర్కొన్నట్లు పై గ్రంథాలలో కన్పిస్తున్నది.

55. ఏతస్మిన్నవసర ఏవ యామునార్యా-
చార్యోక్తం త్వవితథ మాకలయ్య రఙ్గాత్ ।
సచ్ఛాత్రానుమతియుతో మహార్ణపూర్ణః
కర్తుం ప్రాస్థిత వశగం స లక్ష్మణార్యమ్ ॥

ఈ సమయంలో మహాపూర్ణులు, తమ ఆచార్యులైన యామునుల సూక్తులను గ్రహించి, తమ శిష్యుల అనుమతితో శ్రీరామానుజులను తమ వశం (శిష్యునిగా) చేసికోవడం కోసం శ్రీరంగం నుండి బయలుదేరారు.

56. నిర్గచ్ఛన్ పథి మధురాన్తకాగ్రహారే
శ్రీవిష్ణోః పృథులతటాకనాయకస్య ।
ధామాప శ్రమశమనం యథావిధిత్సుః
శ్రీరామానుజసుమతి శ్చ తత్తదాప ॥

మహాపూర్ణులు ఆ విధంగా బయలుదేరి ప్రయాణం చేస్తూ మధురాంతకమనే క్షేత్రంలోని ఏరికాత్తరామన్ అనే అర్చామూర్తి సన్నిధి సమీపంలో ప్రయాణపుబడలికను తీర్చుకోవడం కోసం విశ్రమించారు. ఆ సమయంలోనే శ్రీరామానుజులు కూడా అక్కడకు చేరారు.

57. తిష్ఠన్తం మహతి తటాకపాలవిష్ణోః
శ్రీధామన్యభిలషితం మహార్ణపూర్ణమ్ ।
ఈక్షిత్వా సపది తుతోష లక్ష్మణార్యః
కిం వాన్యత్ప్రమదకృదీప్సితార్థలాభాత్ ॥

అక్కడ ఏరికాత్తరామన్ దివ్యాలయంలో వేంచేసి ఉండేవారు, తాము దర్శింపగోరినవారైన మహాపూర్ణులను దర్శించి, శ్రీరామానుజులు వెంటనే



చాలా సంతోషించారు. కోరుకొన్న విషయం పొందడంకంటే ఆనందానికి వేఱొక కారణం ఏముంటుంది?

58. సాన్నిధ్యం సుకృతభరైః పురా కృతైర్మే
ప్రాప్త స్త్వం దివసకరో యథామ్బుజస్య ।
ఇత్యుచ్చై రభిదధదస్య పాదపద్మే
ప్రాణంసీత్ప్రకటితభక్తి లక్ష్మణార్యః ॥

“నేను పూర్వం చేసిన పుణ్యాల ఫలంగా మీ సాన్నిధ్యం నాకు, పద్మానికి సూర్యుడువలె, లభించింది” అని పల్కుతూ శ్రీరామానుజులు మహాపూర్ణుల పట్ల గొప్ప భక్తిని వ్యక్తం చేస్తూ వారి పాదపద్మాలలో నమస్కరించారు.

59. ఉత్థాప్య ప్రణతమముం తదా భుజాభ్యా-
మాశ్లిష్య ప్రణయవశాచ్చుచుమ్బ మూర్ధ్ని ।
ప్రాహృష్యత్పులకితవిగ్రహ స్సపశ్చా
త్కిం కిం న ప్రియజనసఙ్గమః కరోతి? ॥

తమకు నమస్కరించిన శ్రీరామానుజులను మహాపూర్ణులు, వారి భుజాలను పట్టుకొని పైకి లేపి, కౌగిలించుకొని, ప్రేమతో శిరస్సు మూర్కొన్నారు. అపుడు వారి శరీరం ఆనందంతో పులకరించింది. తమకిష్టమైన వారిని కలువడం అనేది ఏమేమి సంతోషాన్ని కల్గించదు? (ఎంతటి గొప్ప సంతోషాన్ని అయినా కల్గిస్తుంది.)

60. వన్దిత్వా వినయకృతాఞ్జలి ర్మహాశ్రీ-
పూర్ణ! త్వం మహితహితోపదేశపూర్వమ్ ।
త్వత్పాదామ్బుజయుగలే మనోహరే మా
మంగీకుర్విత నిగదన్త మబ్రవీత్సః ॥

అపుడు శ్రీరామానుజులు వినయంతో అంజలిని ఘటించి, “మహాపూర్ణార్యా! మీరు నన్ను గొప్పదైన మంత్రోపదేశాన్ని చేయడంతో

మనోహరమైన మీ పాదాబ్జయుగళంలో నన్ను ఉండడానికి అంగీకరించండి" అని అన్నారు. ఆ విధంగా పల్కిన శ్రీరామానుజులతో మహాపూర్ణులు ఈ రీతిలో పలికారు.

**61.** **శ్రీకాఞ్చీనగరలలామపుణ్యకోటి-**
**చ్ఛాయాయాం వరదవిభో శ్చ సన్నిధానే ।**
**త్వాం మేధావిన మురరీక్రియాస మిత్యా-**
**చక్షాణం పునరిద మాహ లక్ష్మణార్యః ॥**

"కాంచీనగరానికి తిలకంవలె గొప్ప అలంకారమైన పుణ్యకోటి విమానచ్ఛాయలో, శ్రీవరదరాజస్వామి సాన్నిధ్యంలో బుద్ధిమంతుడవైన నిన్ను నేను శిష్యునిగా స్వీకరిస్తాను" (అని మహాపూర్ణులన్నారు). అపుడు ఆ రీతిలో పల్కిన మహాపూర్ణులతో శ్రీరామానుజులు మళ్ళీ ఈ విధంగా పలికారు.

**62.** **అఙ్గాని ప్రకృతివిభఙ్గురాణి వృత్తి**
**శ్చిత్తస్య క్షణమపి యాతి నైకరూప్యమ్ ।**
**కో వేత్తి క్షణరుచిదామచఞ్చలానాం**
**ప్రాణానాం స్థితి మథవా వినిర్గమఞ్చ ॥**

శరీరాంగాలు సహజంగా అనిత్యాలు. మనోవ్యాపారం క్షణం క్షణం మారుతూ చంచలంగా ఉంటుంది. మెఱుపువలె క్షణికాలైన ప్రాణాలు నిలుస్తాయో? లేక, శరీరాన్ని వీడి వెళ్ళిపోతాయో? ఎవరు తెలియగలరు?

**"మిన్నిన్నిలైయిలమన్నుయిరాక్కైకళ్"** (మెరుపు నిలచినంత సేపు కూడా శరీరాలు నిలువవు) అనే తిరువాయ్మొழி సూక్తి ఇక్కడ స్మరణీయం.

**63.** **ఉక్తం నౌ నిరుపమయామునేయయోగి-**
**గ్రామణ్యా స్వచరణసేవనం చికీర్షోః ।**
**శ్రీరఙ్గం నగర ముపేయుషో ర్నరాణా-**
**మస్థైర్యం పరమపదం పురాగతేన ॥**



ఇంతకుముందు ఎపుడు మన ఇరువురం శ్రీయామునుల శ్రీచరణాలను సేవించాలని కోరేవారమై శ్రీరంగనగరానికి వెళ్ళామో, అపుడు మనం అక్కడకు చేరడానికి ముందే పరమపదాన్ని చేరిన యామునులే మనకు ఈ విషయంలో ఉదాహరణం. (అందువల్ల నా శరీరమే కాక, మీ శరీరం కూడా స్థిరం కాదు- అనిభావం)

**64.** **తద్విష్ణో స్సపది తటాకరక్షిణోऽగ్రే**
**మూలే శ్రీవకులతరో ర్హితోపదేశైః ।**
**మచ్చిత్తం కురు నిరవగ్రహప్రబోధం**
**రాజీవం రవిరివ రోచిషాం ప్రరోహైః ॥**

కనుక ఈ ఏరికాత్తరామన్ స్వామి సన్నిధిలో ఈవకుళవృక్షం మూలలో నాకు హితాన్ని ఉపదేశించడం ద్వారా నా చిత్తానికి ఏ అవరోధం లేని జ్ఞానాన్ని, సూర్యుడు తన కిరణాలతో కమలానికి వికాసాన్ని కల్గించేటట్లు, అనుగ్రహించండి.

గురుపరంపరాప్రభావంలో, ప్రపన్నామృతంలో కూడా ఇదే రీతిలో శ్రీరామానుజులకు, పెరియనంబికి మధ్య సంభాషణ జరిగినట్లు తెలుపబడింది. గురుపరంపరా ప్రభావంలో - **"కాలక్షేపమ్ పణ్ణవొణ్ణామైక్కు ఆళవన్దార్‌పక్కల్ కణ్డదు అమైయాదో! మిన్నిల్ నిలైయిల్లాద అడియేనుడైయ ఇచ్చరీరమ్ ఇరుక్కిఅపోదే కృపై పణ్ణి యరుళవేణుమ్"** ఎన్ఱు విణ్ణప్పమ్ శెయ్య" (కాలవిలంబం చేయకూడదనే దానికి శ్రీయామునుల విషయంలో చూచినది చాలదా? మెఱుపు నిలిచే కాలం అయినా నిలువని దాసుని శరీరం నిలచి ఉన్నపుడే కృపచేసి అనుగ్రహించాలి) అని, **"శరీర మస్థిరం జ్ఞాత్వా తవ వాక్యం మహామతే!, సాహసాత్ కథమిచ్ఛామి కర్తు మద్య బుధర్షభ, కాంచ్యా స్సమాగతో హమస్మి స ప్రాప పరమం పదమ్"** ఇత్యాది ప్రపన్నామృతంలోని వచనాలు స్మరణీయాలు.

**65.** **తత్రేత్థం గదితవతే సపాదపద్మం**
**సమ్భావ్య స్వమనసి యామునేయసూరేః ।**

**ప్రాహాస్మై సగురుపరంపరం ద్వయాఖ్యం**
**తత్త్వార్థప్రకటనకారిమన్త్రరత్నమ్ ॥**

అక్కడ ఈ విధంగా పల్కిన శ్రీరామానుజులకు, మహాపూర్ణులు తమ ఆచార్యులైన శ్రీయామునుల శ్రీచరణాలను తమ మనస్సులో స్మరించి, గురుపరంపరా పూర్వకంగా తత్త్వార్థాన్ని వ్యక్తం చేసే ద్వయ మంత్రాన్ని ఉపదేశించారు.

**66.** **శ్రీరామో జగదవనాయ పాదుకే స్వే**
**విన్యస్యాశ్నుత భరతే యథా వనాన్తమ్ ।**
**స స్వాఙ్ఘ్రిం మయి వినివేశ్య యామునేయ-**
**స్త్వాం పాతుం మనుమణి మాసద త్తథా స్వః ॥**

“శ్రీరామచంద్రుడు జగద్రక్షణార్థం తన పాదుకలను రెండిటిని భరతునకు ఇచ్చి వనానికి వెళ్ళినట్లే, ఆ యామునులు మిమ్ములను రక్షించడంలోనే తమ శ్రీచరణాలను, మంత్రరత్నమనే ద్వయాన్ని నావద్ద నిక్షేపించి పరమపదానికి వెళ్ళారు.

**67.** **శ్రీకాంచ్యాం ద్వయమనునోక్తవాచ్య ముచ్చైః**
**ప్రత్యక్షం తవ రచయేయ మిత్యుదీర్య ।**
**తాం గత్వా సమ మథ లక్ష్మణేన తస్యాం**
**మన్త్రార్థం వరద మదర్శయత్స తస్మై ॥**

మీకు నేను కంచికి వెళ్ళిన తరువాత ద్వయమంత్రం యొక్క వాక్యార్థాన్ని తెలిసేటట్లు చేస్తాను”- అని పెరియనంబి పల్కి శ్రీరామానుజులను వెంట బెట్టుకొని కంచికి వచ్చి, ద్వయమంత్రం యొక్క సాక్షాదర్థ స్వరూపుడైన వరదరాజస్వామి యొక్క దర్శనాన్ని చేయించారు.

శ్రీరంగంలోని శ్రీరంగనాథుడు ప్రణవాకార విమానంలో ఉన్నందున అష్టాక్షరి మంత్రార్థ స్వరూపుడు. తిరుమలలోని శ్రీవేంకటేశుడు “మత్వాదౌ



శరణం వ్రజ” అనేరీతిలో వేంచేసి ఉన్నందున చరమ శ్లోకార్థ స్వరూపుడు. ఇక కంచిలోని అర్థితార్థ పరిదాన దీక్షితుడైన వరదుడు ద్వయార్థస్వరూపుడు.

హస్తిగిరిలో వేంచేసిఉండే వరదరాజస్వామి మంత్రరత్న వాచ్యార్థ రూపుడని పెరియనంబి పల్కిన విషయాన్ని శ్రీరామానుజ వైభవంలో కూడా - **“ఇన్ఱెనక్కురైత్త మన్దిరమ్ తనక్కిఙ్గు ఇశైన్ద నల్పొరుళ్ ఏదు? ఎన్న నమ్బి శేర్ అత్తికిరియినిల్ ఆఴి నలన్దికఴ్ శఙ్గము మేన్ది నిన్ఱ నమ్ తిరుమాల్ ఎన్ఱనన్”** (ఈనాడు నాకు ఉపదేశించిన మంత్ర రత్నంచేత తెలుపబడే స్వామి ఎవరు? అని అనగా, పెరియనంబి - హస్తిగిరిలో శంఖచక్రాలను ధరించి నిలచిన మన శ్రియఃపతియే - అని అన్నారు) **(416)** అని పెరియనంబి పల్కినట్లు తెలుపబడింది.

**68.** **షణ్మాసం వరదపదారవిన్దసేవా-**
**హేవాకీ యువతిసఖో మహార్యపూర్ణః ।**
**గూఢార్థాన్ గురుగదితాన్ స్వదర్శనస్య**
**వ్యాకార్షీదథ గృహిణీసఖాయ తస్మై ॥**

పెరియనంబి ఆఱునెలల కాలంపాటు తమ ధర్మపత్నితో పాటుగా కంచిలో శ్రీవరదరాజస్వామికి కైంకర్యాన్ని చేస్తూ, తమకు ఆచార్యులు తెల్పిన దర్శనంలోని రహస్యార్థాలను గృహిణీసహితులైన ఉండే శ్రీరామానుజులకు ఉపదేశించారు.

పెరియనంబి ఆఱునెలల కాలం కాంచీపురంలో ఉన్న విషయాన్ని **“ముప్పొఴుదుమ్ అనుబవిత్తు మూవిరణ్డు తిఙ్గళవణ్ ఒప్పరియ పెరియనమ్బి ఉడన్ వాఴ్న్దార్ అన్నాళిల్”** (మూడు కాలాలలో వరదుని సేవిస్తూ ఆఱు నెలల కాలం కాంచీనగరంలో పెరియనంబి అపుడు నివసించారు) అని శ్రీరామానుజవైభవం తెల్పింది. గురుపరంపరా ప్రభావం కూడా **“నమ్బియుమ్ ఆఱుమాసమ్ అఙ్గే ఎఴున్దరుళియిరున్దు”** అని పల్కింది.

**69.** కూపామ్బుగ్రహణవిధౌ మిథః కదాచిత్
కుప్యన్త్యా ఘటమిలనేన లక్ష్మణస్య ।
గేహిన్యా సపది విమానితావరోధః
శ్రీరఙ్గం నిభృత మగాన్మహాపూర్ణః ॥

ఒకనాడు బావివద్ద నీరు తోడుకొనేటపుడు శ్రీరామానుజుల గృహిణి తోడే పాత్ర, పెరియనంబి గృహిణితోడే పాత్ర - రెండు యాదృచ్ఛికంగా కలసికొన్నందున, శ్రీరామానుజుల గృహిణి పెరియనంబి భార్యను అవమానించింది. అంతటితో మహాపూర్ణులు రహస్యంగా శ్రీరంగానికి వెళ్ళిపోయారు.

**70.** తస్మిన్ ప్రస్థితవతి దేశికే స రోషాత్
ఏతస్మిన్నవినయతః కృతాద్గృహిణ్యా ।
సాతఙ్కః ప్రథమకృతాచ్చ కాఞ్చిపూర్ణే
సన్యాస్యత్కృతభవగర్హాణ స్త్రిదణ్డీ ॥

తమ ఆచార్యులు ఆ విధంగా తిరిగి వెళ్ళిపోగా, శ్రీరామానుజులకు కోపం కల్గింది. అంతకు ముందు ఆచార్యుల విషయంలో తమ పత్ని చేసిన అవినయవర్తనం వల్ల, మొదటగా కాంచీపూర్ణులపట్ల ఆమె అపచార పడినందువల్ల, శ్రీరామానుజులు సంసారంనుండి పూర్తిగా విరక్తులై, సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించి త్రిదండి యతులయ్యారు.

**71.** సంన్యస్యన్ సరసి కరాహితత్రిదణ్డో
నిశ్శేషం నిరముచదేష బంధువర్గమ్ ।
వాధూలం ప్రకటితదాశరథ్యభిఖ్యం
నాహాసీద్బుధవర మగ్రజాతనూజమ్ ॥

శ్రీరామానుజులు అనంతసరస్సులో స్నానం చేసి, చేతిలో త్రిదండాన్ని గ్రహించి సన్న్యసించారు. సకలబంధువర్గాన్ని వారు విడచిపెట్టారు.



వాధూలగోత్రంలో ఉద్భవించినవారు, దాశరథి నామధేయులు, తన సహోదరి కుమారులు, గొప్ప పండితులైన ముదలియాణ్డాన్‌ను మాత్రం వదలిపెట్టలేదు.

శ్రీరామానుజుల ఆశ్రమ స్వీకారం క్రీ.శ.1049వ సంవత్సరంలో జరిగి ఉండవచ్చునని చారిత్రకుల భావన.

**72.** సంన్యస్య ప్రకటితవైదికాధ్వనీతిః
త్వం రామానుజగురువద్ధృతత్రిదణ్డః ।
మాత్రేతీరిత మవనిప్రదక్షిణోత్కం
దేవేశోవదదితి యాదవప్రకాశమ్ ॥

యాదవప్రకాశుని తల్లి అతనితో- “నీవు కూడా శ్రీరామానుజుల వలె త్రిదండధారణను చేసి, వైదిక రీతిని అనుసరించు” అని అన్నది. యాదవప్రకాశులు ఈ మాటను విని ప్రాయశ్చిత్తంకోసం భూప్రదక్షిణాన్ని చేయగోరారు. అపుడు వరదరాజస్వామి యాదవప్రకాశునితో ఈ విధంగా స్వప్నంలో అన్నాడు.

**73.** మద్రామానుజయమినః ప్రదక్షిణం త్వం
పర్యాయం కురు ధరణీప్రదక్షిణస్య ।
స్వప్నే తద్గిర మవధూయ కాఞ్చిపూర్ణం
వవ్రే తం వరదవిభో ర్నివేదితుం సః ॥

“నీవు, మా శ్రీరామానుజ యతీంద్రునకు ప్రదక్షిణం చేయి. అది భూప్రదక్షిణంతో సమానం కాగలదు”. స్వప్నంలో వరదరాజస్వామి పల్కిన ఈ మాటను విని యాదవుడు దానిని నమ్మకుండా, కాంచీపూర్ణుల దగ్గరకు వెళ్ళి, ఆ విషయాన్ని గూర్చి వరదరాజస్వామితో నివేదించమన్నాడు.

**74.** తస్యార్థం రహసి నిశమ్య కాఞ్చిపూర్ణాత్
దేవేశ స్తమితి తదుత్తరం జగాద ।

ప్రాక్స్వప్నే మదభిహితప్రకారత స్త
న్నిశ్శఙ్కం రచయతు యాదవప్రకాశః ॥

వరదరాజస్వామి కాంచీపూర్ణులవల్ల ఆ విషయాన్ని ఏకాంతంలో విని దానికి సమాధానాన్ని ఈ విధంగా పలికాడు "ఇతఃపూర్వం నేను స్వప్నంలో పల్కిన రీతిలో యాదవప్రకాశుడు ఈ కార్యాన్ని నిస్సందేహంగా చేయవచ్చు."

**75.** ఇత్యేవం వరదవచో నిశమ్య విష్ణోః
సప్రీతో విహరణధామ విశ్వమూర్తేః ।
శ్రీరామానుజయమినం పరీత్య తస్మాత్
సన్న్యస్యాకలయదముష్య శిష్యభావమ్ ॥

ఈ విధంగా, విష్ణువైన వరదరాజస్వామి పల్కిన మాటను విని, శ్రీరామానుజుల సమీపానికి వచ్చి, వారికి ప్రదక్షిణాన్ని చేశాడు. అది భూప్రదక్షిణంతో సమానం. ఎందుకంటే, శ్రీరామానుజులు విశ్వమూర్తి అయిన భగవంతునకు శయనం. యాదవప్రకాశులు సన్న్యసించి, ఆ రామానుజులకు శిష్యులయ్యారు.

యాదవప్రకాశులు క్రీ.శ.1050 వ సంవత్సరంలో రామానుజులను ఆశ్రయించి ఉండవచ్చునని చారిత్రకాభిప్రాయం.

**76.** శ్రుత్వా తం శ్రితచరమాశ్రమం ప్రహృష్టాః
రఙ్గస్థాః కృతమతయో నిదేశపూర్వమ్ ।
రఙ్గేన్ద్రో స్స్వసవిధ మానినీషవన్తం
ప్రాహైషు ర్బుధ మథ రఙ్గిగాయకాఖ్యమ్ ॥

శ్రీరంగంలోని విద్వాంసులందఱు శ్రీరామానుజులు సన్న్యాసాశ్రమ స్వీకారాన్ని చేశారని తెలిసి ఆనందించారు. అపుడు వారు శ్రీరామానుజులను శ్రీరంగానికి తీసికొని రావాలని నిశ్చయించుకొన్నవారై, తిరువరంగ



ప్పెరుమాళ్ అరైయర్ (శ్రీయామునుల కుమారులు) అనే విద్వాంసులను శ్రీరామానుజులను శ్రీరంగానికి పిలుచుకొని రావడం కోసం పంపించారు.

**77.** శ్రీకాఞ్చీపుర మథ రఙ్గిగాయకాఖ్యః
సమ్ప్రాప్తో వరదవిభో స్స గానతుష్టాత్ ।
తం రామానుజగురు మేత్య పూర్ణపాత్రం
శ్రీరఙ్గం పుర మగమత్స తేన భూయః ॥

అపుడు ఆ తిరువరంగప్పెరుమాళ్ అరైయర్ వరదరాజస్వామి వేంచేసి ఉండే కాంచీపురానికి వచ్చారు. వారి గానానికి సంతోషించిన వరదునివల్ల శ్రీరామానుజులను కానుకగా పొంది, శ్రీరామానుజులతో పాటు మళ్ళీ శ్రీరంగానికి బయలుదేరారు.

ఈ సంఘటన క్రీ.శ.1052వ సంవత్సరంలో జరిగిందని చారిత్రకుల అభిప్రాయం.

**78.** సేనాన్యా సపరికరేణ తం నిదేశాత్
స్వాత్ ప్రత్యుద్గత మవలోక్య లక్ష్మణార్యమ్।
రఙ్గేన్దుః కరతలసౌధగోభియాతో
విన్యాసై రల మకృతాస్య శీర్ష మంఘ్ర్యోః॥

శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం విష్వక్సేనులు తన పరివారంతో పాటు ఎదురేగి శ్రీరామానుజులను స్వాగతం పలికారు. శ్రీరామానుజులు శ్రీరంగమందిరాన్ని సమీపించగానే శ్రీరంగనాథుడు కైత్తలత్తు సేవలో వేంచేసి, తన శ్రీచరణాలను వారి శిరస్సుపై పెట్టాడు.

శ్రీరామానుజుల శిరస్సుపై నమ్బెరుమాళ్ శ్రీచరణాలను ఉంచిన సందర్భాన్ని శ్రీరామానుజవైభవ కావ్యం **"ఎమ్బెరుమానార్‌వళర్ ఒప్పఱ నమ్బెరుమాళ్ వైత్తనర్ తామరైతాళ్ ఒప్పెన అన్తైనవాళ్ ఒళ్ళియ శేవడియే"** (శ్రీరామానుజుల ఉన్నతమైన శిరస్సుపై శ్రీరంగనాథుడు అపుడే వికసించిన

తామరతో సాటి వచ్చే, వికాసం నిండిన, అందమైన శ్రీచరణాన్ని పెట్టారు) అని తెల్పింది.

**79.** సేవిత్వా నిజపద మఙ్ఘ్రిచూడ మస్మై
హృష్టాయాదిత వర మాదిమ స్స రఙ్గీ ।
ప్రహ్వేభ్యో భవతి చ తే విభూతియుగ్మం
ప్రాదా స్త్వం మమ గృహకృత్య మాచరేతి॥

శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహాన్ని ఆపాదచూడం సేవించి ఆనందించిన శ్రీరామానుజులకు శ్రీరంగనాథుడు వరదానాన్ని అనుగ్రహించాడు. ఆ వరాలేమి? అంటే - లీలావిభూతి అనే ఈ విభూతిని నిత్యవిభూతి అనే పరమపదాన్ని రెండిటిని మీకు కానుకగా అనుగ్రహిస్తున్నాను. ఈరెండు మీ భక్తులకు సులభం కాగలదు. నా మందిరనిర్వహణను మీరు చేయగలరు- అనేవి ఆ వరాలు.

**80.** రఙ్గేన్ద్రో ర్యతిపతి రాజ్ఞయా విధాయ
స్వాన్తేవాసిన మకలఙ్కనామభూపమ్ ।
దుర్వృత్తానపి వినిగృహ్య శాశ్వతం తత్
సోత్కర్షం విరచయతి స్మ రఙ్గికార్యమ్ ॥

యతిపరులైన శ్రీరామానుజులు శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం అకలంకనాట్టాళ్వాన్ అనే ప్రభువును తన శిష్యునిగా చేసికొని, అతని ద్వారా ఆలయంలో దురాచారాలను అరికట్టారు. శ్రీరంగనాథుని సేవాక్రమాదులను సర్వదా అందమైన రీతిలో జరిగే వ్యవస్థను ఏర్పాటుచేశారు.

ఈ సందర్భంలో అకలంకన్ ప్రస్తావం గురుపరంపరా ప్రభావంలో **"అకలంక నాట్టాళ్వానై శిష్యనాక్కి కోయిలుక్కుమేల్ కావలాక వైత్తరుళి"** అని తెలుపబడింది.



**81.** రఙ్గేశాచ్ఛ్రియ మభజం త్వదఙ్ఘ్రిదాస్యా
దీదృక్షీమితి వదతోస్య సోతిపూర్ణః ।
ఉక్త్వార్థాన్ గురుగదితాన్ సుతఞ్చ కృత్వా
తచ్ఛాత్రం పునరితి లక్ష్మణార్య మూచే ॥

శ్రీరామానుజులు మహాపూర్ణులతో- "నేను తమకు శిష్యుడను అయినందున శ్రీరంగనాథుని వల్ల ఈ ఐశ్వర్యం లభించింది". అని అన్నారు. ఈ మాటను విని మహాపూర్ణులు తమ కుమారుడైన రామానుజ నామధేయుని శ్రీరామానుజుల శిష్యునిగా చేసి, వారి ద్వారా సకలసంప్రదాయ రహస్యార్థాలు తెలియపరచారు. అంతేకాక శ్రీరామానుజులతో ఈ విధంగా పలికారు.

పెరియనంబితో శ్రీరామానుజులు పల్కిన ఈమాటలు శ్రీరామానుజ వైభవంలో - **"పెరియనంబి ముకనోక్కి ప్పేర్దై యేఴ్కు ఉనక్కాక వరియ వరవిల్ ఉలకనైత్తుమ్ వయిఱ్ఱొడుక్కి క్కణ్వళరుమ్ కరియ ముకిల్ అనైత్తైయుమ్ కాట్టిడ నాన్ కణ్డొழిన్దేన్"** (పెరియనంబి ముఖాన్ని చూచి శ్రీరామానుజులు -"దేవరవారికోసం అకించనుడనైన నాకు, అన్నిలోకాలను ఉదరంలో పెట్టుకొని ఆదిశేషునిపై శయనించే నీలమేఘవర్ణుడు అన్నిటిని అనుగ్రహించగా నేను దర్శించాను" అని అన్నారు.) అని తెలుపబడింది.

**82.** నిక్షిప్తా స్తవ కిల యామునేయతీర్థైః
కేప్యర్థా జగదవనాయ తాన్ గృహాణ ।
శ్రీగోష్ఠీనగరవృషావనీధ్రపూర్ణ -
శ్రీమాలాధరవరరఙ్గిగాయకేషు ॥

"మీకోసం శ్రీయామునులు గోష్ఠీపూర్ణులు, శ్రీశైలపూర్ణులు, మాలాధారులు, తిరువరంగప్పెరుమాళ్ అరైయర్- అనే తమ శిష్యులవద్ద

కొన్ని రహస్యార్థాలను నిక్షిప్తం చేసి ఉంచారు. మీరు వానిని వారివద్ద గ్రహించండి." (అని అన్నారు.)

**83. తస్యోక్తిం శ్రవణసుధాం విధాయ సోర్థాన్**
**ఆదిత్సుర్మనసి కుతూహలాతిభారమ్ ।**
**ఛాత్రాణాం సురగురుజైత్రధీభరాణాం**
**సప్తత్యా సహ పరమాప్తయా బభార ॥**

ఆ మాటను శ్రవణామృతంగా ఆలకించి, శ్రీరామానుజులు ఆ అర్థాలను గ్రహించాలనే గొప్ప ఆసక్తిని మనస్సులో కలవారై, బృహస్పతితో సమానులైన, ధీమంతులైన శిష్యులు డెబ్బైమందితో కలిసి ఆ రహస్యార్థాలను పొందడంకోసం బయలుదేరారు.

**84. శ్రీరఙ్గాధిపతిధురంధరో యతీన్ద్రః**
**శ్రీకార్యప్రతిసరపూర్వరఙ్గిభృత్యాన్ ।**
**సమ్భృత్య స్వమతపరాననేక దేశ్యాన్**
**సంన్యాస్య ద్దశవిధకింకరాన్ ద్విజేన్ద్రాన్ ॥**

శ్రీరంగనాథుని శ్రీకార్యధురంధరులైన శ్రీరామానుజులు అనేక దేశాలనుండి కైంకర్యనిర్వహణ సమర్థులైన బ్రాహ్మణశ్రేష్ఠులను **"పత్తు కొత్తు కూళ్"** అనే పేరుగల, పదివిధాలైన శ్రీరంగనాథుని సేవకులుగా చేసి, వారిని పది విధాలైన కైంకర్యాలను నిర్వహించడంకోసం నియమించారు.

**"తెన్నరఙ్గమ్ శెల్వమ్ ముఱ్ఱళీమ్ తిరుత్తువైత్తాన్"** అని రామానుజులు కీర్తింపబడుతున్నారు కదా!

**85. భృత్యానాం దశవిధవర్గణా ద్విజానాం**
**శూద్రాణాం యతితిలకస్స తావతాఞ్చ ।**
**శేషత్వా దకృతనికృష్టకర్మయోగా -**
**దత్రాముత్ర చ నియమం మహార్థసిద్ధేః ॥**



ఆదిశేషావతార స్వరూపులైన శ్రీరామానుజాచార్యులవారు అందఱికి భగవచ్ఛేషత్వం ఉన్నందున, అందఱికి భగవత్కైంకర్యానికి అవకాశాన్ని ఇచ్చారు. బ్రాహ్మణ సేవకులను పది విధాలుగా వర్గీకరించి నట్లే, శూద్రులైన సేవకులను కూడా కొన్ని సేవలలో నియోగించి, వారిని కూడా పది విధాలుగా విభాగించారు. ఈ భగవత్కైంకర్యంవల్ల వారంతా ఐహిక, పారలౌకిక పురుషార్థసిద్ధిని పొందగల్గినవారయ్యారు.

శ్రీరామానుజులు వర్గీకరించిన బ్రాహ్మణ భృత్యులలోని పది వర్గాల పేర్లు. 1. తిరుప్పదియార్, 2.తిరుప్పణిశెయ్‌వార్, 3. భాగవతనమ్బిమార్, 4. ఉళ్ళూరార్, 5.విణ్ణప్పమ్ శెయ్‌వార్, 6.తిరుక్కరక క్కైయార్, 7.స్థానత్తార్, 8.పట్టాళ్‌కొత్తు, 9.ఆరియపట్టాళ్, 10.దాసనంబికళ్. ఆ విధంగానే శూద్ర భృత్యులను ధాన్యాన్ని కొలిచేవారు, కంసాదులు, శిల్పులు, దేవదాసీలు, దర్జీలు, చాకళ్ళు, కుమ్మరులు, గొల్లలు, ఉత్సవాలలో గానం చేసేవారు, నాట్యంచేసేవారు ఇత్యాదిగా పదివిధాలుగా వర్గీకరింపబడ్డారు.

**86. రఙ్గేశం యతిపతి రేకదా స్వశిష్యాత్**
**దధ్యన్నానుపదనివేద్యమానజమ్బుమ్ ।**
**రాజ్ఞీయోపచరణలాలసో మురారౌ**
**తద్దోషప్రశమ మదాపయత్కషాయమ్ ॥**

ఒకనాడు శ్రీరామానుజులు శ్రీరంగనాథునకు దధ్యన్నప్రసాద నివేదన చేయబడిన తరువాత, వెంటనే జంబూఫల నివేదన కూడా చేయబడినదని ఒక శిష్యునివల్ల తెలిసికొన్నారు. ఈరెండు వస్తువుల కలయికవల్ల ఏర్పడే విషం యొక్క ప్రభావాన్ని గమనించి, ఆ విధంగా నివేదన చేసిన సేవకునకు దండన విధించారు.

**87. ఆరోగ్యోపపద మథాకలయ్య శాలాం**
**శ్రీధన్వన్తరిహరిధామ తచ్చకార ।**

రజ్గేన్ద్రో స్స గరుడవాహభట్టక్లుప్తం
పథ్యాయానుదిన మదాపయత్కషాయమ్ ॥

**"రంగేశయం రాజవదర్హణీయమ్"** అనే విధంగా ప్రభువును సేవించి నట్లు శ్రీరంగనాథునకు సేవలు చేయాలనే అభిలాషను కల శ్రీరామానుజులు ఆ విధంగా దధ్యన్న - జంబూఫలమిశ్రమం వల్ల కల్గిన దోషాన్ని నివారించడం కోసం ఒక విధమైన కషాయాన్ని శ్రీరంగనాథునకు నివేదన చేయించారు. ఆ విధంగానే, శ్రీరంగాలయంలో ఒక వైద్యశాలను ఏర్పరచి, దానిని ధన్వంతరి మందిరంగా ఏర్పరచారు. ఆనాటినుండి శ్రీరంగనాథునడు నివేదించే భోగంలో వైద్యశాలాధికారి (ప్రకృతకావ్యాన్ని రచించిన కవి) అయిన గరుడవాహన పండితుని ద్వారా ప్రతిదినం కషాయాన్ని సిద్ధం చేయించి, దానిని నివేదన చేసేటట్లు ఏర్పరచారు.

ఈ వివరం కోయిలొ*ழு*గు అనే శ్రీరంగాలయ సమయాచారాలను తెలిపే ద్రావిడగ్రంథంలో కూడా ప్రస్తావింపబడింది.

**88.** శ్రీకార్యప్రతిరోధినః పరికరాన్ రజ్గేశితు ర్దుర్మదాన్
దూరీకృత్య తదీయకార్యనిరతో రజ్గప్రతిష్ఠామివ ।
వేదాన్తాధ్వవిరుద్ధసౌగతముఖాన్ దుర్వాదిన స్సంహరన్
ఆచన్ద్రార్క మసౌ చకార నిగమోత్తంసప్రతిష్ఠామపి ॥

శ్రీరామానుజులు ఈ విధంగానే శ్రీరంగనాథుని సేవకులలో గర్వించిన దుష్టులైన వారిని దూరం చేసి, ఆ స్వామి సేవలో నిమగ్నులయ్యారు. శ్రీరంగం యొక్క ప్రతిష్ఠను పెంచారు. ఆ విధంగానే వేదాంతమార్గానికి విరోధులైన బౌద్ధాదులు నిరసించి, ఆచంద్రార్కం వేదాంతప్రతిష్ఠను నిలిపారు.

రామానుజవైభవంలో **"ఆదియాలనైత్తుమ్ తుఱైతుచ్చై తోఱు మాశఱ నోక్కి మెయ్యాన్బాల్ శోదియాతవైకళ్ అనైత్తైయుమ్ పుకున్దు తుఱై తోఱుమ్ శోదనై ప్పణ్ణి ప్పేదియా అరుళిన్ నిష్టవర్ నిఱ్క ప్పిఱర్కళై మునిన్దఱ అకఱ్ఱి నీదియానిష్ట అన్బరై అకన్దాన్ నిష్ట అత్తుఱై తోఱుమ్ నిఱుత్తి."** (శ్రీరామానుజులు అన్నిటిని ఒక్కొక్క విభాగంలోని ఏదోషం లేని రీతిలో పరిశీలించి చూచి, నిజమైన భక్తితో, ఇంతవరకు ఎవ్వరూ గమనించి అన్నిటిని నిశితంగా పరిశీలించి చూచి, ఒక్కొక్క విభాగాన్ని శోధించి, మనస్సులో కళంకం లేకుండా, భక్తిశ్రద్ధలతో ఉండేవారిని అధికారులుగా నిలిపి, ఆ విధంగా లేనివారిని తొలగించి, నీతిమార్గంలో చరించే భక్తులను ఆయా విభాగాలలో నిలిపారు) అని శ్రీరామానుజులు చేసిన శ్రీరంగాలయ పరిపాలన సంస్కరణలను ప్రస్తావింపబడింది.



దివ్యప్రబంధవ్యాఖ్యానాలలో కూడా శ్రీరామానుజులు చేసిన కట్టడులు అక్కడక్కడ ప్రస్తావింపబడడం గమనించవచ్చు. తిరువిరుత్త ప్రబంధంలోని 99వ పాశురవ్యాఖ్యలో పెరియవాచ్చాన్‌పిళ్ళై పల్కిన- **"పెరుమాళ్ అముదు శెయ్యుమ్బోదు ఇన్నదనై కఱియముదుమ్, నెయ్యముదుమ్- ఎన్ఱు కణక్కిట్టు అవై తన్నై అముదు శెయ్‌వదఱ్కు మున్నేయుమ్ ఎనక్కు క్కాట్టి, అముదుశెయ్‌దాలుమ్ ఎనక్కుక్కాట్టి ప్పోఙ్గోళ్ - ఎన్ఱారాయ్"**, (శ్రీరంగంలో శ్రీరంగనాథుడు ఆరగించడం కోసం ప్రసాదాలను - "ఇంతపరిమాణం కరియముదు, ఇంత పరిమాణం నేయి" అని పదార్థాలకు పరిమితిని నిర్ణయించి, శ్రీరామానుజులు పంపించేవారు. ఆ పదార్థాలను స్వామికి నివేదన చేయడం కోసం తీసికొని పోయేటపుడు - "స్వామి ఆరగింపుకు తీసికొని పోవడానికి ముందు వానిని నాకొకసారి చూపండి, ఆరగించిన తరువాత కూడా నాకు చూపండి" అని శ్రీరంగాలయసేవకులను నియమించారు) అనే సూక్తులు గమనించదగినవి.

సర్గాంతం కనుక భిన్నవృత్తమైన శార్దూల విక్రీడితం ప్రయోగింప బడింది.

శ్రీదివ్యసూరి చరితంలో పదిహేడవ సర్గ సంపూర్ణం.

### శ్రీగరుడవాహన పండితుడు రచించిన

# శ్రీదివ్యసూరిచరితంలో

### పద్దెనిమిదవ సర్గ

### (శ్రీరామానుజ వైభవం)

**1.** శ్రీరామానుజముని రానినంసు రజ్ఞ్యోః
శ్రీగోష్ఠీపురవర పూర్ణదేశికస్య ।
శ్రీరజ్గేన్ద్వనుమతిమా నథ ప్రతస్థే
శ్రీగోష్ఠీపుర మఖిలై ర్వృత స్స్వశిష్యైః ॥

ఒకనాడు భగవద్రామానుజులకు తిరుక్కోట్టియూర్‌కు వెళ్ళి, అక్కడ ఉండే గోష్ఠిపూర్ణులను సేవించాలనే కోరిక కల్గింది. అందువల్ల, శ్రీరంగనాథుని ఆజ్ఞను పొంది, సమస్త శిష్యులతో కలసి తిరుక్కోట్టియూర్‌కు బయలుదేరారు.

**2.** గత్వా లక్ష్మణయతి రన్తికం దశాష్టౌ
వారా నప్యనుపమగోష్ఠి పూర్ణసూరేః ।
గూఢం తత్సచరమపద్యవాచ్య మాప్త్వా
విస్పష్టం జగదభిరక్షితుం జగాద ॥

సాటిలేనివారైన తిరుక్కోట్టియూర్ నంబి దగ్గరకు శ్రీరామానుజులు 18 పర్యాయాలు వెళ్ళారు. చివరగా వారివల్ల భగవద్గీతలోని చరమశ్లోకంలో గల రహస్యార్థాలను పొందారు. వానిని అన్నిటిని జగత్తు అంతా రక్షింపబడాలని అందరికీ చెప్పారు.

**3.** త్వన్నామ్నా భువి హరిదర్శనం ప్రతీతం
తద్భూయాదితి వర మేత్య గోష్ఠిపూర్ణాత్ ।
శ్రీరామానుజవిబుధ స్సుతం తదీయం
శిష్యత్వం పునరవధాతధీ రనైషీత్ ॥



(శ్రీరామానుజుల ఆ ఔదార్యానికి మెచ్చి గోష్ఠీపూర్ణులు) "ఈ నాటినుండి ఈ లోకంలో శ్రీవైష్ణవదర్శనం మీపేరుతో భగవద్రామానుజ దర్శనంగా ప్రసిద్ధి పొందగలదు." అనే వరాన్ని శ్రీరామానుజులకు ఇచ్చారు. బుద్ధిమంతులైన ఆ రామానుజులు గోష్ఠీపూర్ణుల కుమారులను తమ శిష్యులుగా చేసికొన్నారు.

ఈ విధమైన వరాన్ని శ్రీరంగనాథుడు ఇచ్చినట్టుగా మిగిలిన గ్రంథాలలో తెలుపబడింది. "ఎమ్బెరుమానార్ దరిశనమెన్టే యిదుక్కు నమ్బెరుమాళ్ పేరిట్టు నాట్టివైత్తార్, అమ్బువియోర్ ఇన్ద ద్దరిశనత్తై ఎమ్బెరుమానార్ వళర్త్త అన్ద చ్చెయల్ అఱికైక్కా" (ఈ సిద్ధాంతాన్ని రామానుజులు అభివృద్ధి చేసిన విషయాన్ని అందమైన ఈ భూమిలో ఉండేవారంతా తెలిసికొనేటట్లుగా శ్రీరంగనాథుడు ఈ సిద్ధాంతానికి శ్రీరామానుజ సిద్ధాంతమనే పేరును పెట్టారు) అని ఈవిషయాన్ని శ్రీవరవరమునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో ప్రస్తావించారు.

**4.** శ్రీమాలాధరవిదుష స్స దివ్యసూరి-
ప్రోక్తద్రామిడనిగమోక్త మర్థ మాప ।
తద్గానక్రమమపి రఙ్గిగాయకార్యా-
చ్ఛ్రీరామాయణగదితం వృషాద్రిపూర్ణాత్ ॥

తిరుమాలైయాణ్డాన్ అనే విద్వాంసులవద్ద శ్రీరామానుజులు దివ్యసూరులు అనుగ్రహించిన ద్రావిడవేదం యొక్క అర్థాన్ని గ్రహించారు. తిరువరంగప్పెరుమాళ్ అరైయర్‌వద్ద ఆ ప్రబంధాన్ని గానం చేసే క్రమాన్ని నేర్చారు. తిరుమలైనంబి వద్దనుండి శ్రీరామాయణ రహస్యార్థాలను పొందారు.

తిరుమాలైయాణ్డాన్‌వద్ద ద్రావిడవేదార్థాలను గ్రహించేటపుడు కొన్ని పాశురాలకు శ్రీరామానుజులు అపూర్వార్థాలను తెలుపడం, వానిని మెచ్చని తిరుమాలైయాణ్డాన్ శ్రీరామానుజులపై కోపించి కాలక్షేపాన్ని నిలిపివేయడం,

తరువాత కొంతకాలానికి గోష్ఠీపూర్ణుల ప్రోద్బలంతో ఆణ్డాన్ మళ్ళీ కాలక్షేపాన్ని తిరిగి ప్రారంభించి, పూర్తి చేయడం - అనే సందర్భం ప్రసిద్ధం. దీనిని కవి 66వ శ్లోకంలో ప్రస్తావించడం గమనించవచ్చు. ఈ సందర్భంలో శ్రీరామానుజుల విద్యాభ్యాసం సాందీపిని మహర్షివద్ద శ్రీకృష్ణునివద్ద నేర్వడం వంటిదని పల్కిన మాటను కవి వరదరాజస్వామి తిరుక్కచ్చినంబితో పల్కినట్లుగా తెల్పిన ప్రకారం ఇంతకు ముందే ప్రస్తావింపబడింది.

భగవద్రామానుజులు ఈ విధంగా పలువురు ఆచార్యులవద్ద రహస్యార్థాలను శ్రవణం చేయడంలో కారణమేమి? అనే విషయాన్ని సమాధానాన్ని గురుపరంపరాప్రబావం ఈ విధంగా వివరించింది- "పెరియనంబి శ్రీపాదత్తిలే ఆశ్రయిత్తపోదే స్వరూపసిద్ధి యుణ్డాయిరుక్క, ఇవర్, పలర్ శ్రీపాదత్తిలుమ్ ఉపదేశమ్ కేట్ప్కెక్కు అడి ఎన్? అవర్కళ్ తామ్ మేల్విఴున్ద అర్థఙ్గళై ఉపదేశిక్కైక్కు అడి ఎన్? ఎన్నిల్ - ఒరు రాజా, స్వకుమారార్థ మాక ప్పలమంత్రికళిడత్తే నిధికళై వైత్తు, త్తన్ కుమారన్ బుద్ధనానవాతే కొడుక్కచ్చొల్లి ప్పోమాపోలే, ఆళవన్దారుమ్ ఇవర్కళిడఙ్గళిలే ఒవ్వొరు అర్థవిశేషత్తై ఉపదేశిత్తు వైక్కైయాలే. ఆళవన్దార్ శ్రీపాదత్తిలే సేవిత్తు అవ్వర్థఙ్గళై ప్పెఱాద ఇఴవుతీర ఇవర్కళ్ పక్కల్ అవ్వర్థఙ్గళై ప్పెఱ్ఱు ఇఴవు తీర్న్దారిత్తనై. ఇని, ఇవ్వాచార్యర్కళుక్కు, ఆళవన్దార్, ఇళైయాఴ్వారై "ఆమ్ ముదల్వన్" ఎన్ఱు కటాక్షిత్తు, "నామ్ ఉఙ్గళుక్కు చ్చొల్లుమ్ పరమరహస్యత్తై ఇళైయాఴ్వారుక్కు చ్చొల్లుఙ్గోళ్" ఎన్ఱు నియమిత్తరుళుకైయాలే. శిష్యనాకిలుమామ్, ఆచార్యనాకిలుమామ్, విలక్షణసంబంధమే వేణ్డువదు- ఎన్ఱు మేల్ విఴున్ద ఉపదేశిత్తార్కళ్. ఆకైయాలే మున్బుళ్ళ ఆచార్యర్కళ్ ఇవర్క్కు ఆచార్యరాయ్ వీఱు పెఱ్ఱార్కళ్. పిన్బుళ్ళ ఆచార్యర్కళ్ ఇవర్క్కు శిష్యర్కళాయ్ స్వరూపమ్ పెఱ్ఱార్కళ్. ఒరు హారత్తిన్ నడువే నడువే మాణిక్కమ్ కిడన్ద అన్ద హారత్తై శోభితమాక్కుమాప్పోలే, "ఇడైయే ఇరామానుశ మునియాయ్" విళఙ్గినారితే" (పెరియనంబి శ్రీచరణాలలో ఆశ్రయించినపుడే



స్వరూపసిద్ధి కల్గినపుడు, ఇక, శ్రీరామానుజులు పలువురి శ్రీపాదాలలో ఉపదేశాన్ని శ్రవణం చేయడానికి ఏమి హేతువు? అని అంటే, ఒక ప్రభువు, తన కుమారునికోసం పలువురు మంత్రులవద్ద నిధులను నిక్షిప్తం చేసి, తన కుమారుడు పెద్దవాడు అయినపుడు వానిని అందించమని చెప్పి, వెళ్ళిపోయినట్లుగా, ఆళవందార్, తమ శిష్యులు పలువురి వద్ద ఒక్కొక్క అర్థవిశేషాన్ని ఉపదేశించారు కనుక, ఆళవందార్ శ్రీపాదాలలో సేవించి, ఆ అర్థాలను పొంద లేని లోటు తీరేటట్లుగా, వీరివద్ద ఆ అర్థాలను పొంది, ఆ లోటును తీర్చుకొన్నారు. ఇంతేకాక, ఈ ఆచార్యులతో ఆళవందార్ శ్రీరామానుజులను "ఆమ్ ముదల్వన్" (సిద్ధాంతనిర్వాహకులు కాగలరు) అని కటాక్షించి, "మేము మీకు చెప్పే ఈ పరమరహస్యాలను శ్రీరామానుజులకు ఉపదేశించండి" అని నియమించినందున, శిష్యుడైనా సరే, ఆచార్యుడైనా సరే, ఏదో ఒక విలక్షణ సంబంధమే కావాలి- అని ఆదరంతో ఉపదేశించారు. అందువల్ల ముందున్న ఆచార్యులు వీరికి ఆచార్యులై గౌరవాన్ని పొందారు. తరువాత వారు వీరికి శిష్యులై స్వరూపాన్ని పొందారు. ఒక హారంమధ్యలో మాణిక్యం పొదగబడితే, ఆ హారానికి అది శోభను కల్గించేటట్లే, ఆచార్యహారం మధ్యలో శ్రీరామానుజులు నాయక మణిగా ప్రకాశిస్తున్నారు)

5. శ్రీగాతృప్రముఖసమస్తశిష్యవర్గే
న్యస్తార్థాన భజత యామునేయతీర్థైః ।
స్వచ్ఛాత్రానపి విరచయ్య తత్తనూజాన్
సోజ్ఞాసీత్ స్తుతిమణిముఖ్య తత్ప్రబన్ధాన్ ॥

శ్రీయామునులు అపూర్వార్థాలను కొన్నిటిని తిరువరంగ ప్పెరుమాళ్ అరైయర్ మొదలైన శిష్యుల వద్ద నిక్షిప్తం చేయగా వానిని శ్రీరామానుజుల ఆ యామునుల శిష్యులవద్ద నుండి పొందారు. వారి పుత్రులను అందఱిని తమ శిష్యులుగా చేసికొన్నారు. ఈ విధంగా శ్రీరామానుజులు శ్రీయామునుల స్తోత్రరత్నం మొదలైన ప్రబంధాలను పొందారు.

6. ఆయాతో యతి రమరాపగోపకణ్ఠాత్
కారుణ్యాకర ఇతి కశ్చిదేకదణ్డీ ।
శ్రీరఙ్గం పరిచితశాస్త్రపఙ్క్తిరేత్య
శ్రీరామానుజగురు మాహ వాదమీప్సుః ॥

ఒకనాడు, గంగానదీతీరవాసి అయిన కారుణ్యాకరులనే (యజ్ఞమూర్తి) పేరు గల అద్వైతి సన్న్యాసి ఒకరు శ్రీరంగానికి వచ్చారు. సర్వశాస్త్రజ్ఞుడైన అతడు శ్రీరామానుజులతో వాదించాడనే ఉద్దేశ్యంతో వచ్చాడు.

ప్రపన్నామృతం, గురుపరంపరాప్రభావం మొదలైన గ్రంథాలలో వీరి పేరు యజ్ఞమూర్తిగా పేర్కొనబడింది. **"యజ్ఞమూర్తి ఎన్గిఱ మహావిద్వాన్ ఒరు బ్రాహ్మణన్ గంగాతీరత్తుక్కు ప్పోయ్ అఙ్గు స్నానమ్ పణ్ణి, అఙ్గుళ్ళ విద్వాన్కళై జయిత్తు, అఙ్గే మాయావాదసన్నాసాశ్రమత్తైయుమ్ పరిగ్రహిత్తు... ఉడైయవరుడైయ వైభవత్తై క్కేట్టు "నామ్ అఙ్గేఅప్పోయ్ అవరుడనే తర్క్కిక్క వేణుమ్"** అని ఈరీతిలో గంగాస్నానానికి పోయి అక్కడి విద్వాంసులను జయించి, అద్వైత సన్న్యాసాన్ని స్వీకరించి, శ్రీరామానుజులతో శ్రీరంగానికి వచ్చినట్లు తెలుపబడింది. ప్రపన్నామృతం కూడా ఈ విధంగానే పేర్కొన్నది తప్ప ఎక్కడ నుండి గంగాతీరానికి వెళ్ళాడో స్పష్టం చేయలేదు. (కాంచీ ప్రాంతవాసి అని కొందఱు, తిరుపతి ప్రాంతవాసి అని కొందఱు పల్కినా, దేనికీ ఏవిధమైన స్పష్టమైన ఆధారాలు కన్పించవు) ప్రకృత గ్రంథంలోని **"కారుణ్యాకర"** నామం **"అరుళాళప్పెరుమాళ్"** అనే ద్రావిడ పదానికి సంస్కృతీకరణ కరణం. **"తిరుమలైయాణ్డాన్"** అనే పేరును **"మాలాధరు"** అని సంస్కృతీకరించడంవంటిదే ఇదికూడా.

7. శిష్య స్స్యాదపజయభాగితి ప్రతిజ్ఞా-
ముద్బాహూజ్జ్వల నృహరేః పురో విధాయ ।
అన్యోన్యం విరచయతో స్తయో ర్వివాదం
తత్రాష్టాధికనవవాసరా వ్యతీయుః ॥



వాదంలో ఎవరు ఓడిపోతారో, వారు, గెలిచినవారికి శిష్యుడు కావాలి- అనే ప్రతిజ్ఞను శ్రీరంగాలయంలో ఉద్బాహువుగా వేంచేసి ఉండే ఉజ్జ్వలనృసింహస్వామి ఆలయం ఎదురుగా చేసి, వారిద్దరు నియమ పూర్వకంగా శాస్త్రార్థవాదాన్ని పదిహేడు దినాలపాటు సాగించారు.

8. జాతేష్టాదశదివసే హరే ర్విషణ్ణః
స్వప్నే కామపి జయహేతు మేత్య యుక్తిమ్ ।
తం రామానుజసుమతి ర్నిరాకృతాగ్నిః
మార్తాణ్డాద్రుచి మివ నైశ మన్ధకారమ్ ॥

పద్దెనిమిదవనాడు వాదించవలసి రాగా, స్వప్నంలో వరదరాజస్వామి వల్ల శ్రీరామానుజులు వాదాన్ని జయించడానికి తగిన యుక్తిని పొందిన తేజస్సులో అగ్నిని మించినవారైన, ధీమంతులైన శ్రీరామానుజులు, సూర్యునివల్ల రాత్రిలోని అంధకారాన్నివలె, ఆ ప్రతివాదిని జయించారు.

యజ్ఞమూర్తిని రామానుజులు క్రీ.శ.1069వ సం॥లో జయించారు.

9. తద్యుక్త్యా హితమతి రుజ్ఝితైకదణ్డః
సన్యస్తః పునరుపనీతవాంస్త్రిదణ్డీ।
ఛాత్రో లక్ష్మణయమినోభవ త్స చ స్వ-
చ్ఛాత్రాణా మకృత తమాత్మనిర్విశేషమ్ ॥

ఆ యుక్తివల్ల ఆ అద్వైతసన్న్యాసి పరాజితుడై తన దండాన్ని వదలిపెట్టాడు. శ్రీరామానుజుల వద్ద మళ్ళీ యజ్ఞోపవీత సంస్కారాన్ని పొందాడు. త్రిదండి అయ్యాడు. శ్రీరామానుజుల కతడు శిష్యుడయ్యాడు. శ్రీరామానుజులు అతనిని ఆత్మనిర్విశేషంగా భావించి తన శిష్యులతో ఒక శిష్యునిగా పరిగ్రహించారు.

ఇక్కడ **"ఆత్మనిర్విశేషమ్"** అనే పదప్రయోగం ద్వారా - తనతో సమానంగా అభిమానించి, గౌరవించారనే అర్థంతో పాటు, తమ నామమైన

**"ఎమ్బెరుమానార్"** అనే పేరును అతనికి పెట్టారనే అర్థంకూడా ధ్వనించడం గమనించాలి. శ్రీరామానుజులు యజ్ఞమూర్తిని జయించినపుడు అతనికి మళ్ళీ సంస్కారాలన్నిటిని చేశారు. అపుడు వరదరాజస్వామి అనుగ్రహం వల్ల తాము అతనిని జయించినదానికి గుర్తుగా ఆ స్వామి పేరును, తమ శిష్యులు కనుక తమ నామాన్ని కలిపి **"అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్"** అనే పేరును పెట్టినట్లు చరిత్ర ప్రసిద్ధి. **"గరీయాన్ బ్రహ్మదః పితా"** అనేరీతిలో ఆచార్యులు తండ్రివంటివాడే కనుక, శిష్యుడు **"ఆత్మా వై పుత్రనామాసి"** అనేటట్లు పుత్రుడే. **"ఉపవీతినమ్, త్రిదండహస్తమ్, శిఖయా శేఖరిణమ్"** అనే విధంగా యజ్ఞోపవీతం, త్రిదండం, శిఖ- అనేవి శ్రీవైష్ణవయతి చిహ్నాలు కదా! **"తాపాదిపంచసంస్కారాన్ కృత్వా లక్షణదేశికః, ఉపవీతం త్రిదండం చ, పాత్రం జలపవిత్రకమ్, కౌపీనం కటిసూత్రం చ న త్యాజ్యం యావదాయుషమ్, తం యజ్ఞమూర్తి మిత్యుక్త్వా"** ఇత్యాదిగా ప్రపన్నామృతంలో ఈవిషయం తెలుపబడింది.

**10.** **విష్ణ్వర్చాకృతమవనోత్సుకో జనానాం**
**శ్రీగీతావివరణభాష్యదీపసారాన్ ।**
**తద్గద్యత్రయ మకృత ప్రపన్ననిత్యా-**
**నుష్ఠాన క్రమమపి యోగిరాట్ప్రబన్ధాన్ ॥**

లోకంలోని వారిని రక్షించాలనే ఉద్దేశ్యంతో శ్రీరామానుజ యోగీంద్రులు గీతాభాష్యం, శ్రీభాష్యం, వేదాంతదీపం, వేదాంతసారం, గద్యత్రయం, విష్ణువు అర్చామూర్తుల ఆరాధనను ఉద్దేశించి రచించిన ప్రపన్ననిత్యానుష్ఠానక్రమ మనే నిత్యగ్రంథం - అనే ఈ తొమ్మిది గ్రంథాలను అనుగ్రహించారు.

శ్రీరామానుజులు శ్రీభాష్యాన్ని తప్ప మిగిలిన ఎనిమిది గ్రంథాల రచనను దిగ్విజయ యాత్రకు ముందే క్రీ.శ. 1057 సంవత్సర ప్రాంతానికి పూర్తిచేశారని చారిత్రకుల అభిప్రాయం.

**11.** **ఆశాన్తేష్వపి విహితా స్పదా న్విజేతుం**
**మోహాన్ధా నమలమతిః కుదృష్టిబాహ్యాన్ ।**



**నిశ్శైస్తై ర్యతిపతిరావృత స్స్వశిష్యైః**
**నక్షత్రైరివ హిమదీధితిః ప్రతస్థే ॥**

దిగంతాల వరకు వ్యాపించిన, అజ్ఞానమనే మోహంతో అంధులైన కుదృష్టులను, బాహ్యమతస్థులను స్వచ్ఛమైన జ్ఞానాన్ని కల శ్రీరామానుజ యతిపతి జయించగోరి, శిష్యులందఱితో కలసి, నక్షత్రాలతో కూడిన చంద్రునివలె, బయలుదేరారు.

కుదృష్టులంటే- వేదాలను ప్రమాణంగా అంగీకరించినా, వేదానికి అపార్థాన్ని పలికేవారు. బాహ్యులంటే- వేదాలను ప్రమాణంగా అంగీకరించని బౌద్ధజైనాదులు.

**12.** **జిత్వా స ప్రతిదిశ మున్మదాన్ ప్రవాచః**
**స్వచ్ఛాత్రానపి ధరణీపతీన్విధాయ ।**
**నిక్షిప్యాఖిలహరిధామసు స్వశిష్యాన్**
**పర్యాటత్ క్షితివలయం ప్రదక్షిణేన ॥**

శ్రీరామానుజులు మదోన్మత్తులైన, విరుద్ధవాదాలను చేసేవారిని అందఱిని జయించి, ఆయా ప్రాంతాలలో ఉండే ప్రభువులను తమకు శిష్యులుగా చేసికొని, విష్ణ్వాలయాలన్నిటిలో తమ శిష్యులనకు సేవకులుగా నియమించి, భూమండలాన్ని అంతటిని ప్రదక్షిణం చేస్తూ పర్యటించారు.

శ్రీరామానుజుల దిగ్విజయయాత్ర క్రీ.శ.1096వ సం॥లో ప్రారంభ మైనదని, అంతకుముందే, అంటే క్రీ.శ. 1078వ సం॥లోనే వారు మేల్కోటకు వెళ్ళడం జరిగిందని శ్రీ ఏ. కృష్ణమాచార్యులు అభిప్రాయపడ్డారు.

**13.** **పీఠం స ప్రథితమవాస శారదాయా**
**వాణీ తం కృతవినతి ర్విలోక్య తత్ర ।**
**స్వం వేశ్మాప్యమల మదర్శయచ్చ తస్మై**
**గృహ్ణీష్వాఖిలషితపుస్త మిత్యభాణీత్ ॥**

ఆ విధంగా శ్రీరామానుజులు పర్యటించేటపుడు, కాశ్మీరదేశంలోని సుప్రసిద్ధమైన శారదాపీఠాన్ని చేరారు. సరస్వతి, శ్రీరామానుజులకు నమస్కరించి, వారికి తన స్వచ్ఛమైన భవనాన్ని (పుస్తకభాండారాన్ని) చూపించింది. ఆ పుస్తక భాండాగారంలో వారికి కావలసిన ఏగ్రంథమైనా తీసికొనవచ్చునని అన్నది.

**14.** అప్రాక్షీదితి విహితాదరాం స వాణీం
త్వం భక్తిం కిమితి మయీదృశా మకార్షీః ।
ఇత్యేవం యతిపతినాదరేణ పృష్టా
సావాదీచ్ఛ్రుతిమధురం వచ స్సహేతు ॥

అపుడు శ్రీరామానుజులు సరస్వతీదేవిని చూచి "నా విషయంలో నీవింతటిప్రేమను చూపిస్తున్నావేమి? అని ఆదరంగా ప్రశ్నించగా, అపుడు సరస్వతీదేవి చెవుల కింపుగా సహేతుకమైన ఈ వచనాన్ని పల్కింది.

**15.** కప్యాసం వచనమభాణి శఙ్కరేణ
త్రయ్యన్తే కపిగుద మిత్యయుక్తవాచ్యమ్ ।
అద్య త్వం కమలవదిత్యనన్యథార్థం
యద్వ్యాఖ్య స్తదపి మమాసి పూజనీయః ॥

"వేదాంతంలోని కప్యాసశబ్దానికి శంకరులు కపిగుదమనే అవాచ్యమైన అశ్లీలార్థాన్ని చెప్పారు. కాని మీరిపుడు కప్యాసపదానికి కమలమనే యుక్తమైన అర్థాన్ని చెప్పారు. ఇందువల్ల మీరు నాకు అత్యంత పూజనీయులు."

**16.** ఇత్యుక్త్వా నిగమశిఖార్థసఙ్గ్రహాఖ్యాం
విన్యస్తాం కృతిమురరీక్రియార్థమస్య ।
వాగ్దేవీ కుమతినిరాసనం స్వమూర్ధ్నా
దామేవాధిత విదుషాం ముదా సమక్షమ్ ॥

ఈ విధంగా పల్కి, శ్రీరామానుజులచే రచింపబడిన వేదార్థ సంగ్రహమనే గ్రంథాన్ని ఆదరంగా స్వీకరించి, సరస్వతీదేవి కుమతుల నిరాసం



అయేటట్లుగా, తన శిరస్సుపై ఆ గ్రంథాన్ని, ఒక పూలమాలికను వలె, పండితులందఱి సమక్షంలో ఆనందంతో ధరించింది.

ఇక్కడ ప్రస్తావనీయాలైన అంశాలు ఒకటి రెండున్నాయి. గురుపరంపరా ప్రభావాది గ్రంథాలలో సరస్వతీదేవి తనవద్దకు వచ్చిన శ్రీరామానుజులను కప్యాసశ్రుతిని వ్యాఖ్యానించమని అడిగి, వారు చేసిన సరసమైన వివరణకు ఆనందించి, వారు రచించిన శ్రీభాష్యాన్ని మెచ్చి స్వీకరించి, వారికి భాష్యకార బిరుదాన్ని ఇస్తూ, హయగ్రీవుల అర్చామూర్తిని బహూకరించినట్లు తెలుపబడింది. ప్రకృతంలో కాశ్మీరంలోని శారదాపీఠంలో శ్రీరామానుజులు సమర్పించిన వేదార్థసంగ్రహగ్రంథాన్ని సరస్వతి శిరసావహించినట్లు తెలుపబడింది. వాస్తవానికి ఇదే సమంసజంగా తోస్తుంది. ఎందుకంటే, శ్రీరామానుజులు దిగ్విజయ యాత్ర చేసిన సమయానికి శ్రీభాష్యమహా గ్రంథరచన పూర్తి కాలేదనే చెప్పాలి. శ్రీభాష్యరచన పరిసమాప్తి 1115 సంవత్సరానికి అయినదని చారిత్రక పరిశోధకుల అభిప్రాయం. అంతకు ముందే కదా దిగ్విజయ యాత్ర జరిగింది. అంతేకాక, కిడాంబి ఆచ్చాన్ తనియన్‌లోని **"శ్రీభాష్యం దర్శయిత్వా యతిపతిరచితం శారదాయై నివృత్త్య"** అనే సూక్తిద్వారా శ్రీభాష్యాన్ని శారదాపీఠంలో శ్రీరామానుజులు కిడాంబి ఆచ్చాన్‌ద్వారా దర్శింపజేశారనే విషయం స్పష్టపడుతున్నందున దిగ్విజయ యాత్రా సమయానికి శ్రీభాష్యం పూర్తిగా రూపాన్ని సంతరించుకోలేదని చెప్పాలి.

ప్రకృతగ్రంథంలోకూడా **"జీవాతుం కుమతిభుజంగదంశ ముహ్యద్వే దానా మకృత ముముక్షుభాగధేయమ్, సద్వైపాయన శుకముఖ్యభావగర్భం శ్రీబోధాయనఫణితి క్రమేణ భాష్యమ్"** అని (50వ శ్లోకంలో) చెప్పబడినందున దిగ్విజయయాత్రానంతరమే శ్రీభాష్యం పూర్తి అయినట్లు తెలుస్తున్నది. శ్రీభాష్యగ్రంథలేఖనాన్ని కూరేశులే కాక, వారి తరువాత, ఎఙ్గళాళ్వాన్‌కూడా చేశారని, అందువల్లనే- విష్ణుచిత్తులకు కూరేశులకు వలె ఆళ్వాన్ అనేపేరు ఏర్పడిందనే అభియుక్తోక్తి కూడా స్మరణీయం.

రామానుజులు తమ 65వ సంవత్సరం నుండి 79వ సంవత్సరం మధ్యలో శ్రీభాష్యంలోని మూడువంతుల భాగాన్ని రచించారని, మిగిలిన భాగాన్ని తిరునారాయణపురం నుండి తిరిగి వచ్చిన తరువాత పూర్తి చేశారని చారిత్రకుల అభిప్రాయం. తిరునారాయణపురం రామానుజులు తిరిగి వచ్చే సమయానికి కూరేశులు దృష్టిని కోల్పోయినందున, శ్రీభాష్యంలోని చివరి భాగాన్ని శ్రీవిష్ణుచిత్తార్యులు లిఖించారని కూడా వారి అభిప్రాయం.

వీనిని అన్నిటిని బట్టి చూస్తే మొదట శ్రీరామానుజులు కాశ్మీరంలోని సరస్వతీపీఠాన్ని దర్శించిన సమయానికి శ్రీభాష్యం సమగ్రంగా రచింపబడలేదని, తరువాతనే దాని రచన పూర్తి అయినదని చెప్పవచ్చు. భాష్యకార బిరుదం, వారు కప్యాస శ్రుతికి చేసిన అందమైన వివరణానికి సరస్వతీదేవి సమర్పించిందని భావించడంలో అడ్డులేదు కప్యాసశ్రుతి వివరణం శ్రీభాష్యంలోనేకాక వేదార్థసంగ్రహంలో కూడా కన్పిస్తున్నది.

ఇక, శ్రీరామానుజవైభవమనే ద్రావిడగ్రంథంలో ఒక ఆసక్తికరమైన వృత్తాంతం వర్ణింపబడింది. శ్రీరామానుజులు కాశ్మీరంలో సరస్వతీదేవిని దర్శించి, ఆమె చేతులలో తాము రచించిన శ్రీభాష్యగ్రంథాన్ని పెట్టి, "ఇది సరిగా ఉందని నీకు తోస్తే స్వీకరించు, లేకపోతే తిరస్కరించు. మఱునాడు వచ్చి చూస్తాను'' అని పండితుల సమక్షంలో పల్కి వెళ్ళిపోయారు. అక్కడ ఉండే ఇతర మతాలకు చెందిన పండితులు, శ్రీరామానుజులను వాదంలో గెల్వడం సాధ్యం కాని పని అని, శ్రీరామానుజుల శ్రీభాష్యాన్ని సరస్వతి తప్పక స్వీకరిస్తుందని, అదే జరిగితే ఇక తమ పరువు నిలువదని భయపడి ఆ రాత్రి శ్రీభాష్య గ్రంథానికి నిప్పుపెట్టారు. వారు వెళ్ళిపోయిన తరువాత సరస్వతి అగ్నిదేవుని వద్దనుండి ఆ గ్రంథాన్ని గ్రహించి, తన కేశపాశంలో పెట్టుకొని దాచింది. మఱునాడు అందఱు సరస్వతి ఆలయానికి వచ్చి చూడగా శ్రీభాష్యగ్రంథం కన్పించలేదు. అపుడందఱు సరస్వతి శ్రీభాష్యాన్ని తిరస్కరించిందని వాదించగా, శ్రీరామానుజులు జరిగిన సంగతిని గ్రహించి, సరస్వతి కేశపాశంలో వెదకి చూడవలసినదని అన్నారు. అర్చకులు ఆ విధంగా చేయగా, గ్రంథం బయట పడింది. సరస్వతీదేవి అందఱికి శ్రీరామానుజ వైభవాన్ని తెల్పింది. ఈ వృత్తాంతం అపూర్వమైనది. వేఱు ఏ గ్రంథంలోను కన్పించదు. ఇందులో భాష్యకారబిరుదాన్ని ఇచ్చిన ప్రసక్తి కూడా కానరాదు.

ఇక 'కప్యాసశ్రుతికి శ్రీరామానుజులు చేసిన సరసమైన వివరణం సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నది. **"కపి స్స్యాదిత్యః కం పిబతి కిరణై రిత్యపి కపిః, బభస్తీత్యామ్నాత స్స కపి రమునాస్తం యతి హ తత్, ప్రతీమః కప్యాసం దివసకరతేజో వికసితం జగుః పద్మం శ్రీమత్త్వాదగణి భగవచ్చక్షురుపమా"** అనే అందమైన శ్లోకంలో వాత్స్యవరదులనే నడాదూర్ అమ్మాళ్ అనుగ్రహించారు. (నీటిని కిరణాలతో తాగుతున్నాడు- అనే వ్యుత్పత్తి చేత సూర్యుడు కపిశబ్దవాచ్యుడు. **"కపిర్భభస్తి తేజనమ్"** అనే ఆరణ్యకవాక్యంలో కపిశబ్దవాచ్యుడు సూర్యుడని చెప్పబడింది. అందువల్ల ఈ కపిచేత వికసింపజేయబడే పద్మం కప్యాస మనబడుతున్నది. సూర్యుని తేజస్సుతో వికసించే ఆ పద్మం విశేషమైన కాంతిని కల్గినది అయినందున భగవంతుని నేత్రాలకు ఉపమానమైనది) అని, **"కముదక మిహప్యాసో యస్యాసనం యది వోద్భవః, కవిభి రుదితం కప్యాసం తద్గభీరజలోదయత్, శిశిరమధురం శ్రీమద్దామోదరాక్షినిదర్శనం, భవతి నళినం లుప్తాకారస్త్వపిః పిహితాదివత్"** (కమ్- అంటే - జలం. ఈ నీటిలో నివాసం ఉండేది, లేక, ఉదయించేది అయిన కమలం నిండైన నీటిలో పుట్టినదై కప్యాసమని అనబడుతున్నది. అందువల్ల చల్లని అందమైన గొప్ప శోభను కల కమలం భగవంతుని నేత్రాలకు ఉపమానవుతున్నది) అని, **"నాళం కపి ర్భవతి కం పిబతీతి తస్మిన్, యస్యాస ఆసన ముశంతి మనీషిణ స్తత్, కప్యాస ముజ్జ్వల ముదార మిదం సరోజమ్, చక్షుర్నిదర్శన ముదీరిత మీశ్వరస్య"** ("కం పిబతి" అనే వ్యుత్పత్తిద్వారా జలాన్ని పీల్చే తామరపూవుకాడ కపి అనబడుతున్నది. అటువంటి బలమైన కమలం భగవంతుని నేత్రాలకు ఉపమానంగా చెప్పబడింది) అనే నడాదూర్ అమ్మాళ్ శ్లోకాలు కూడా స్మరణీయాలు. శ్రీరామానుజులు కప్యాసశ్రుతికి

ఈమూడు అందమైన అర్థాలను **"గంభీరాంభః సముద్భూత -సుమృష్టనాళ -రవికరవికసిత పుండరీకదళా మలాయతేక్షణః"** అనే గంభీరమైన వివరణతో వేదార్థ సంగ్రహంలో తెలిపారు. మిగిలిన కప్యాసశబ్దానికి చెప్పబడిన "సూర్య మండలం, హృదయకమలం, మర్కటపృష్ఠమనే మఱోమూడు అర్థాలలో భాసించే దోషాల కారణంగా వాటిని శ్రీరామానుజులు విడచారు. మొదటి మూడు అర్థాలను శ్రీరామానుజులు పరిగ్రహించడానికి (మిగిలిన మూడిటిని విడువడానికి) ఆళ్వార్లు తమ దివ్యప్రబంధపాశురాలలో వ్యక్తం చేయడమేననే విషయం వివరణసాపేక్షం కనుక విస్తరభీతివల్ల ఇక్కడ ప్రస్తావింపబడడంలేదు.

**17. శ్రీబోధాయనకృతవేదమాలివృత్తిం**
**సఙ్గృహ్యాపహతతమస్యవాదిగర్వః ।**
**తత్రైత్యైర్నృపతిభి రఞ్చిత స్స్వశిష్యైః**
**సన్తుష్ట స్స నిరగమ త్తతో యతీన్ద్ర ॥**

ఆ పుస్తకభాండాగారంలోని బోధాయనవృత్తిగ్రంథాన్ని శ్రీరామానుజులు తీసికొన్నారు. అక్కడి వేదవిరుద్ధ వాదాలను చేసేవారి గర్వాన్ని జయించి, అక్కడి ప్రభువులచే గౌరవింపబడ్డారు. అక్కడనుండి యతీంద్రులు తమ శిష్యులతో పాటు బయలుదేరారు.

**18. తత్రత్యాననుసరతో నివర్త్య భూపాన్**
**ఉత్తీర్య త్రిదశనదీం జగత్పతిం సః ।**
**సంసేవ్య శ్రితపురుషోత్తమం తదీయాన్**
**దుర్వృత్తానపి న శశాస తన్నిదేశాత్ ॥**

ఆయా ప్రాంతాలలోని ప్రభువులు తమపట్ల గౌరవం వల్ల తమను అనుసరిస్తూ రాగా, వారిని శ్రీరామానుజులు వెనక్కి పంపారు. గంగానదిని దాటిన ఆ జగదాచార్యులు జగన్నాథక్షేత్రాన్ని చేరి, అక్కడ పురుషోత్తమ భగవానుని దర్శించారు. అక్కడ దేవాలయంలోని సేవకుల దుర్వృత్తాలను సంస్కరించాలని భావించినా, అచటి పురుషోత్తమ భగవానుని ఆజ్ఞకారణంగా అది సాధ్యం కాలేదు.



**19. నిక్షిప్తో నిశి పురుషోత్తమాధిపేన**
**శ్రీకూర్మాలయకుహరే స శమ్భుబిమ్బే ।**
**లబ్ధశ్రీవిశదమృదుద్ధృతేశలిఙ్గ -**
**శ్రీకూర్మం ప్రకటయతి స్మ లక్ష్మణార్యః ॥**

పురుషోత్తమ భగవానుడు ఒక రాత్రివేళ శ్రీరామానుజులను శ్రీకూర్మ క్షేత్రానికి తీసికొనిపోయి విడచాడు. అక్కడ శ్రీరామానుజులు తిరుమణ్ను సంపాదించడం కోసం అక్కడ ఉండే శివలింగాన్ని ఎత్తగా, అక్కడ వారికి శ్వేతమృత్తిక లభించింది. అంతేకాక, ఆ ప్రయత్నంలో శివలింగం కింద నిక్షిప్తమై ఉండే శ్రీకూర్మనాథుని మూర్తి వ్యక్తం కాగా, దానిని శ్రీరామానుజులు అందటికి తెలిసేటట్లు చేసి, ఆక్షేత్రం వైష్ణవక్షేత్రమని నిరూపించారు.

**20. సింహాద్రౌ విరచితఖేలవం నృసింహం**
**నత్వాహోబిలనరసింహ మప్యుపాస్య ।**
**సంగాయత్సురతరుణీజనాభిరామం**
**సమ్ప్రాపద్యతిపతి రఞ్జనాద్రిమూలమ్ ॥**

సింహాచలంలో తన లీలను ప్రదర్శించిన నృసింహస్వామిని సేవించి, అహోబిలంలోని నృసింహుని కూడా ఉపాసించి, స్వామిని గానం చేసే దేవకాంతలతో అందమైన వేంకటాచలం దగ్గరకు వెళ్ళారు.

**"నీలార్కణ్డత్తమ్మానుమ్ నిఱై నాన్మకను మిన్దిరనుమ్ శేలేయ్ కణ్ణార్ పలర్ శూழ் విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే".** అనే నమ్మాళ్వార్లసూక్తి ప్రకృతంలో భావ్యం. ఇందులో దేవకాంతలు కూడా శ్రీవేంకటేశ్వరుని సేవిస్తున్నారని తెలుపబడినది కదా!

**21. దృష్ట్వా తం విస్మరమోదబాష్పధారా-**
**పూర్ణాక్ష స్ఫురదతిసీమరోమహర్షః ।**

ఆనన్దోదధి మవగాఢవా నివాసా -
వానంసీ దహిపతిరూప మద్రిరాజమ్ ॥

ఆ వేంకటాద్రిని దర్శించిన శ్రీరామానుజుల నేత్రాలలో ఆనందాశ్రువులు ధారలుగా స్రవించాయి. గొప్ప ఆనందం వల్ల రోమాంచం కల్గింది. అగాధమైన ఆనందసముద్రంలో నిరంతరం మునిగినవారివలె అయ్యారు. తరువాత ఆదిశేషస్వరూపమైన ఆ పర్వతానికి సాష్టాంగంగా నమస్కరించారు.

"ఆనందోదధిమనగాఢవానివాసా" అనే ప్రయోగచాతుర్యంవల్ల శ్రీరామానుజులు కూడా ఒక ఆళ్వార్లు అయ్యారనే సరసమైన అర్థం సూచింపబడింది. ఆళ్వార్లు అంటే - భగవదనుభవానంద సముద్రంలో మునిగేవారని కదా అర్థం.

22. ప్రాప్య శ్రీపుర మురగేన్ద్రశైలమూలా -
లఙ్కారం పదనతవిఠ్ఠలేన్ద్రభూపాత్ ।
లబ్ధ్వా సావకర మధిస్మిప చ్చ తత్ర
ప్రఖ్యాతా స్త్రిగుణశతం స్వశిష్యముఖ్యాన్ ॥

వేంకటాచల మూలదేశానికి అలంకారమైన తిరుపతి నగరాన్ని చేరి, తన శిష్యుడైన విట్టలేంద్రప్రభువువల్ల సత్కరింపబడ్డారు. ప్రసిద్ధులైన మూడువందలమంది తమ శిష్యులకు గ్రామభూమిని (అగ్రహారాలను) ఇచ్చి వారిని అక్కడ కైంకర్యపరులుగా స్థాపించారు.

శ్రీరామానుజవైభవంలో "అప్పడి ద్దినజ్గళ్ పల శెల ఇన్ద అవనియాన్ విట్టదేవ, ఒప్పరు నామమ్ ఉడైయ వేన్దనైయుమ్ తిరుత్తి యాఙ్గు ఓఙ్గు తొణ్డర్కళిన్, ముప్పదు పేరై అత్తిరుప్పతియిల్ ముట్టై తికళ్ కిరామ మొన్రాక్కి, త్తప్పఱ యిరుత్తి వేన్దనై క్కొణ్డే తడైయఱ ఇళైయ మణ్డియత్తై" (ఈవిధంగా పలు దినాలు గడువగా, ఆ భూమిని పాలించే విట్టలదేవుడనే సాటి లేని పేరును కల, జైనమతానికి చేరిన ప్రభువును శ్రీవైష్ణవునిగా



సంస్కరించి, అక్కడ గొప్ప శ్రీవైష్ణవులు ముప్పైమందిని ఆ తిరుపతిలో క్రమానుసారంగా జీవించేటట్లు ఒక గ్రామాన్ని ఏర్పరచి, ఆప్రభువు ద్వారానే వారు ఏ లోటు లేకుండా జీవించేటట్లుగా ఇళైయమణ్డియమ్ గ్రామాన్ని ముఖ్యపట్టణంగా వారికి ఏర్పరచారు) అని చెప్పబడింది.

23. నారూఢః కిల పరకాలముఖ్యభక్తైః
శేషాంశో హ్యయ మితి నారురోహ యావత్ ।
తావత్స ప్రసభ మనన్తనాథపూర్వ-
చ్ఛాత్రోక్త్యా వృషగిరిశృఙ్గ మధ్యరుక్షత్ ॥

"ఈ పర్వతం శేషాంశస్వరూపమని పరకాలమునీంద్రులు మొదలైన భక్తులెవరూ ఈ పర్వతాన్ని కాలుమోపి ఎక్కలేదు. అందువల్ల నేనుకూడా దీనిని ఎక్కను" అని శ్రీరామానుజులు తిరుమలకొండను ఎక్కడానికి ఇష్టపడలేదు. అపుడు అనందాళ్వాన్ మొదలైనవారి శిష్యులు ప్రార్థించగా వృషగిరిశృంగాన్ని అధిరోహించారు.

ఇక్కడ "అనన్తనాథ" శబ్దం అనన్తాళ్వాన్‌ను నిర్దేశిస్తుంది.

24. ఆయాన్తం యతితిలకం వృషాద్రిపూర్ణో
బిభ్రాణో వృషశిఖరీశితుః ప్రసాదమ్ ।
ఆమోద స్తబకితమానసో హ్యదస్థా-
దమ్భోధి శ్శశిన మివోల్లసత్తరఙ్గః ॥

చంద్రునిచూచి సముద్రం ఉప్పొంగిన కెరటాలను కల్గినది అయినట్లే, తిరుమలనంబి యతితిలకులైన శ్రీరామానుజులు తిరుమలకు రావడాన్ని చూచి ఆనందంతో వికసించిన మనస్సును కలవారయ్యారు. శ్రీవేంకటేశ్వరుని ప్రసాదాన్ని తీసికొని ఎదురేగారు.

25. వన్దిత్వా తమథ సుధీ స్తతో గృహీత్వా
భక్త్యా శ్రీవృషగిరినాయకప్రసాదమ్।

ప్రాహో చత్తమితి కిమాహర స్త్వమేవ
త్వత్తః ప్రత్యవరకరే న కిం ప్రసాదమ్? ॥

శ్రీశైలపూర్ణులకు ఆ ధీమంతులైన యతిరాజులు నమస్కరించి, తరువాత శ్రీవేంకటేశ్వరుని ప్రసాదాన్ని వారివల్ల పొంది, వారిని చూచి "స్వామీ! మీరే స్వయంగా ప్రసాదాన్ని తీసుకొని వచ్చారేమి! మీకంటే చిన్నవారి ద్వారా ప్రసాదాన్ని పంపి ఉండవచ్చుకదా!" అని అన్నారు.

26. ఇత్యుక్త స్స యతివరం సమిత్యవాదీత్
విథ్యోస్యాం నిభృత మవేక్షితా శ్చతస్రః ।
మత్తః ప్రత్యవర మలబ్ధి తాసు కశ్చిత్
యత్తేనాహర మహ మేవ తే ప్రసాదమ్ ॥

శ్రీరామానుజులు ఈ విధంగా పల్కగానే, తిరుమలనంబి "నిజమే! ఈ విధంగా నేను ఈనగరంలోని నాల్గు వీథులలో సావధానంగా గమనించాను. కాని, వేఱెవరూ నాకంటే చిన్నవారు లభించలేదు. ఈ కారణంవల్ల నేనే స్వయంగా తమకోసం భగవత్ప్రసాదాన్ని తీసికొనివచ్చాను.

తిరుమలనంబి పల్కిన ఈ సూక్తిని శ్రీరామానుజ వైభవకావ్యం- "అప్పడి ఇరామఙ్కైళైయవర్ పకర ఆశఋనమ్బియుమ్ అన్బర్, శెప్పరుమ్ ఇన్ద త్తిరుమలైయ మీదిల్ శెఱివన వీదికళ్ పలవుమ్ తప్పఱ నోక్కి నాడినేన్ శిఱియోర్ తమియనై అనైయ రాఙ్గుయిల్లై ఒప్పిలాయ్ ఎన్ఱాన్ ఎతికళుక్కిఱైవర్ ఉరుకినైన్దు ఆఙ్గనే ఒదుఙ్గి" (ఆవిధంగా శ్రీరామానుజులు పలుకగా, దోషవిదూరులైన నంబి కూడా "మిత్రమా! వాచామగోచరమైన మహిమను కల ఈ తిరుమల వీథులలో పెక్కింటిలో ఏలోటు లేకుండా చూచి, నాకంటే చిన్నవానికోసం వెదికాను. సాటిలేని శ్రీరామానుజా ! అటువంటివారు ఎవరూ అక్కడలేరు'' అని అన్నారు) అని తెల్పింది.

27. ఆకర్ణ్య శ్రుతిమధురాం గిరం తదీయాం
శిష్యాణాం వదన మవేక్ష్య లక్ష్మణార్యః ।



శ్రీశేషక్షితిధరపూర్ణశేషభావం
శ్లాఘిత్వా వృషగిరినాథధామ భేజే ॥

చెవులకింపైన వారి మాటను విని, శిష్యుల ముఖాలను చూస్తూ శ్రీరామానుజులు తిరుమల నంబి ప్రదర్శించిన భాగవతశేషత్వాన్ని పొగడి, శ్రీవేంకటేశ్వరుని నివాసాన్ని చేరారు.

28. స స్నాత్వా గుహసరసి ప్రదక్షిణేనా-
తన్వాన శ్చతసృషు వీథిషు ప్రచారమ్ ।
సేవిత్వావరణసురాన్ క్రమేణ హృష్టః
పూర్ణార్యై స్సహ మణిమణ్డపం జగామ ॥

స్వామిపుష్కరిణిలో తీర్థమాడి, నాల్గు మాడవీధులలో సంచరిస్తూ, ప్రాకారదేవతలను సేవిస్తూ ఆనందించినవారై తిరుమలనంబితోపాటు తిరుమామణిమంటపాన్ని చేరారు.

శ్రీరామానుజులు తిరుమలనంబిని పురస్కరించుకొని వేంకటేశ్వరుని దర్శించడంలో ఒక సాంప్రదాయికమైన క్రమం ఇమిడి ఉన్నది. భగవదాశ్రయణాన్ని ఆచార్యపురస్సరంగా చేయాలని, స్వయంగా భగవానుని ఆశ్రయించడం క్రమంకాదనే అర్థం ఇక్కడ సూచింపబడింది. నమ్మాళ్వార్లు కూడా తిరువాయ్మొళి ప్రబంధంలో "వేదమ్ వల్లార్కళై క్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరుప్పాదమ్ పణిన్దు" అని ఈ క్రమాన్ని తెలిపారు. తిరుమలలో వేంకటేశ్వరున్ని సేవించవలసిన క్రమాన్ని కూడా శ్రీరామానుజులు తమ ఆచరణతో ఉపదేశించారు.

29. న త్వా తం వృషగిరినాయకం సమీక్ష్య
ప్రత్యక్షం ప్రణతిపరాయణ స్తదంఘ్ర్యోః ।
సంసారార్ణవగతలోకతారకోసా
వానందామ్బుధికుహరే భవన్నిమగ్నః ॥

శ్రీవేంకటేశ్వరుని దర్శించి నమస్కరించి, ఆ స్వామి శ్రీపాదాలలో ప్రణతిపరాయణులై, సంసారులను అందరినీ ఉద్ధరించేవారైన శ్రీరామానుజులు ఆనందసముద్రంలో మునిగినవారయ్యారు. (అపుడు వేంకటేశ్వరుని ఈ విధంగా స్తుతించారు.)

30. శ్రీరఙ్గే విహితఫణీన్ద్రభోగతల్పం
నిద్రాణం నిగమశిరోవిహారి వస్తు ।
తల్లక్ష్మ్యా సహ ఫణిశైలమూర్ధ్ని నిద్రాం
త్యక్త్వా తాం విహరతి పూరుషః పరోత్ర ॥

శ్రీరంగంలో ఆదిశేషతల్పంలో పరుండి ఉండే వేదాంతాలలో విహరించే స్వభావాన్ని కల్గిన ఆ పరమపురుషుడు లక్ష్మీదేవితోపాటు ఈ శేషశైలంపై ఆ నిద్రనువీడి విహరిస్తున్నాడు.

తిరుప్పాణ్ ఆళ్వార్లు అమలనాదిపిరాన్ ప్రబంధంలో "విణ్ణవర్కోన్ విరైయార్పొళిల్ వేఙ్గడవన్... నీళ్ మదిళ్ అరఙ్గత్తమ్మాన్" అని అంటూ శ్రీరంగంలో, వేంకటాచలంలో ధర్మైక్యాన్ని ప్రతిపాదించిన రీతిలోనే ఇక్కడ కూడా ధర్మ్యైక్యం తెలుపబడింది. ఇటువంటి అభేదాన్ని కవి పన్నెండవ సర్గలో గోదాస్వయంవర ఘట్టంలో గల 93వ శ్లోకంలో కూడా వ్యక్తం చేయడం గమనించవచ్చు.

31. వైకుణ్ఠం కలిసమయే భువీదమేవ
స్వామ్యస్మిన్ ధ్రువ మయ మాశ్రయోఖిలానామ్ ।
యల్లక్ష్మ్యా విభు రతివాఞ్ఛితప్రదాయీ
దేవానా మపి పదసేవిదానవానామ్ ॥

కలియుగంలో వైకుంఠం ఇదే. ఈ లోకంలో అందరికీ ఈ స్వామియే ఆశ్రయం. ఇది నిశ్చయం. ఈ లక్ష్మీపతి సకల అభీష్టాలను దేవతలను, తన శ్రీచరణాలను సేవించే దానవులకు అనుగ్రహిస్తాడు.



ఇక్కడ దానవులంటే బలి, ప్రహ్లాదాదులు.

32. కారుణ్యస్తబకిత చక్షుషే నమస్తే
కామిన్యా కబలితవక్షసే నమస్తే ।
నాగేన్ద్రాలయగృహమేధినే నమస్తే
సన్తృణా (మా)ణా మభిమతదాయినే నమస్తే ॥

కరుణారసంతో వికసించిన నేత్రాలను కలవానికి నమస్కారం. కామిని అయిన లక్ష్మీదేవి అధిష్ఠించే వక్షఃస్థలాన్ని కల స్వామికి నమస్కారం. శేషాచలాన్ని నివాసంగా కల్గిన స్వామికి నమస్కారం. సేవించేవారికి అభిమతాలను ప్రసాదించే స్వామికి నమస్కారం.

ఈ శ్లోకంలోని సంబోధనలు తిరువాయ్మొళి ప్రబంధంలోని శరణాగతి ఘట్టంలో గల "అకలకిల్లేన్" అనే పాశురంలోని సంబోధనలను తలపిస్తున్నాయి.

"కారుణ్యస్తబకిత చక్షుషే" - అంటే - కరుణాగుణపరిణామం వల్ల వికసించిన నేత్రాలను కలవాడని అర్థం. దయాగుణం పరిణమిస్తే, దాని పరమావధి వాత్సల్యమే కదా. అందువల్ల భక్తుపట్ల గల వాత్సల్యం కారణంగా వికసించిన నేత్రాలను కలవాడని దీని సారార్థం. ఈ గుణాన్ని నమ్మాళ్వార్లు "నికరిల్ పుకళాయ్!" (సాటి లేని గుణాన్ని కలవాడా! అనే సంబోధనద్వారా తెలిపారు. సాటి లేని గుణమంటే వాత్సల్యమే. "కామిన్యా కబళిత వక్షసే" అనే సంబోధనకు లక్ష్మీదేవిచే ఆక్రమింపబడిన వక్షస్సును కలవాడని అర్థం. ఇది నమ్మాళ్వార్ల పాశురంలోని "అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్మఙ్గై యుఱై మార్పా!" అనే సంబోధనయొక్క ప్రతిరూపమే. "నాగేంద్రాలయ గృహమేధినే" అనే సంబోధన "తిరువేఙ్గ డత్తానే!" అనే సంబోధన తలపిస్తుంది. ఇక, "సంతృణామభిమతదాయినే" అనే సంబోధన "ఎన్నైయాళ్వానే!" అనే సంబోధనయొక్క అర్థాన్ని పరామర్శిస్తున్నది. "ఆళుదల్" అంటే రక్షించడం.

అభిమతదానం రక్షణలో భాగమేకదా! ఈ విధంగా ఈ శ్లోకంలోని నాల్గు సంబోధనలు, నమ్మాళ్వార్లు శరణాగతి చేసే సందర్భంలోని పాశురంలో నాల్గు సంబోధనల ద్వారా సూచించిన నాల్గు ఆశ్రయణ సౌకర్యాపాదక గుణాలను నాల్గింటిని తెల్పుతున్నా యనడంలో సందేహం లేదు. ఈరీతిలో కవి సాభిప్రాయ సంబోధనలను చేయడంవల్ల వీరికి గల గాఢమైన ద్రావిడవేద పరిచయం స్ఫుటపడుతున్నది.

**33. ఇత్థం స శ్రుతిశిఖరార్థగమ్య మీశం**
**స్తుత్వా తత్కృతకరుణాకటాక్షపాతః ।**
**తత్రైవ త్రిదిన ముపోష్య దృష్టతీర్థః**
**పూర్ణార్యై స్సమ మవరోహతి స్మ తస్మాత్॥**

ఈ క్రమంలో వేదాంతశాస్త్ర వేద్యుడైన భగవంతుని శరణు పొంది, ఆ స్వామి కరుణాకటాక్షాలను పొందారు. అక్కడ ఆ క్షేత్రంలో మూడు రోజులు ఉపవసించి, అక్కడ ఉండే అన్ని తీర్థాలలో స్నానమాడి, తిరుమలనంబితో పాటు కొండదిగి వచ్చారు.

"శ్రుతిశిఖరార్థగమ్యమ్" అనేప్రయోగం "శుడర్ మిగు శురుదియుళ్ ఇవై యుణ్డ శురనే", "వేదాన్తవి ళుప్పొరుళిన్ మేలిరున్ద విళక్కు" (వేదాంత రహస్యాలలో ఉన్న, ప్రకాశించే దీపం వంటివాడు) ఇత్యాది దివ్యసూరుల సూక్తులను స్మరింపజేస్తుంది.

**34. శ్రీరామాయణగదితం వృషాద్రిపూర్ణా-**
**చ్ఛ్రుత్వార్థం సుదృఢ మముం నిజప్రబన్ధాన్ ।**
**సంశ్రావ్యాకృతకవచోర్థసఙ్గ్రహాదీన్**
**సోనైషీ త్తనయ మముష్య శిష్యతాం హి ॥**

కొండకింద తిరుమలనంబి వద్ద శ్రీరామాయణం తెలిపే పద్దెనిమిది విధాలైన సంప్రదాయార్థాలను దృఢంగా విన్నారు. తాము రచించిన వేదార్థ సంగ్రహాది గ్రంథాలను తిరుమలనంబికి వినిపించారు. నంబి కుమారులను తమ శిష్యులుగా పరిగ్రహించారు.



అముదనార్ ఇరామానుశ నూగ్ఱన్దాదిలోని **"పడి కొణ్డ కీర్త్తి ఇరామాయణమెన్నుమ్ పత్తి వెళ్ళమ్ కుడికొణ్డ కోయిలి రామానుశన్"** (భూమి అంతటా వ్యాపించిన కీర్తిని కల శ్రీరామాయణమనే భక్తిప్రవాహం తేటపడి స్థిరపడిన చోటు శ్రీరామానుజులు) అనే సూక్తిద్వారా తిరుమలనంబి వద్ద శ్రీరామానుజులు శ్రీరామాయణ రహస్యార్థాలను సుదృఢంగా శ్రవణం చేసిన వృత్తాంతాన్ని సూచించారని అభియుక్తోక్తి.

**35. గోవిన్దాభిధ మథ దేశికైకతానం**
**ధారాపూర్వక ముపలభ్య లక్ష్మణార్యః ।**
**శేషోర్వీధరవరపూర్ణదేశికేన**
**శ్రీకాఞ్చీనగర ముపాసదద్విసృష్టః ॥**

ఆచార్యనిష్ఠలో అద్వితీయులైన గోవిందభట్టర్‌ను (ఎమ్బార్-శ్రీరామానుజుల పినతల్లి కుమారులను) తిరుమలనంబి వద్ద దానజలధారా పూర్వకంగా కానుకగా పొంది, శ్రీరామానుజులు తిరుమలనంబి అనుమతిని పొంది కాంచీనగరాన్ని చేరారు.

తమ ఆచార్యులైన తిరుమలనంబిని వదలిపెట్టి శ్రీరామానుజు లతో వెళ్ళినపుడు, ఎమ్బార్‌కు కల్గిన చింతవల్ల వారి శరీరం పాలిపోయింది. ఈవిధంగానే, ఎమ్బార్‌తమ ఆచార్యులకు శయ్యను సిద్ధం చేసిన తరువాత, ముందుగా తాము దానిపై పరుండి పరీక్షించేవారని కూడా ప్రసిద్ధి. ఎమ్బార్‌కు గల ఆచార్యనిష్ఠ అంత గొప్పది.

**36. శ్రీకాఞ్చ్యాం వరద ముపాస్య గోపపుర్యాం**
**భక్తేశం హరి మభిధాపురేచ్యుతఞ్చ ।**
**శౌరీశశ్రుతిపతిశార్ఙ్గపాణిముఖ్యాన్**
**చోరేశానపి కురుకాపురీం స భేజే ॥**

కాంచీపురంలో వరదరాజస్వామిని సేవించారు. తిరుక్కోవలూర్ (గోపపురిలో) భక్తేశులను, అభిధాపురంలో (తిరుప్పేర్‌నగర్‌లో) అచ్యుత భగవానుని ఆరాధించి, **శౌరిరాజపెరుమాళ్, శ్రుతిపతి, శార్‌ఙ్గపాణి (తిరుక్కుడన్దై)** మొదలైన అర్చామూర్తులను సేవించి, ఆఴ్వార్ తిరునగరిని చేరారు.

**37.** **వైకుణ్ఠప్రభృతిమహోష్టధామనాథైః**
**సేవిత్వా సహ కురుకేశ మాదినాథమ్ ।**
**తత్రాక్షోః పథ మనయద్విన్నిద్రచిఞ్చా-**
**మూలేసౌ మధురకవిఞ్చ తం శఠారిమ్ ॥**

తిరువైకున్దవిణ్ణగరమ్ మొదలైన ఎనిమిది తిరునాంగూర్ దివ్యక్షేత్రాల లోని అర్చామూర్తులను సేవించి, ఆఴ్వార్ తిరునగరిలోని ఆదినాథస్వామిని కొలిచి, అక్కడ నిర్నిద్రతింత్రిణిగా పేరు పొందిన చింతచెట్టు మూలలో నమ్మాఴ్వార్లను, మధురకవులను దర్శించారు.

**38.** **సేవిత్వా గగనమహాచలేశవిష్ణుం**
**ప్రాణంసీ త్తదను హరిం కురఙ్గనాథమ్ ।**
**తం పూర్ణం శ్రుతిశిఖరార్థబోధనేన**
**చ్ఛాత్రం సోకృత మణిభద్రపీఠవర్తీ ॥**

వానమామలై దివ్యక్షేత్రంలోని తోతాద్రినాథుని సేవించి, తిరుక్కుఱుఙ్గుడిలోని స్వామికి ప్రణామం చేశారు. అక్కడ మణిమయమైన భద్రపీఠంపై వేంచేసి ఉండి, అక్కడి నంబి అనే అర్చామూర్తికి వేదాంతార్థాలను ఉపదేశించి ఆ స్వామిని తనకు శిష్యునిగా చేసికొన్నారు.

**39.** **సోనన్తే శయిత మనన్తపుర్యధీశం**
**నత్వాస్మిన్మఠమపి క్లుప్తవాన్ స్వనామ్నా ।**
**సేవిత్వా మధుమథనాంశ్చ కేరలేన్ద్రా-**
**నాపేదే జలధిగరామసేతుమూలమ్ ॥**



తరువాత, తిరువనంతపురంలో ఆదిశేషునిపై శయనించిన అనంత పద్మనాభస్వామిని సేవించి, అక్కడ తన పేరుతో మఠాన్ని కూడా స్థాపించారు. కేరళదేశంలోని దివ్యదేశాలలోగల మధుసూదనుడు మొదలైన అర్చామూర్తులను సేవించి, శ్రీరామచంద్రుడు నిర్మించిన సేతువు యొక్క మూల ప్రదేశాన్ని చేరారు.

శ్రీరామానుజవైభంలో- **"ఉఱ్ఱైయుమ్ పులవర్ తమ్మై వెన్ఱాఙ్గు ఓఙ్గు తఞ్జేర్ నామత్తాల్ మఠైయిన్ విదియాల్ మణ్డపమ్ ఒన్ఱాక్కి"** (956) (వశీకరించుకోదగిన పండితులను తిరువనంతపురంలో జయించి, అక్కడ గొప్పదైన పేరును కల తన తిరునామంతో శ్రీరామానుజులు ఒక మండపాన్ని నిర్మింపజేశారు.) అని మండపం (మఠం?) నిర్మింప జేసినట్లు తెలుపబడింది.

**40.** **ఫుల్లాటవ్యధిగతదివ్యచాపనాథం**
**శ్రీదర్భాసనవినివిష్ట మర్చయిత్వా ।**
**అద్రాక్షీద్రజనిచరేన్ద్రనీతసీతా-**
**సన్తాపప్రశమనహేతు మేష సేతుమ్ ॥**

తిరుప్పుల్లాణి దివ్యదేశంలో దర్భశయనంపై వేంచేసి ఉండే చాపనాథ స్వామిని అర్చించి, రావణుడు బలాత్కారంగా తీసికొనిపోయిన సీతాదేవి సంతాపాన్ని తీర్చడంలో హేతువైన సేతువును దర్శించారు.

శ్రీయామునుల **"ఆరక్షోనీత సీతాముఖకమలసముల్లాసహేతోశ్చ సేతోః"** అనే సూక్త్యర్థం ఇక్కడ అనువదింపబడడం గమనించాలి.

**41.** **స ప్రాప్తః పుర మథ ధన్వినూతనాఖ్యం**
**జ్యాయాంసం సుమతి ముపాస్య విష్ణుచిత్తమ్ ।**
**గోదాయాః కృతియుగలేన తత్సుతాయా**
**స్సాకం తత్కృతి మవధార్య సన్తుతోష ॥**

తరువాత శ్రీవిల్లిపుత్తూర్ నగరాన్ని చేరి, గొప్ప జ్ఞానాన్ని కలవారైన, పెరియాఴ్వార్లనే విష్ణుచిత్తులను సేవించారు. వారి కుమార్తె అయిన గోదాదేవిని సేవించి, ఆమె అనుగ్రహించిన రెండు ప్రబంధాలను ఆలకించి చాలా ఆనందించారు.

ఇక్కడ, విష్ణుచిత్తులను గూర్చి ప్రయోగించిన **"జ్యాయాంసమ్, సుమతిమ్"** అనే విశేషణాలు రెండు సాభిప్రాయకాలు. **"పెరియాఴ్వార్"** అనే ద్రావిడపదానికి సంస్కృతీకరణమే పెద్దవారనే అర్థమిచ్చే **"జ్యాయన్"** అనే పదం. **"సుమతిమ్"** -అంటే మంచి జ్ఞానాన్ని కలవారని అని అర్థం. మతి అంటే -భగవానుడే రక్షకుడనే జ్ఞానదశ, సుమతి అంటే - రక్ష్య రక్షకభావం తారుమారై, భగవానునకు అస్థానే భయశంకతో మంగళా శాసనం చేసే జ్ఞానపరిణామ రూపమైన ప్రేమదశ. భగవద్విషయంలోని ఈ ప్రేమాతిశయం వల్లనే పెరియాఴ్వార్లు నిత్యం భగవన్మంగళాశాసనం చేసి, అందఱి ఆఴ్వార్లలో గొప్ప వారయ్యారు. **"మఙ్గళాశాసనత్తిన్ మఱ్ఱుళ్ళ ఆఴ్వార్కళ్ తఙ్గళార్వత్తళవుదానన్ఱి పొఙ్గుమ్ పరివాలే విల్లిపుత్తూర్ పట్టర్ పిరాన్ పెఱ్ఱాన్ పెరియాఴ్వార్ ఎన్నుమ్ పెయర్"** (భగవంతునకు మంగళా శాసనం చేయడంలో మిగిలిన ఆఴ్వార్లకు ఉండే ఆర్తి, అవధికి మించిన ఆర్తి కలవారై, పొంగిపొర్లే ప్రేమతో మంగళా శాసనం చేసినందున పెరియాఴ్వార్లు అనే పేరును భట్టనాథులు పొందారు) అనే శ్రీమద్వరవర మునుల ఉపదేశరత్తిన మాలై పాశురం స్మరణీయం.

**42.** గోపస్త్రీకులమయగోదయోపదిష్టం
కృష్ణాఙ్కం ప్రణవ మివాచచార జప్యమ్ ।
స త్రింశత్పరిమితపద్య మార్గశీర్ష -
ప్రారబ్ధోత్సవసమయోచితం ప్రబన్ధమ్ ॥

గోపికాభావాన్ని ఆరోపించుకొన్న గోదాదేవి ఉపదేశించినది, శ్రీకృష్ణునిచే అంకితమైనది, ముప్పై పాశురాలతో కూడినది, మార్గశీర్షమాసారంభ



సమయానికి ఉచితమైనది అయిన తిరుప్పావై ప్రబంధాన్ని నిత్యం జపించదగిన ప్రణవంగా ఆచరించారు.

శ్రీరామానుజులు సదా తిరుప్పావై ప్రబంధాన్ని అనుసంధించేవారు, వారికి ఈప్రబంధంపట్ల ఉండే ఆదరాతిశయం చేత, వారికి **"తిరుప్పావై జీయర్"** అనే పేరు ఏర్పడిందనే సంప్రదాయంలో ప్రసిద్ధమైన ఐతిహ్యం స్మరణీయం. ప్రణవంలో జీవుని శేషత్వ పారతంత్ర్యాలు తెలుపబడేట్లే, తిరుప్పావై ప్రబంధంలోకూడా ఆశేషత్వ పారంతత్ర్యాలు **"ఎఱ్ఱైక్కుమ్ ఏఴ్ఏఴుపిఱవిక్కుమ్ ఉన్తన్నోడుఱ్ఱోమే యావోమ్, ఉనక్కే నామాట్చెయ్ వోమ్"** (ఏనాటికైనా, ఏడేడు జన్మలలోను నీతోనే సంబంధాన్ని కలిగి ఉంటాము. నీకే సేవ చేస్తాము) ఇత్యాదిగా నిష్కర్షింపబడినందున, తిరుప్పావై ప్రణవంవలె జప్యమనడంలో సందేహం లేదు.

**43.** శ్రీగోష్ఠీనగరధురీణసున్దరేశ -
శ్రీనారాయణఫణిశాయిదక్షిణాశాన్ ।
తత్రత్యం గురుమపి పూర్ణ మర్చయిత్వా
సచ్ఛాత్త్రై స్సహ మధురాపురీం ప్రపేదే ॥

శ్రీగోష్ఠీనగరంలోని సౌమ్యనారాయణస్వామి, సుందరేశ్వరుడు, తిరుమెయ్యమ్‌లోని సత్యగిరి నాథుడు మొదలైన దక్షిణదిక్కులలోని దివ్యదేశాలలో గల అర్చామూర్తులను సేవించి, గోష్ఠీపురంలో వేంచేసి ఉండే తిరుక్కోట్టియూర్‌నంబిని అర్చించి, శిష్యులతో కలసి దక్షిణ మధురను చేరారు.

**44.** తత్ర శ్రీసహచరసఙ్గమేశవిష్ణుం
స్తుత్యన్మఙ్గలవరవిష్ణుచిత్తసూక్తైః ।
నత్వా మోహననగరే చ కాలమేఘం
లక్ష్మీశం వనగిరిమూలమాసదత్సః ॥

అక్కడ లక్ష్మిని సహచారిణిగా కల సంగమేశవిష్ణువును (కూడలఝ కర్‌ను) పెరియాఝ్వార్లు అనుగ్రహించిన మంగళాశాసన రూపాలైన పల్లాండు ప్రబంధంతో స్తుతించి, తిరుమోకూర్ క్షేత్రంలోని కాలమేఘస్వామిని నమస్కరించి, తిరుమాలిరుమ్ శోలైక్షేత్ర సమీపాన్ని చేరారు.

**45. తీర్థానాం పయసి స నూపురప్రవన్తీ-**
**ముఖ్యానాం విరచితమజ్జనో యతీన్ద్రః ।**
**ఆరామక్షితిధరపారిజాత మారా -**
**దస్తోషీత్పణితిభరేణ సున్దరేశమ్ ॥**

అక్కడ ఉండే నూపురగంగ మొదలైన పుణ్యతీర్థ జలాలలో శ్రీరామానుజులు స్నానమాడి, తిరుమాలిరుమ్‌శోలైలోని పారిజాతం వంటి సుందరబాహువు అనే సుందరేశ్వరుని అందమైన స్తుతులతో స్తుతించారు.

**46. సత్యాద్రే స్తిలక ముపాస్య సత్యనాథం**
**సుస్నాత శ్శుచిని జలే కవేరజాయాః।**
**శ్రీరఙ్గం నగర మగాచ్చలత్పతాకా -**
**హస్తాగ్రైః ప్రసభ మివాహ్వయత్ప్రమోదాత్॥**

తిరుమెయ్యమ్ అనే క్షేత్రానికి అలంకారం వంటివాడైన సత్యగిరినాథుని ఉపాసించి, అక్కడనుండి బయలుదేరి, కావేరి నదిలో స్నానం చేసినవారై శ్రీరంగ నగరాన్ని చేరారు. అపుడు ఆ శ్రీరంగనగరంలోని భవనాలపై ఉండే పతాకల రెపరెపలు శ్రీరామానుజుల ఆగమనాన్ని ఆనందంగా ఆహ్వానిస్తున్నట్లు తోచాయి.

**47. రఙ్గేన్దుః కృత వినతిం యతిం నిజాంఘ్ర్యో**
**అప్రాక్షీదితి కుశలోక్త్యనన్తరం తమ్ ।**
**కిం త్వం మద్విహరణమన్దిరాణి భూమౌ**
**ధామాని స్ఫుట మవలోకయాఞ్చకర్థ ॥**



శ్రీరంగనాథుడు, తన పాదాలకు నమస్కరించిన శ్రీరామానుజులను కుశలప్రశ్నలు అడిగిన తరువాత, "ఏమి ! శ్రీరామానుజా! నేను ఈ భూమిపై అర్చారూపంలో వేంచేసి ఉండే నా విహరణ మందిరాలైన, దివ్యదేశాలను అన్నిటిని దర్శించారా?'' అని ప్రశ్నించాడు.

**48. తస్యోక్తే రథ స త మిత్యువా చ దృష్టం**
**త్వద్ధామోపవననిభాన్యధామబృన్దమ్ ।**
**ధామేతః పర మిహ నాన్యదీయ మీక్షే**
**జాతిస్థః కిమలి రపేక్షతేన్యపుష్పమ్ ॥**

ఆ స్వామి వచనాలకు శ్రీరామానుజులు ఈ విధంగా బదులిచ్చాడు- "స్వామీ! నీ ఈ శ్రీరంగ భవనానికి ఉపవనాలుగా చెప్పదగి, అన్య దివ్యక్షేత్ర బృందాన్ని దర్శించాను. ఇకపై నేను ఇక్కడ నుండి ఏదివ్యదేశానికి వెళ్ళను, దర్శించను. జాజిపూవుపై వాలిన తుమ్మెద, ఇక, ఇంకొక పూవును కోరదు కదా.

శ్రీవైష్ణవసంప్రదాయంలో **"కోయిల్"** అనే పదం శ్రీరంగాన్నే ముఖ్యంగా బోధిస్తుంది. మిగిలిన దివ్యదేశాలన్నీ స్వామికి విహరణస్థలాలే అని, అన్నిదివ్యదేశాలలోని అర్చామూర్తులు రాత్రికి శ్రీరంగంలో విశ్రమిస్తారని అభియుక్తోక్తి. ఇక్కడ **"సుమనా మాలతీ జాతిః"** - అని జాతి శబ్దానికి జాజిపూవు అని అర్థం. **"జాతిస్థః కిమలి రపేక్షతేన్యపుష్పమ్?"** అనే సూక్తి స్తోత్రరత్నంలోని **"స్థితోరవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే"** అనే సూక్తిని తలపిస్తుంది. ప్రకృతసూక్తి శ్రీరంగ నాథునకు సంబంధించినది కనుక, **"ఎన్నరఙ్గనై క్కణ్డ కణ్‌గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** (నా రంగని చూచిన కన్నులు వేఱొక దానిని దేనినీ చూడవు) అనే తిరుప్పాణ్ ఆఝ్వార్ల శ్రీసూక్తిని కదా స్మరింపజేస్తుంది. తిరుప్పాణ్ సూక్తిలోని **"మఱ్ఱొన్ఱినై"** (ఇక వేఱు దేనినీ) అనే ప్రయోగానికి అర్చావతారాలలో కూడా శ్రీరంగనాథుని తప్ప, వేఱు ఏ అర్చారూపాన్ని- అని కూడా అర్థమని

అభిజ్ఞులైన మన పూర్వాచార్యులు తెల్పిన అర్థం ఇక్కడ సుసంగతమవడం గమనార్హం. అయితే, ఈవిధంగా పల్కడం మిగిలిన రూపాలపట్ల అనాదరంతో కాదు; ప్రకృత రూపంలోని ఆదరాతిశయం వల్లనే అని గ్రహించాలి. అందుచేత "న హి నిందాన్యాయం"తో ఇక్కడ అర్థాన్ని సమన్వయించుకోవడం తగినది.

**49. ఇత్యుక్త్వా విరచితరఙ్గికార్యముద్రా-**
**నిర్వాహ శ్శఠరిపుపూర్వసూరిక్లుప్తైః ।**
**సార్ధం ద్రామిడనిగమాదిభిః ప్రబంధైః**
**వ్యాకుర్వన్నిగమశిఖార్థమాస్త తత్ర ॥**

ఈ విధంగా పల్కిన శ్రీరామానుజులు తరువాత శ్రీరంగంలోని శ్రీరంగనాథస్వామి దివ్యాలయ కైంకర్యనిర్వాహాన్ని చేస్తూ, నమ్మాళ్వార్లు మొదలైన దివ్యసూరులు అనుగ్రహించిన ద్రావిడవేద ప్రబంధాలతో వేదాంత తత్త్వార్థాలను వ్యాఖ్యానిస్తూ శ్రీరంగంలో వేంచేసి ఉన్నారు.

భగవద్రామానుజ సిద్ధాంతం ఉభయవేదాంతాత్మకమైనది. ఈ విధమైన ఉభయవేదాంత సంప్రదాయం మఱి ఏ ఇతర సిద్ధాంతంలోను కన్పించదు. ఉభయవేదాంతాలంటే- సంస్కృతవేదాంతం, ద్రావిడవేదాంతం- అనే రెండు వేదాంతాలు. సంస్కృతవేదాంతంలోకి భగవదనుగ్రహంతో మహర్షులు దర్శించి లోకానికి అందించిన వేదంలోని ఆరణ్యక, ఉపనిషద్భాగాలు వాటికి నాథయామున భాష్యకారాది పూర్వాచార్యులు రచించిన వ్యాఖ్యానాలు, స్వతంత్రగ్రంథాల రూపమైనది. ద్రావిడవేదాంతమంటే -దివ్యసూరులనబడే ఆళ్వార్లు అనుగ్రహించిన, నాలాయిరదివ్య ప్రబంధమనే పేరుతో వ్యవహరింపబడే 24 ప్రబంధాలు. వీటికి పూర్వాచార్యులు వెలయించిన వ్యాఖ్యానాలు. వీటిద్వారా ఆళ్వార్లు, సంస్కృత వేదాంతంలో మహర్షులు అందించిన తత్త్వార్థాలను ద్రావిడభాషలో పాశురాల రూపంలో అనువదించి పల్కినందున వీటికి ద్రావిడవేదాంతమనే అన్వర్థమైన సుప్రసిద్ధ నామం



కల్గింది. ఈ ఉభయవేదాంత సమన్వయ ప్రక్రియ **"నాథోపజ్ఞం ప్రవృత్తమ్"** అనే విధంగా నాథమునుల కాలంనుండే ఆరంభమైనా, దానికి ఒక పరిణతమైన, సంపూర్ణమైన రూపం శ్రీరామానుజుల కాలంలోనే సంతరించు కొన్నది. ఈ విధమైన సమన్వయ ప్రక్రియను శ్రీరామానుజులు తమ శ్రీభాష్యాది గ్రంథరచనలో విద్వజ్జనైకగమ్యంగా పొందుపరచారు. అళ్గియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ ఆచార్యహృదయ గ్రంథంలో **"ఇదు కొణ్డు శ్రీభాష్యకారర్ సూత్రవాక్యఙ్గళై ఒరుఙ్గ విడువర్"** (ఈ తిరువాయ్‌మొళ్గి ప్రబంధంతో శ్రీభాష్యకారులు బ్రహ్మసూత్ర వాక్యాలను సమన్వయించి అర్థాన్ని చెప్పారు) అని పల్కడం దీనికొక ఉదాహరణ. శ్రీభాష్యంలో సర్వశూన్యవాది అయిన మాధ్యమికుని వాదాన్ని నిరసించే క్రమంలో శ్రీరామానుజులు **"ఉళనెనిల్ ఉళన్"** ఇత్యాది తిరువాయ్‌మొళ్గి పాశురాన్ని, కప్యాస శ్రుతివివరణంలో **"నీరార్ కమల్ పోల్ శెఙ్గణ్ మాల్", "మెన్ కాల్ కమలత్తడమ్‌పోల్"** ఇత్యాది ద్రావిడవేద తదంగసూక్తులను అనుసరించారనే విషయం ఈ రెండు వేదాంతాలను నిశితంగా గమనించిన వారికి మాత్రమే బోధపడే అద్భుత, అపూర్వ రహస్యం. ఇటువంటి ఉభయ వేదాంత సమన్వయ ప్రక్రియను శ్రీరామానుజులు పెంపొందించిన అంశాన్ని ప్రకృతశ్లోకం తెల్పుతున్నది. ఈవిధమైన సమన్వయ ప్రక్రియలో గ్రంథరచనకు నాందిపల్కుతూ శ్రీరామానుజులు తమ అభిమానపుత్రులైన తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ ద్వారా తిరువాయ్‌మొళ్గి ప్రబంధానికి ఆఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని రచింపజేసిన విషయం కూడా ప్రకృతంలో స్మరణీయం.

**50. జీవాతుం కుమతిభుజఙ్గదంశముహ్యా-**
**ద్వేదానా మకృత ముముక్షు భాగధేయమ్ ।**
**సద్వైపాయనశుకముఖ్యభావగర్భం**
**శ్రీబోధాయనఫణితిక్రమేణ భాష్యమ్ ॥**

కుమతుల సర్పాలవంటి విషం వంటి వాదాలవల్ల మూర్ఛను పొందిన వేదాన్ని ఉజ్జీవింపజేసే జీవనౌషధంవంటిది, బోధాయనవృత్తిని అనుసరించి

రచింపబడినది, ముముక్షువుల సౌభాగ్యరూపమైనది అయిన శ్రీభాష్య మహాగ్రంథాన్ని వ్యాస, శుకాది మహర్షుల అభిప్రాయాలకు ఇముడ్చుకొన్నదిగా శ్రీరామానుజులు వెలయించారు.

పూర్వశ్లోకంలో శ్రీరామానుజుల ద్రావిడవేదాంతవాఙ్మయానికి మూలమైన, భగవద్విషయమనే పేరుతో వ్యవహరింపబడే తిరువాయ్‌మొழி ప్రబంధవ్యాఖ్యాన ప్రవర్తకత్వం తెలుపబడింది. ఇందులో సంస్కృతవేదాంత వాఙ్మయంలో ముఖ్యగ్రంథమైన శ్రీభాష్యాన్ని అనుగ్రహించిన వైనం ప్రస్తావింపబడింది.

శ్రీరామానుజులు తాము బోధాయనవృత్త్యనుగుణంగా శ్రీభాష్య రచనను చేశారనే విషయాన్ని శ్రీభాష్యారంభంలోనే **"భగవద్బోధాయన కృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యాః సంచిక్షిపుః, అథ తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే"** (బోధాయన మహర్షి రచించిన, విస్తృతమైన బ్రహ్మసూత్ర వృత్తిని పూర్వాచార్యులు సంక్షిప్తం చేశారు. దానిని అనుసరించి బ్రహ్మసూత్రాలు అక్షరశః వ్యాఖ్యానింపబడుతున్నాయి.) అని శ్రీరామానుజులు చేసిన ప్రతిజ్ఞ తెల్పుతున్నది. **"కుమతి భుజంగదంశ ముహ్యద్వేదానాం జీవాతుమ్"** అనేదానికి అనుగుణంగా **"తస్మై రామానుజార్యాయ నమః పరమయోగినే, యః శ్రుతిస్మృతి సూత్రాణా మంతర్జ్వర మశీశమత్"** (వేదాలకు, స్మృతులకు కల్గిన లోజ్వరాన్ని తీర్చినవారు, గొప్ప యోగి అయిన రామానుజాచార్యుల వారికి నమస్కారం) అనే ప్రసిద్ధసూక్తిని స్మరించాలి.

**51.** **శ్రీరఙ్గామృతకవి రాహ రఙ్గిభృత్యః**
**తచ్ఛిష్యో యతిపతివైభవానుబద్ధమ్ ।**
**అన్తాదిద్రమిడగిరా మహాప్రబన్ధం**
**గాథానా మమృతముచాం యుతం శతేన ॥**

శ్రీరంగాలయ కైంకర్యాన్ని నిర్వహించేవారు, శ్రీరామానుజులకు ప్రశిష్యులు అయిన తిరువరంగత్తముదనార్ భగవద్రామానుజ వైభవ ప్రకాశమైన అంతాదిదివ్యప్రబంధాన్ని ద్రావిడభాషలో 108 పాశురాలతో అమృతాన్ని మించిన స్వారస్యాన్ని కల్గి ఉండేటట్లుగా రచించారు.



ఈ ప్రబంధమే ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధం. దీనికే సంప్రదాయంలో ప్రపన్నగాయత్రి అనికూడా పేరు. **"శఠరిపురేక ఏవ కమలాపతి దివ్యకవిః... యతికులపుంగవస్య భువిరంగ సుధాకవిరాట్"** (భగవంతునకు తగిన కవి శఠకోపులే, యతిపతికి తగిన కవి అముదనారే) అనే పూర్వాచార్యసూక్తి శ్రీరామానుజుల వైభవానికి తగిన రీతిలో పాశురాలను అనుగ్రహించినవారు తిరువరంగత్తముదనార్- అని తెల్పుతున్నది. శ్రీరామానుజుల స్తుతులెన్ని ఉన్నా, ఈప్రబంధానికి ఏమీ సాటి రావని పెద్దల సూక్తి.

**52.** **అన్తాదిం శతక మిదం ప్రపన్నలోకః**
**కాసారప్రముఖమనీషిభిః కృతానామ్ ।**
**ప్రాగేవ ద్రమిడజరద్వచఃకృతీనాం**
**ప్రారమ్భప్రణవవదాతతాన జప్యమ్ ॥**

అంతాది క్రమంలో రచింపబడింది, శతాధికాలైన పాశురాలతో కూడినది అయిన ఈ గ్రంథాన్ని ప్రపన్నలోకం, సరోయోగి మొదలైన దివ్యసూరులు అనుగ్రహించిన ద్రావిడవేదప్రబంధాలతో పాటుగా, వేదాల ఆరంభంలో ప్రణవంవలె, అనుసంధేయంగా చేసికొన్నది.

**53.** **కూరేశప్రథితవధూలదాశరథ్యా-**
**దిచ్ఛాత్ర ప్రవరముఖేన లక్ష్మణార్యః ।**
**స్వాఖ్యాతశ్రుతిశిఖరాత్మకప్రబన్ధాన్**
**స వ్యాచీకరదఖిలోపకారహేతోః ॥**

కూరేశులు, ప్రసిద్ధవాధూలగోత్రానికి చెందిన దాశరథి (ముదలియాణ్డాన్) మొదలైన గొప్ప శిష్యులద్వారా శ్రీరామానుజులు తాము రచించిన వేదాంతార్థ ప్రబంధాలను జగదుజ్జీవనం కల్గించడం కోసం ప్రచారం చేశారు.

**54.** సన్త్రాతు స్స్వమతవిబోధనాజ్జనానాం
మాహాత్మ్యం సమచకథన్నమీ యతీన్ద్రో ।
రఙ్గేశాదిమ హరయశ్చ పఞ్చరక్షో
మూకౌ ద్వౌ శఠరిపుపూర్వసూరయోష్టౌ ॥

తమ సిద్ధాంతాన్ని తెలియజేసి, సంసారిజనుల రక్షించేవారైన యతిరాజులైన శ్రీరామానుజుల మహిమను శ్రీరంగనాథుడు మొదలైన అయిదుగురు అర్చామూర్తులు (శ్రీరంగనాథుడు, శ్రీవేంకటేశుడు, శ్రీవరదరాజస్వామి, సుందరబాహుస్వామి, తిరుక్కుఱుంగుడినంబి- అనే అయిదుగురు) బ్రహ్మరక్షస్సు, మూగవాడు, నమ్మాళ్వార్లు, నాథమునులు, యామునులు, గోష్ఠీపూర్ణులు, మహాపూర్ణులు, తిరుమలైనంబి, తిరువరంగప్పెరుమాళ్ అరైయర్, తిరుమాలై ఆణ్డాన్ మొదలైన ఎనిమిదిమంది ఆచార్యులు ప్రకాశింపజేశారు.

దీని వివరం గురుపరంపరా ప్రభావం, ప్రపన్నామృతం, చరమోపాయ నిర్ణయం వంటి పలు సంప్రదాయగ్రంథాలలో తెలుపబడింది.

**55.** కారుణ్యాకరయతివాదివాదకాలే
సద్యుక్తిప్రకథనకర్మణా స రఙ్గీ ।
తత్పాదప్రణయజుషాఞ్చ మానుషాణా -
ముద్దామద్వివిధవిభూతి దానతశ్చ॥

అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ (యజ్ఞమూర్తి)తో వాదించే సమయంలో స్వయంగా శ్రీరంగనాథుడు జయించడానికి తగిన యుక్తులను ప్రకటించాడు. అంతేకాక, శ్రీరామానుజుల శ్రీచరణాల పట్ల భక్తిని కలవారికి తన ఉభయవిభూతులను అనుగ్రహించాడు.

**56.** శ్రీరఙ్గే మహితవిభూతియుగ్మసమ్ప్ర-
ద్దానేనాఞ్జనగిరిరాట్చ శిష్యభావాత్।



కాఞ్చీశ స్సకలమహీప్రదక్షిణానామ్
ఆఖ్యానా త్సమ మితి తత్ప్రదక్షిణఞ్చ॥

శ్రీరంగంలోకూడా శ్రీరంగనాథుడు గొప్పదైన తన ఉభయవిభూతి రూపసంపదను శ్రీరామానుజులకు ఇవ్వడం ద్వారా, శ్రీవేంకటేశ్వరుడు వారికి శిష్యుడు కావడం ద్వారా, వరదరాజస్వామి, శ్రీరామానుజుల ప్రదక్షిణం భూప్రదక్షిణంతో సమానమని పల్కడం ద్వారా శ్రీరామానుజుల మహిమను ప్రకటించారు.

**57.** గోష్ఠ్యాం సున్దరపతి రాహ్వయం స్తదీయా
నర్చాయై ప్రథమమనుత్థితోరుపూర్ణాన్ ।
శిష్యోభూ త్స హి భవతాం తథా యథాహం
నన్దాదే స్తనయ ఇతీదృశోక్తిభఙ్గ్యా ॥

ఒకనాడు సుందరబాహుస్వామి తన గోష్ఠిలో ఉండేవారిని ఉద్దేశించి- శ్రీరామానుజుల శిష్యులను ముందు ఆహ్వానించి, వారిని పూజించ వలసినదిగా ఆజ్ఞాపించాడు. అపుడు ఆ గోష్ఠిలో మహాపూర్ణులకు సంబంధించిన వారుకూడా ఉన్నారు. వారు, తాము మహాపూర్ణులకు సంబంధించినవారం కనుక, తమకు కూడా శ్రీరామానుజులు శిష్యులేనని తలచి ముందుకు రాలేదు. అపుడు సుందరబాహుస్వామి వారిని ఎందుకు రాలేదని ప్రశ్నించగా తమ అభిప్రాయాన్ని వారు తెలిపారు. అపుడు స్వామి వారితో, తాను శ్రీకృష్ణుడై వాసుదేవునకు, నందగోపాలునకు భక్తుడైనట్లే, శ్రీరామానుజులు వారికి శిష్యులయ్యారని భావించమని, శ్రీరామానుజ సంబంధమే అందరికి ఉత్తారకమని వారికి తెలిపాడు.

**58.** యేన త్వం జగదకృథా మమాప్యవశ్యం
వశ్యం తం మమ వేదమన్త్ర మిత్యుదీర్య ।
శిష్య స్సన్ యతిశశినో మహాసనస్థాత్
శ్రీమన్త్రగ్రహవిధినా కురఙ్గనాథః ॥

తిరుక్కుఱుంగుడి నంబి శ్రీరామానుజులతో -"శ్రీరామానుజా! ఏమంత్రంతో లోకాన్ని వశీకరించుకొన్నారో, ఆ వేదమంత్రాన్ని నాకు తప్పక ఉపదేశించండి'' అని పల్కి, వారికి శిష్యుడై, భద్రాసనంలో వేంచేసి ఉండే శ్రీరామానుజుల ద్వారా ద్వయమంత్రాన్ని గ్రహించడం ద్వారా, ఆవిధంగా శ్రీరామానుజుల వైభవాన్ని ప్రకటించాడు.

**59.** **రక్షః క్ష్మాపతితనయాద్గతం తదుక్త్యా**
**న్యక్కుర్వద్గురుమపి యాదవప్రకాశః ।**
**దుగ్ధాబ్దేః ఫణిపతిరాస లక్ష్మణాత్మే-**
**త్యాఖ్యానాత్పునరధికాఞ్చి నష్టమూకః ॥**

బ్రహ్మరక్షస్సు యాదవప్రకాశుని తిరస్కరించినా, శ్రీరామానుజుల మాటను అనుసరించి రాజకుమారుని విడచివెళ్ళిపోయింది. క్షీరాబ్ధిలోనివారు ''ఆదిశేషుడే భూమిపై శ్రీరామానుజులుగా అవతరించాడు'' అని పల్కుతున్నారని కాంచీపురంలో జన్మించిన మూగవాడు ఒకడు, (తన మూగతనం తీరిపోగా) అని పలికాడు. ఈ విధంగా బ్రహ్మరక్షస్సు, మూగవాడు శ్రీరామానుజుల మహిమను ప్రకటించారు.

**60.** **ధిక్పాపాన్ మదవశగాంశ్చ లోకముక్తైః**
**కశ్చిన్మే స్వవశగ మాచరేజ్జనిత్వా ।**
**నష్ట స్స్యాత్కలిగరిమాపి తేన లోకాః**
**వీక్షధ్వం ధ్రువ మితి భాషణాచ్ఛఠారిః ॥**

**'ఏ! పావమ్! వరమే! ఏழ்ులకుమ్, ఈ పావమ్ శెయ్దు అరుళాల్ అళిప్పారార్?"** అని, **"ఆరానుమ్ ఆదానుమ్ శెయ్య, అకలిడత్తై ఆరాయ్న్దు అదు తిరుత్తలావతే"** ఇత్యాది తమ సూక్తులచే సంస్కరింపబడని లోకులను ఉద్దేశించి పల్కిన నమ్మాழ்్వార్లు **"పొలిగ పొలిగ పొలిగ.... కలియుమ్ కెడుమ్ కణ్డు కొణ్మిన్"** అని ("లోకులారా! కలి ప్రభావం నశించబోతున్నది, చూడండి ఒకానొక మహానుభావుడవతరించబోతాడు. ఇది నిజం'') అని పల్కి శ్రీరామానుజుల వైభవాన్ని వ్యక్తం చేశారు.



**61.** **న్యస్తం యజ్జల మధిగోష్పదం యది స్యా-**
**దాస్వాద్యం చటకగణస్య వాస్తదేవ ।**
**న్యస్తం చేన్మహతి జలాశయే కృతార్థాం**
**క్ష్మాం కుర్యాదితి గదనేన నాథయోగీ ॥**

"గోష్పాదమంతచోట నిండిన పానీయాన్ని పిచ్చుక తాగి జీవిస్తుంది. ఆ నీరే పెద్ద జలాశయంలో నిండితే దానివల్ల లోకం అంతా కృతార్థ మవుతుంది" అని నాథమునులు అనడం ద్వారా (శ్రీరామానుజులను గొప్ప జలాశయంలో పోల్చడం ద్వారా) వారి వైభవాన్ని ప్రకటించారు.

దీని భావమేమి? అంటే- మిగిలిన ఆచార్యులను అందిన జ్ఞానం గోష్పాదంలోని జలం వంటిదని, శ్రీరామానుజులకు అందిన జ్ఞానం సకలజగత్తు దాహం తీర్చుకోవడానికి, జీవించడానికి పర్యాప్తమైన జలంవంటిదని ఈ పోలికలోని తాత్పర్యం. **"పారులకిల్ ఆశైయుడైయోర్ క్కెల్లామ్ ఆరియర్కాళ్ ! కూరుమ్"** అనే రీతి లోనిది కదా శ్రీరామానుజుల హృదయవైశాల్యం.

**62.** **సచ్ఛాత్రో గురురధికాఞ్చి యామునేయో**
**దృష్ట్వా తం స్థిత ముపయాదవప్రకాశమ్ ।**
**రాద్ధాన్తం కిమయ మయేత నో మహాత్మే-**
**త్యాభాష్య స్ఫురితకటాక్షవీక్షణేన ॥**

తన శిష్యులతో కూడిన యామున గురువులు కాంచీనగరంలో శ్రీరామానుజులను యాదవ ప్రకాశులవద్ద చూచి, "ఈ మహాత్ముడు మన సిద్ధాంతంలోకి ప్రవేశిస్తాడా?'' అని వికసించిన కటాక్షవీక్షణాలతో కటాక్షించారు.

"ఆమ్ ముదల్వనివన్" అని శ్రీయామునులు శ్రీరామానుజులు కటాక్షించారనే విషయం ప్రసిద్ధం కదా! ఈ విధంగా శ్రీరామానుజుల భవిష్యదాచార్యత్వాన్ని సూచించి యామునులు వారి వైభవాన్ని ప్రకాశింపజేశారు.

63. హిత్వా మాం గురువచనాతిగం జనానాం
ముక్తి స్స్యాదితి గదతోస్య గూఢమర్థమ్ ।
శిష్యం స్వం సుత ముపపాద్య దర్శనం త్వ-
న్నామ్నా స్యాదితి భణనేన గోష్ఠిపూర్ణః ॥

"ఆచార్యాజ్ఞను ఉల్లంఘించిన నాకు తప్ప, మిగిలినవారికి ముక్తి లభిస్తుంది కదా" అని పల్కిన శ్రీరామానుజుల వచనాల ఆంతర్యాన్ని గుర్తించిన గోష్ఠీపూర్ణులు తన కుమారుని వారికి శిష్యులుగా చేసి, "ఈ సిద్ధాంతం ఇక మీపేర వ్యవహరింపబడుతుంది" అని పల్కడం ద్వారా శ్రీరామానుజవైభవాన్ని ప్రకటించారు.

64. స్వచ్ఛాత్రం తముపగతం విలోక్య హృష్టో
మన్వానో నిజగురుమేవ యామునేయమ్।
ఉత్థానాద్యువతిసఖో మహార్ణపూర్ణః
కుర్వాణో నిజతనయం చ తస్య శిష్యమ్॥

తమ శిష్యులైన శ్రీరామానుజులు తమకు అభిముఖంగా రావడం గమనించి ఆనందించినవారై మహాపూర్ణుల వారిని తమ ఆచార్యులైన యామునులుగా తలచి, పత్నీసహితంగా లేచి నిలబడి గౌరవించడం ద్వారా, తమ కుమారుని వారికి శిష్యునిగా చేయడం ద్వారా శ్రీరామానుజుల మాహాత్మ్యాన్ని ప్రథితం చేశారు.

65. తస్యాభ్యుద్గమనపరః ప్రసాదహస్తో
నాపశ్యం చతసృషు వీథికాసు కఞ్చిత్ ।
మత్తోల్పం జనమితి సఙ్కలయ్య శిష్య-
త్వాధానాత్ స్వతనుభువో వృషాద్రిపూర్ణః ॥

శ్రీరామానుజులు వేంకటాచలానికి వెళ్ళినపుడు శ్రీవేంకటేశ్వరుని ప్రసాదాన్ని తీసికొని తిరుమలనంబి వారికి ఎదురేగారు. అంతేకాక, తిరుమల లోని నాల్గు వీథులలో ఎంత పరికించి చూచినా తమకంటే తక్కువవారెవరూ కన్పించలేదని, అందువల్ల వారి (రామానుజుల) కోసం తామే స్వయంగా వచ్చానని పలికారు. అంతేకాక, తమ పుత్రుని రామానుజులకు శిష్యునిగా చేశారు. ఈ విధంగా తిరుమలనంబి శ్రీరామానుజవైభవాన్ని ప్రకటించారు.

66. శ్రీమాలాధరవిబుధ శ్శఠారిసూక్తి-
స్తోమార్థావనసమయే నవీన మర్థమ్।
తేనోక్తం గురుగదితం స గోష్ఠిపూర్ణా-
చ్ఛ్రుత్వాస్మిన్ సహ తనయేన శిష్యభావాత్॥

తిరుమాలైయాణ్డాన్ సన్నిధిలో శ్రీరామానుజులు శఠకోపసూరి అనుగ్రహించిన తిరువాయ్మొழி పాశురాల అర్థాన్ని వినేటపుడు, నూతన మైన అర్థాలను పల్కగా, వానిని ఆణ్డాన్ అంగీకరించకుండా, కాలక్షేపాన్ని నిలిపివేశారు. కాని, తరువాత గోష్ఠీపూర్ణులవల్ల వానిని ఆచార్యులైన శ్రీ యామునులు పల్కినట్లుగా తెలిసికొని, తమ కుమారుని శ్రీరామానుజులకు శిష్యులుగా చేశారు. ఈవిధంగా వారు శ్రీరామానుజ మహిమను వ్యక్తంచేశారు.

67. శ్రీరఙ్గామృతవిబుధో యతీన్దునాథూ-
స్స్రాత్తా కలికలుషార్దితేతివాదాత్।
ఇత్థం తే భువి సకలాతిశాయి తేజః
శ్రీరామానుజవిదుషః ప్రచక్షతే స్మ॥

తిరువరంగత్తుముదనార్ తాము రచించిన ఇరామానుశ నూற்றந்దాది ప్రబంధంలో -"కలిపురుషునిచే పీడింపబడిన లోకాన్ని యతిరాజచంద్రులు

రక్షించారు'' అని పలికారు. ఈవిధంగా వారంతా లోకంలో అందరికంటే మించిన గొప్ప తేజస్సును కల శ్రీరామానుజ విబుధుల వైభవాన్ని వ్యక్తంచేశారు.

**"కడలళైవాయ తిశై యెట్టి నుళ్ళుమ్ కలియిరుళే మిడైతరు కాలత్తి రామానుశన్ మిక్క నాన్మఱైయిన్ శుడరొళియాల్ అవ్విరుళై త్తురన్దిలనేల్ ఉయిరై యుడైయవన్ నారణన్ - ఎన్ఱఱివారిల్లై యుఱ్ఱుణర్న్దే"** (చతుః సముద్రపర్యంతమైన ఎనిమిది దిక్కులలో కలి అనే చీకట్టిదట్టంగా ఉండే కాలంలో, శ్రీరామానుజులు చతుర్వేదాలలోని అంతు లేని తేజస్సుతో ఆ కలి దోషాన్ని పోగొట్టకపోతే, జీవాత్మలకు శేషి నారాయణుడే- అని నిశితంగా గ్రహించగలిగేవారు లేరు) అని తెలిపే ఇరామానుశనూఱ్ఱన్దాదిలోని 59వ పాశురం స్మరణీయం.

**68. శ్రీరఙ్గాధిపజలధే స్సరః పురోగైః**
**కాలాబ్డై ర్ధృత మధినాథయోగిమేరు।**
**ఉత్స్పృష్టం గురువరరామమిశ్రపద్మా-**
**క్షోత్సాభ్యాం స్రుత మురుయామునేయనద్యామ్॥**

శ్రీరంగనాథుడనే సముద్రం నుండి సరోయోగిమొదలైన కాలమేఘాలు కరుణ అనే జలాన్ని గ్రహించి నాథముని అనే పర్వతంపై వర్షించాయి. ఆ జలం శ్రీరామమిశ్రులు, పుండరీకాక్షులు రూపంలోని కొండ ఊటల ద్వారా యామునులనే నదిలోకి ప్రవహించింది.

**"ఉత్సః ప్రస్రవణమ్"**- అని ఉత్సశబ్దం కొండనుండి ఊరే నీటి ఊటను తెల్పుతుంది.

**69. సంపృక్తం శుభగుణలక్ష్మణార్యధారా-**
**బద్ధాన్తర్భరిత మనేకధా ప్రవృత్తమ్ ।**
**కూరేశప్రథితవధూలదాశరథ్యాది-**
**చ్ఛాత్రభ్రమపరివాహయన్త్రమార్గైః ॥**



ఆ జలం అక్కడనుండి శ్రీరామానుజులనే తటాకం చేరింది. అక్కడనుండి అనేక విధాలుగా కూరేశులు, దాశరథి మొదలైన పలువురు సదాచార్యులనే పలు తూములద్వారా వెలువడింది.

**70. సంసార్యుత్నతవిషయం ప్రసిచ్య తస్మిన్**
**తన్వానా ప్రపదనసస్యకన్దలాని।**
**కారుణ్యామృత మధునాఖిలస్య జన్తో**
**స్సన్ధత్తే ఫల మనపాయిముక్తిరూపమ్॥**

సంసారులనే ఎత్తైన ప్రదేశాలకు ఆ నీరు చేరి, శరణాగతులనే సస్యాన్ని వృద్ధిచేసింది. ఇపుడు ఆ కారుణ్యామృతరసం సకల ప్రాణులకు ఏ అపాయం లేని ముక్తిరూపమైన ఫలాన్ని ఇస్తున్నది.

**"అనపాయిముక్తిరూపమ్"** అనేసూక్తికి అనుగుణంగా **"న చ పునరావర్తతే"** ఇత్యాది శ్రుతులు స్మరణీయాలు.

68, 69, 70వ శ్లోకాలు మూడు **"లక్ష్మీనాథాఖ్యసింధౌ శఠరిపు జలదః ప్రాప్య కారుణ్యనీరం నాథాద్రావభ్యషించత్, తదను రఘువరాంభోజ చక్షుర్ఝరాభ్యామ్, గత్వా శ్రీయామునాఖ్యం సరిత మథ యతీంద్రాఖ్య పద్మాకరేంద్రం సంపూర్ణప్రాణిసస్యే ప్రవహతి సతతం దేశికేంద్రభ్రమౌఘైః"** అనే సుప్రసిద్ధశ్లోకాన్ని తలపిస్తున్నాయి. **"కందల"** శబ్దానికి నవాంకురమని అర్థం. **"కందళం త్రిషు కలాపేఽ ప్యుపరాగే నవాంకురే"** అని హైమనిఘంటువు. ఈ అర్థంలో ఉత్తరామ చరితంలో (3-40) ప్రయోగింపబడిందికూడా.

**71. చోళోభూదథ కులపాంసనో నృశంసో**
**దోషాణా మివ కలిజన్మనాం సమూహః ।**
**తద్వంశక్షయకరణాయ మన్త్రినీత్యా**
**పాణ్డ్య స్తం వ్యతనుత శైవమార్గనిష్ఠమ్ ॥**

శ్రీరామానుజుల కాలంలో చోళదేశపురాజు (రెండవ కులోత్తుంగ చోళుడు) కులానికి కళంకంవంటివాడు, దయావిహీనుడు, కలిదోషంతో జన్మించినవారి దోషాల సమూహంవంటివాడు. అతని వంశాన్ని నశింప జేయడంకోసం పాండ్యరాజు మంత్రినీతితో అతని శైవమతాభిమానిగా చేశాడు.

72. దుర్మేధాః పరుషపురోహితానురోధీ
నిర్భిద్య త్రిభువననాయకస్య విష్ణోః।
ధామైకం సులలితచిత్రకూటముఖ్యం
పాథోధేః పయసి స పాతయాంబభూవ॥

(సహజంగానే) దుర్బుద్ధి, దానికితోడు, క్రూరస్వభావుడైన పురోహితుని అనుసరించాడు. అందమైన తిల్లైతిరు చ్చిత్తిరకూటంలోని విగ్రహాన్ని భిన్నం చేసి, దానిని సముద్రగర్భంలో పడవేయించాడు.

73. ఆస్థాన్యా మఖిలవిపశ్చితాం పురస్తా-
దాహూత స్వవిషయవాసివైష్ణవేభ్యః।
ఆదిత్సత్ పర తర మస్తి నో శివాది-
త్యాబద్ధాక్షరపద ముచ్చకై స్స పత్రమ్॥

తన ఆస్థానంలో విద్వాంసులందఱు ఎదురుగా తన దేశంలో ఉండే వైష్ణవులను సభకు పిలిపించి, శివునికంటే వేఱొక పరతత్త్వం లేదని వ్రాయబడిన పత్రంలో సంతకం చేయమని వారిని చోళరాజు నిర్బధం చేయించ సాగాడు.

"ఉచ్చకైః"- అంటే బిగ్గరగా - అనిఅర్థం.

74. చోలస్య శ్రుతికటుచేష్టితం యతీన్ద్రః
శ్రుత్వాథ శ్రితవిమలామ్బర స్స రఙ్గాత్।
శ్రీరఙ్గిన్! అవ తవ ధామ దర్శనం చే-
త్యుక్త్వా ప్రాస్థిత వినివేశ్య కూరనాథమ్॥



వినడానికి కటువైన చోళుని ఈ దుష్కృత్యాన్ని విని, శ్రీరామానుజులు శ్వేతవస్త్రాలను ధరించినవారై, "శ్రీరంగనాథా! ఇక నీ ఆలయాన్ని దర్శనాన్ని నీవే కాపాడుకో" అని ప్రార్థించి, మఠంలో కూరేశులను నిలిపి, శ్రీరంగనుండి బయలుదేరారు.

75. నిర్యాతో యతిపతి రాగతం గ్రహీతుం
చోలేన ప్రహితబలం విలోక్య పశ్చాత్।
వన్యక్ష్మాపథసికతావలీః కిరద్భి
స్స్వచ్ఛాత్రైర్ద్రుత మభిమన్త్రితా న్యరౌత్సీత్॥

ఆ విధంగా ప్రయాణం చేస్తూ ఉండగా, దారిలో శ్రీరామానుజులు, తమను బంధించడం కోసం పంపబడిన రాజసైన్యం తమను వెంబడించడం చూచారు. అపుడు వారు అరణ్యభూమి మార్గంలోని ఇసుకను తీసి అభిమంత్రించి, దానిని తమ శిష్యులద్వారా రాజభటులపై జల్లేటట్లు చేసి ఆచోళరాజ భటులను ముందుకు రాకుండా నిరోధింపజేశారు.

ఈ సందర్భాన్ని గురుపరంపరాప్రభావం- "ఉడైయవరుమ్ వలియిల్ మణలై అళ్ళి "కొడుమై శెయ్యుమ్ మాఱ్ఱముమ్ ఎన్ కోలాడి కుఱుకై శేవకనే" -ఎన్ఱు ఇత్తైయోడు అవర్కళ్ వరుకిఱ వళియిలే ఒళుఙ్గి వారుఙ్గోళ్" ఎన్ఱు, ముదలికళుమ్ అప్పడియే శెయ్య, రాజమనుష్యర్ అన్ద మణలై మిదిత్తు అప్పాల్ అడియిడ ప్పోకామల్, "పోకిఱ పార్ప్పార్ మంత్రవాదమ్ పణ్ణిప్పోనార్కళ్" ఎన్ఱు మీణ్డుపోక" ఇత్యాదిగా తెల్పింది. (శ్రీరామానుజులు, దారిలోని ఇసుకను తీసికొని, "కొడుమైశెయ్యుమ్ కూఱ్ఱముమ్ శార్ఙ్గవిల్ శేవకనే!" - పర్వతాలవంటి బలిష్ఠాలైన బాహువులను కల చక్రపాణీ! శార్ఙ్గమనే వింటిని ఏలేవాడా! క్రూరుడైన యముడు కూడా నేను కక్రతో గీచిన గీతను

దాటి రాలేదు సుమా!- అని మంత్రించి, ఆ ఇసుకను తీసికొని "దీనిని రాజభటులు వచ్చే దారిలో జల్లండి" అని అన్నారు. వారు కూడా ఆ విధంగానే చేయగా, రాజభటులు, ఆ ఇసుకను తొక్కి, అక్కడ నుండి ముందుకు పోలేక "పోయే బాపనవారు ఏదో మంత్రప్రయోగాన్ని చేశారు" అని పల్కి వెనక్కి వెళ్ళిపోయారు.)

**76.** మార్గే స ప్రతివసతి ప్రజా స్తతస్త్యాః
రక్షిత్వా విరచితభీరుశూద్రమోదమ్।
ఆలోకై ర్నిజచరితప్రదర్శనాచ్చ
శ్రీనారాయణపుర మాసదద్విషణ్ణః ॥

దారిలో శ్రీరామానుజులు అక్కడ ఉండే ప్రజలను తమ కటాక్షాలతో, తమ చరిత్రలను ప్రదర్శించడంతో రక్షిస్తూ, శూద్రులకు ఆనందాన్ని కల్గిస్తూ, తిరునారాయణ పురాన్ని చేరారు. శ్రీరంగాన్ని వదలి వచ్చినందుకు చాలా విచారాన్ని పొందారు.

**77.** తత్సైన్యం యతిపతిమన్త్రితప్రకీర్ణై
స్సంరుద్ధం పథి సికతాభరై ర్నివృత్తమ్।
ఆనైషీన్నృపసవిధం మహార్హపూర్ణం
శ్రీరఙ్గాత్సహ యతివేషకూరభర్త్రా ॥

చోళరాజు పంపిన సైన్యం దారిలో శ్రీరామానుజులు అభిమంత్రించి, వెదజల్లిన ఇసుకతో అడ్డగింపబడినదై, వెనుకకు తిరిగి వెళ్ళిపోయింది. శ్రీరామానుజుల రూపంలో ఉండే కూరేశులతో పాటు, పెరియనంబిని కూడా శ్రీరంగం నుండి రాజసభకు తీసికొనిపోయారు.

**78.** పత్రేస్మిన్ పరతరమస్తి నో శివాది-
త్యాధాతుం లిపి మధిగోష్ఠి విద్వదగ్రే ।
చోలేనానుమతపురోధసేతి పృష్టౌ
తౌ న్యాయ్యా మితి వదత స్స వాచ ముచ్చైః ॥



చోళరాజు పురోహితుని (నాలూరాన్) అనుమతితో సభలో విద్వాంసుల ముందు "శివునికంటే పరతత్త్వం ఇంకొకటి లేదని వ్రాయబడిన ఈ పత్రంలో సంతకం చేయండి" అని బిగ్గరగా కూరేశులతో, మహాపూర్ణులతో అన్నాడు.

**79.** అన్యాయ్యం తదిహ హరిం వినా వరీయ-
స్త్రత్రేత్థం నృపతినియోగదత్తపత్రే ।
మానార్థం శివపద మాకలయ్య తస్మాత్
ద్రోణశ్చాస్త్యధిక మితి స్ఫుటాక్షరాణి॥

శివుని విష్ణువుకంటే పరునిగా పల్కడం అన్యాయ్యం. ఈ విధంగా చోళరాజు సంతకంటే చేయమని ఆజ్ఞాపించిన పత్రంలోని శివశబ్దాన్ని కూరేశులు కుంచం అనే కొలమానం అనే అర్థంలో గ్రహించి "ద్రోణ మస్తి తతః పరమ్" -కుంచంకంటే తూము అనే పెద్ద కొలత ఉన్నది" అని స్ఫుటమైన అక్షరాలను వ్రాశారు.

**80.** తాదృక్షాం లిపి మవలోక్య తం చతుర్గ్రా-
మణ్యుక్త్యా కపటమతిం చ తత్ర మత్వా ।
క్రోధాన్ధ స్స వయన మన్ధ మస్య చక్రే
స్వం ద్రష్టు ర్ధ్రువ మఘనిష్కృతిం విధాస్యన్ ॥

ప్రభువు ఆ వ్రాతను చూచి, నాలూరాన్ మాటతో కూరేశులను కపటస్వభావాన్ని కలవారని భావించాడు. క్రోధాంధుడై వారి కన్నులను పీకించమన్నాడు. అటువంటి పాపిష్ఠివానిని చూడడం మహాపాపమని తలచి, దానికి ప్రాయశ్చిత్తంగా కూరేశులు తమ కన్నులను తామే తీసివేసికొన్నారు.

"చతుర్గ్రామణి" అంటే నాలూరాన్. ఇతడే చోళరాజు మంత్రి ప్రోద్బలం వల్లనే చోళరాజు రామానుజులకు హానిని తలపెట్టాడు.

**81.** దాసేన వ్రజకృతనిష్ఠురప్రహారైః
వీతాసుం సదసి మహార్హపూర్ణసూరిమ్ ।

కూరేశం తమపి నృపోక్షిపత్పురాత్స్వాత్
ఆయుష్య ద్రవిణహరా వివ స్వకీయాత్ ॥

రాజసభలో రాజభటులు కొట్టిన గట్టి దెబ్బలవల్ల మహాపూర్ణులు ఆసభలోనే పరమపదించారు. రాజు తన నగరంనుండి కూరేశుల మహాపూర్ణులను నిర్దయగా ప్రాణాలను, ధనాన్ని దొంగిలించినవారిని వలె బయటకు గెంటించాడు.

ధనాన్ని, ప్రాణులను హరించేవారికి దేశబహిష్కారశిక్ష చెప్పబడింది. పలువురి బాలుర ప్రాణాలను తీసిన అసమంజసుడనే తన కుమారునకు సగరుడు దేశబహిష్కార శిక్షను వేశాడు కదా !

82. కూరేశ స్సహ సపరాన్తకద్విజేంద్రైః
స్సంస్కృత్యోచితవిధినా మహార్హపూర్ణమ్।
శ్రీరఙ్గం ప్రతిగతవా నుదన్త మేనం
ప్రాహైషీద్యతిపతయే స్పశేన గుప్తమ్॥

కూరేశులు పరాంతకమనే చోట అక్కడ ఉండే వైష్ణవుల సహాయంతో తగిన రీతిలో మహాపూర్ణులకు చరమసంస్కారాలను నిర్వహించారు. శ్రీరంగంవైపు ప్రయాణం సాగించారు. విశ్వసనీయుడైన చారునిద్వారా జరిగిన సంగతిని శ్రీరామానుజులకు తెలియజేశారు.

"చరః స్పశః, చారశ్చ గూఢపురుషశ్చ" అని అమరం. గూఢచారి అని దీని అర్థం. "స్పశ్-గతౌ" అనే ధాతువునుండి పుట్టిన ఈపదానికి రహస్యంగా సంచరించేవాడని అర్థం.

83. చారోక్తం శ్రుతిభిదురం నిశమ్య వృత్తం
శోకాన్ధో యతితిలకో రుషార్ఘ్యకాలే ।
దత్తార్ఘ్యోధిక మభివేఙ్కటేన్ద్ర చోల-
స్యారేభే ప్రలయకృతే వినాభిచారమ్ ॥



చెవులను భేదించే ఈ సంగతిని చారుడు చెప్పగా విని యతితిలకులు అయిన శ్రీరామానుజులు శోకాంధులయ్యారు. తాము సంధ్యావందన సమయంలో అర్ఘ్యప్రదానాన్ని చేసేటపుడు శ్రీవేంకటేశుని ఉద్దేశించి చోళుని నాశనంకోసం అర్ఘ్యాన్ని ఇచ్చి, పక్షిరాజుద్వారా అభిచారహోమాన్ని చేయించారు.

84. త్యాగేశః పురజిదుపేన్ద్రభక్తముఖ్యః
చోలేశాన్వయ వసుధాధిపత్యముద్రామ్।
అద్యాదా మితి కమఠాలయే శరీరం
వాగ్భేరీం ముఖరయతిస్మ గోపురాగ్రే॥

(విష్ణుభక్తుడైన) త్యాగేశుడనే పేరు కల మహాదేవుడు శ్రీకూర్మదేవుని మందిరంలో అశరీరవాణి ద్వారా చోళవంశ రాజ్యాధికార ముద్రను తాను గ్రహిస్తున్నట్లు ఉద్ఘోషించాడు.

చోళరాజ్యాధికారాన్ని, లయకారకుడైన శివుడు గ్రహించడమంటే- ఆ ప్రభువు మరణించడమే.

85. శ్రీరామానుజవిబుధార్ఘ్యచోదిత స్సన్
ప్రహ్లాదోత్సుకనృహరిర్యథా హిరణ్యమ్ ।
వివ్యాథ క్షితిపతి మాయుధేన కణ్ఠే
నిద్రాణం నిశి నిశితేన వేఙ్కటేశః ॥

ప్రహ్లాదుని పట్ల వాత్సల్యాన్ని కల నరసింహుడు హిరణ్యుని చీల్చినట్లుగా, శ్రీరామానుజులు సమర్పించిన అర్ఘ్యంతో ప్రేరేపింపబడిన వేంకటేశ్వరుడు, తన పదునైన చక్రాయుధంతో ఆ చోళరాజు కంఠాన్ని అతడు నిద్రిస్తూ ఉండగా ఖండించాడు.

86. తద్ధేతిప్రదలితకణ్ఠనాలరన్ధ్రాత్
నిస్సీమౌషధి మనుభేదదుర్నివారాత్।

ఉత్తస్థౌ క్రిమిపటలం యత స్తదాసీత్
తస్యాప్త క్రిమిగలనామ పాపలక్ష్మ ॥

ఆ ఆయుధంచేత ఖండింపబడిన చోళరాజు కంఠనాళ రంధ్రం ఎంత గొప్ప ఔషధులకు, మంత్రాలకు కూడా నయం కాలేదు. ఆ కంఠనాళ రంధ్రంనుండి కృమి సమూహం వెలువడింది. అందువల్ల, అతడు చేసిన ఆ పరమపాపిష్ఠి కర్మకు గుర్తుగా కృమికంఠుడనే పేరు ప్రసిద్ధమైనది.

87. ఉద్భూతై ర్విసృమరదేహవిస్రగంధైః
చోలేశం జ్వలితచితాగ్నిదగ్ధగాత్రమ్।
స జ్ఞాత్వా ఫణిచి(కృ)తిహోమతో వ్యరంసీత్
తద్వ్యాహారకపరిచారకాగమార్థీ॥

బయటికి వెలువడి అంతటా వ్యాపించిన దేహంలోని అపక్వమాంస గంధాలను బట్టి మరణించిన దేహం చితాగ్నిలో దహింపబడుతున్నదని గుర్తించి శ్రీరామానుజులు హోమాన్ని విరమింపజేసి, చోళుని మృతిని తెలియజేసే పరిచారకుని రాకకోసం ఎదురుచూచారు.

**"విస్రం స్యాదామగంధి"** అనే అమరకోశవచన ప్రకారం అపక్వమాంస గంధానికి విస్రమని పేరు. శ్రీరామానుజులు చోళుని వినాశాన్ని ఉద్దేశించి చేసిన హోమాన్ని గూర్చి శ్రీరామానుజవైభవం ఈవిధంగా తెల్పింది. **"ఞానవేన్దర్ ఆకైయాల్ ఉవమైయిల్లార్, పాతక క్కిరుమికండన్ ప్పొన్దిడ ప్పడిమేల్ ఓమమ్ వేదమన్దిరత్తాల్ పణ్ణి విళఙ్గుమ్ క్కనవిల్ ఆజ్గే ఓదుమోర్ కుఱియై నోక్కి ఉలకినై క్కెడుత్త మన్ ఇప్పోదు ఇవన్ నశిత్తాన్ ఎన్న ప్పూరై యిట్టిరున్దార్ అన్నాళ్"**. (సాటి లేని జ్ఞానం కలవారైనందున శ్రీరామానుజులు పాతకుడైన క్రిమికంఠుడు నశించడంకోసం భూమిలో వేదమంత్రాలను ఉచ్చరిస్తూ హోమం చేసేటపుడు జ్వలించే ఆ హోమాగ్నిలో అక్కడ వ్యక్తమైన ఒక చిహ్నాన్ని చూచి, లోకాన్ని పాడుచేసిన రాజు ఇపుడు ఈ భూమిలో నశించాడు - అని హోమాగ్నిలో సమర్పించవలసినది సమర్పించారు)



88. ఆయాతాద్యతిపతిరాకలయ్య శిష్యాత్
చోలేశం వృషగిరినాథహేతివిద్ధమ్।
నిష్ఠ్యూతక్రిమిపటలాద్గలాత్ప్రరాసుం
ప్రీతోదా న్మనుమణిపూర్ణపాత్ర మస్మై॥

శ్రీరామానుజులు తమవద్దకు వచ్చిన శిష్యునివల్ల **(మాఱొన్ఱిల్లామారుతి యాణ్డాన్ వల్ల)** శ్రీవేంకటేశుని ఆయుధప్రహారంచేత చోళప్రభువు ఖండింపబడ్డాడని, కృమి సమూహం వెలువడే కంఠంనుండి అతని ప్రాణాలు పోయాయని తెలిసి శ్రీరామానుజులు ఆనందించి, ఆ శిష్యునకు ద్వయమంత్రోపదేశాన్ని చేశారు.

89. శ్రీనారాయణపురి సమ్పదాత్మజాఖ్యం
కల్యాణాహ్వయసరసీతటే ముకున్దమ్।
ఉత్పాద్య కృతసదశోత్తరద్విచత్వా-
రింశత్కైఙ్కరనికరార్చితం యతీన్ద్రః॥

తిరునారాయణపురంలో కల్యాణపుష్కరిణీతీరంలో సంపత్కుమారు లనే పేరు గల అర్చామూర్తిని ప్రతిష్ఠించి, ఆ దివ్యదేశంలో **"ఐమ్బత్తిరువర్"** అనే పేరుతో ప్రసిద్ధులైన యాభైరెండుమంది కైంకర్యపరులను శ్రీరామానుజులు వివిధ కైంకర్యనిర్వహణకోసం నియమించారు.

**"దశోత్తరద్విచత్వారింశత్"** - అంటే యాభైరెండు.

90. శ్రీనారాయణనగరోషితా యతీన్ద్రోః
ప్రస్థానోత్సుకమనసో ముకున్దభక్తాః।
కృత్వార్చాకృతి మురుశక్తి మర్చయన్తో
నిన్యు స్తద్విరహరుజం యథా కథఞ్చిత్॥

శ్రీరంగానికి శ్రీరామానుజులు తిరిగి ప్రయాణమైనపుడు తిరు నారాయణపురంలో నివసించే భగవద్భక్తులు గొప్ప శక్తిని కల శ్రీరామానుజుల

అర్చామూర్తిని నిర్మింపజేసి, దానిని అక్కడ ప్రతిష్ఠింపజేసి, ఆరామానుజుల విరహాన్ని ఏదో ఒకవిధంగా సహించారు.

**91.** నిర్యాత స్వపరిజన స్తతోఞ్జనాద్రే-
ర్మూలే శ్రీపురి వినిధాయ చోలలుప్తమ్।
గోవిన్దాధిప మథ చిత్రకూటనాథం
విష్ణూనాం ఖిలభవనాప్యతిష్ఠిపత్సః॥

అక్కడ నుండి పరివారసహితంగా తిరిగి బయలుదేరిన శ్రీరామానుజులు శ్రీవేంకటాద్రిని చేరి, ఆ కొండసమీపంలో చోళుని వల్ల లుప్తమైన తిరుచిత్తిర కూటంలోని గోవిందరాజస్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠింపజేశారు. ఆ విధంగానే ఖిలమైన విష్ణుదేవాలయాలను పెక్కింటిని తిరిగి ప్రతిష్ఠచేశారు.

క్రీ.శ.1127వ సంవత్సరంలో తిరుపతిలో గోవిందరాజ అర్చామూర్తి ప్రతిష్ఠ జరిగింది.

**92.** శ్రీరఙ్గం పున రధిజగ్ముషః ప్రవాచో
భద్రాశాసనకరణేషు రఙ్గరాజః।
అభ్యర్ణే యతితిలకస్య కూరనాథం
దృష్ట్వా తం కిమపి వచోవదద్దయాలుః ॥

శ్రీరంగానికి తిరిగి చేరిన శ్రీరామానుజులు ఆ స్వామికి మంగళాశాసనాన్ని చేశారు. అపుడు శ్రీరామానుజుల సమీపంలో ఉండే కూరేశులను చూచి దయాస్వభావుడైన శ్రీరంగనాథుడు ఈ విధంగా అన్నాడు.

"ఉపకంఠాంతికాభ్యర్ణ" ఇత్యాది అమరకోశవచనం వల్ల అభ్యర్ణమంటే సమీపం.

**93.** కూరేశ ! త్వమభిమతం వరం వృణీష్వే-
త్యాఖ్యాతః పరమపదం తత స్స వవ్రే।



తత్పశ్చాదితి జగదే హరి స్స రామో
నో వక్తి ద్విరితి వదం స్తదాప తస్మాత్ ॥

"కూరేశా ! మీకభిమతమైన వరాన్ని కోరుకోండి". అపుడు కూరేశులు పరమపదప్రాప్తిని కోరుకొన్నాడు. దానిని తరువాత ఇస్తానన్న స్వామితో కూరేశులు "స్వామీ! నీవు సత్యవాదివి. "రామోర్ద్విర్నాభిభాషతే" శ్రీరాముడు రెండు మాటలు పలుకడు - అని కదా ప్రసిద్ధి - అని పరమపదాన్ని అనుగ్రహించడానికి వెనుకాడే శ్రీరంగనాథునితో పలుకగా, ఇక శ్రీరంగనాథుడు ఏమీ బదులు పలుకలేక, పరమపదాన్ని కూరేశులకు అనుగ్రహించాడు.

శ్లోకంలోని "స్స రామో నో వక్తి ర్ద్విః" అని ప్రయోగం శ్రీరామాయణంలోని "రామో ర్ద్విర్నాభిభాషతే" అనే సూక్తిని స్మరింపజేస్తుంది.

**94.** రఙ్గేశః పరమపదోపలబ్ధిచిహ్నం
దత్వాన్నం బహుమతివస్తు కూరభర్త్రే।
తత్సూనుం స్వసుతమయా న్నిశామ్బుపానాత్
సశ్రీకః శ్రుతిగురుభట్టనామధేయమ్ ॥

శ్రీరంగనాథుడు పరమపదప్రాప్తికి చిహ్నమైన పాయసాన్నాన్ని కూరేశులకు ఇచ్చాడు. ఆ ప్రసాద ప్రభావంవల్ల జన్మించిన శ్రీపరాశరభట్టర్‌ను తాను, లక్ష్మీదేవి కలసి తమ పుత్రునిగా అభిమానించి, ఆ బాలుని రాత్రివేళ లాలిస్తూ నీటిని తాగించారు.

**95.** ఇత్థం ప్రాప్తే సపది పరమవ్యోమ శిష్యాగ్రగణ్యే
కూరాధీశే నిగమశిఖరవ్యాక్రియాలమ్పటత్వమ్।
శిష్యస్తోమే శ్రుతిగురుముఖే రఙ్గికార్యేణ సాకం
విన్యస్యోచ్చైః పరమపద మథారోఢు మైచ్ఛద్యతీన్ద్రః ॥

ఈ విధంగా, శిష్యాగ్రగణ్యులైన కూరేశులు పరమపదాన్ని చేరగా, తరువాత, శ్రీరామానుజులు సిద్ధాంతప్రచారాన్ని, శ్రీరంగనాథుని కైంకర్యాల నిర్వహణను శ్రీపరాశరభట్టర్ మొదలైన తమ శిష్యసమూహానికి అప్పగించి, కొంత కాలానికి, పరమపదాన్ని తిరిగి చేరుకోవాలనే అభిలాషను మిక్కిలిగా కలవారయ్యారు.

సర్గాంతం కనుక ఈ శ్లోకం మందాక్రాంత వృత్తంలో రచింపబడింది.

**96.** **కాసారాదిమదివ్యసూరికృతసత్సోపానబద్ధాఞ్చయ-**
**శ్రీమన్త్రోభయపార్శ్వదణ్డఘటితాం శ్రీభాష్యకీలస్థిరామ్।**
**నిఃశ్రేణీం నిఖిలో జనశ్చ పరమవ్యోమస్థలీప్రాపికాం**
**స్వస్వాచార్యనిరూపితాధ్వవశతః ప్రాప్యాధిరోహేత్సదా ॥**

సరోయోగి మొదలైన దివ్యసూరులచే నిర్మింపబడిన గోష్ఠి అనే సోపానాలతో కూడినది, ద్వయమంత్రంలోని రెండు ఖండాలనే రెండు కర్రలను రెండు వైపుల కల్గినది, శ్రీభాష్యమనే మేకులతో గట్టిగా బిగింపబడినది అయిన పరమపదానికి చేర్చే నిచ్చెనను జనులంతా తమ తమ ఆచార్యులు చూపిన మార్గాన్ని అనుసరించి వర్తించి ఎక్కి పరమపదాన్ని అధిరోహించాలి.

ఈ శ్లోకం, తర్వాతి శ్లోకం శార్దూలవిక్రీడిత వృత్తంలో రచింప బడ్డాయి. **"ఇరుళకన్ఱ్రుమ్ ఏఱి కతిరోన్ మణ్డలత్తూడు ఏఱ్ఱి వైత్తు ఏణి వాఙ్గి"** అనే పెరియాళ్వార్ల సూక్తిలో పరమపదాన్ని చేరే మార్గం నిచ్చెనగా చెప్పబడింది.

**97.** **ఇత్యాశాస్య సరశ్శతాన్తకముఖశ్రీదివ్యసూర్యాకృతీ-**
**రర్చా స్స్వస్య చ తత్ప్రబన్ధనివహై స్సార్ధం ప్రతిష్ఠాప్య నః।**
**శ్రీరఙ్గాదిమధామసు స్వయ మభూచ్ఛ్రీదివ్యసూరివ్రజైః**
**తైస్సాకం పరమం పదం జిగమిషూ రామానుజాఖ్యో మునిః ॥**



ఈ విధంగా శ్రీరామానుజులకు జనులందఱిని ఉద్దేశించి ఉపదేశించి, శ్రీరంగాది దివ్యదేశాలలో సరోయోగి, శఠకోపసూరి మొదలైన దివ్యసూరులు అనుగ్రహించిన దివ్యప్రబంధాల అనుసంధానంతో పాటు, ఆ దివ్యసూరుల అర్చామూర్తులను స్థాపించి ఆ మూర్తులతోపాటు తమ మూర్తులను కూడా స్థాపింపజేశారు. ఈ విధంగా తమ అవతారకృత్యాన్ని పరిసమాప్తి గావించి, స్వయంగా పరమపదాన్ని చేరుకోవాలనే తీవ్రమైన ఆశతో శ్రీరామానుజులున్నారు.

ఈ శ్లోకాన్నిబట్టి ప్రస్తుత గ్రంథప్రణీత ఈకావ్యరచనను శ్రీరామానుజుల చరమదశలో పూర్తి చేసినట్లు తెలుస్తున్నది. తిరుపతిలో గోవిందరాజ ప్రతిష్ఠ క్రీ.శ.1127లో జరిగింది. అందువల్ల ఈ కావ్యరచన క్రీ.శ. 1130-37 ప్రాంతంలో జరిగినదని అభ్యూహించవచ్చు. **"త్ర్యాశాభిర్మనజరగాః ప్రహర్షిణీయమ్"** అనే లక్షణాన్ని కల ప్రహర్షిణీ వృత్తంలో ఈ రెండు సర్గలలోని శ్లోకాలు రచింపబడ్డాయి. శ్రోతృజన ప్రహర్షాన్ని కల్గించే శ్రీరామానుజ చరిత్రను ప్రహర్షిణీ వృత్తంలో కూర్చడం అనేది కవి ప్రదర్శించిన ఒక వృత్తౌచిత్యం.

శ్రీదివ్యసూరిచరితాఖ్య మహాప్రబంధే
ప్రోక్తేద్భుతే గరుడవాహన పండితేన।
క్లుప్తం యతీశమహితామృతవృత్త మాంధ్యాం
శ్రీశింగరార్యవిబుధో విలిలేఖ భక్త్యా ॥

రామానుజసహస్రాబ్ది మహోత్సవశుభస్మృతిః
సేయం భవేద్యతీశానపదాంబుజపరిష్కృతిః